# పండితాభిప్రాయములు

సమస్త కళ్యాణగుణాకరుడును నిరతిశయానంద యుక్తుండును అగు శ్రీయఃపతి సర్వచేతనోద్ధారణమునకై యీభూమియందవతరింప వారిగుణ గణములను వివరించు వేదము శ్రీమద్రామాయణరూపమున యవతరించెను. దీనికే సీతాచరితమని పౌలస్త్యవధయని నామాంతరములుగలవు. వాల్మీకి వెయ్యేసి శ్లోకముల కొక్కొక్క గాయత్రీబీజాక్షరమునుంచి బహు చక్కగా రచించెను. అట్టి శ్రీమద్రామాయణమందలి కథనుబట్టి శ్రీతులసీ దాసులవారు రచించిన హిందీరామాయణమును బాగుగాజదివి శ్రీ టంకాల సాంబమూర్తిగుప్తగారు మృదుమధురశైలిలో స్త్రీబాలురకు సహితము తెలియునటుల భక్తిభావముట్టిపడునట్లు అంధ్రీకరించిన మొదటి మూడు కాండలు చదివించి వింటిని. శ్రీగుప్తగారిని సర్వేశ్వరుడు ఆయురారోగ్యము లిచ్చి రక్షించుగాత—

ఇట్లు

శ్రీమదుభయ వేదాంతప్రవర్తకసుప్రసిద్ధ పౌరాణిక

**కే. కే. వెంకటనరశింహాచార్యార్**

**25-5-1956 (మకాం) తెక్కలి**

★

ఏతద్రామాయణ గ్రంథకర్తలగు శ్రీ టంకాల సాంబమూర్తిగుప్త గారు మాస్థానికులు. నాకు చిరకాలమిత్రులు గ్రంథమునుగూర్చి యభి ప్రాయమొసగెడి భాషాప్రవేశముగాని మూలగ్రంధపరిచయముగాని నాకు లేశమపి లేకున్నను నామిత్రులు నాయభిప్రాయమును ప్రేమపుర స్సరముగ నడుగుటచేత నేనవగాహనము చేసికొన్నది వ్రాయుచున్నాను.

ఈ గ్రంథము తన భాషాప్రౌఢిమజూపుటకు వ్రాయబడలేదు. జటిల దీర్ఘసమాసవ్యాకరణాదినియమములు పాటింపబడలేదు. మఱి కేవల భక్త్యావేశముచే తరించవలెననెడి భావమే గ్రంథరచనకు బ్రధానమగుచు నట్లుదోచెడిని. ఈ వృద్ధాప్యమునందు నిట్టి భక్తిశ్రద్ధలు గల్గుటయు వానిని

శ్రీరామభక్తిమనస్సు [illegible] నుపయోగించుటయు నెంతయు ప్రశంస
నీయము. మహాకవి [illegible] యునుండుటయు భక్తులకు వదాన్యులకు రాజ
కీయవేత్తలకు వేదాంత [illegible] ఘనకార్యధురంధరుల
కునికిపట్టయియున్నది. ఈ [illegible] నట్టి ప్రశస్తికి లోపము లేకుం
డుటకు గర్వించుచున్నాను. శ్రీరామచంద్రమూర్తి భక్తశిఖామణికాయురా
రోగ్యములిచ్చి యిట్టి సద్గ్రంథరచనకు ప్రోత్సహించుగాకయని హృద
యపూర్వకముగా కోరుచున్నాను. ఇట్లు,

శివల సుబ్బారావు

(శ్రీ భగవద్గీతగాంధీజీ, పార్నెలిక్, ఆజా జవహర్ మొదలుగాగల పంచవింశతి ఇతిహాసాంధ్రగ్రంథరచయిత)

★

ఉభయభాషాప్రవీణ
ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు

బాపట్ల,
11-3-56

శ్రీ టంకాల సాంబమూర్తిగుప్త గారికి: —

ఆర్యా, నమస్కారములు. మీరు ఆదరముతో పంపిన మీరచనలు చేరినవి. మీసారస్వతసేవ చాలా ప్రశంసనీయము. మీ ఆదరమునకు కృతజ్ఞురాలను.

సోదరి,
ఊ. లక్ష్మీకాన్తమ్మ.

★

శ్రీ టంకాల సాంబమూర్తిగుప్త గారికి: —

గెంబలి లక్ష్మణస్వామిగాంధి నమస్కారములు. తమరుదయతో పంపిన శ్రీతులసీ రామాయణ ఆంధ్రఅనువాదగ్రంథములందినవి. శ్రీవాల్మీకాది మహాకవులు రచించిన రామాయణములకు వారివారిపేర్లతో నామమిడినట్లు మీరు రచించిన గ్రంథమునకు శ్రీ సాంబమూర్తిగుప్తరామాయణమని

పేరుంచిన బాగుండునని తోచుచున్నది. తామురచించి యితరుల తరింపజే యునట్టి చదువేచదువు. తామురచించిన రామాయణమును చదివినందున నాకు గల్గిన జ్ఞాన కాంతి చీకటియనునది లేకుండా చేసినదని మనవిచేయు చున్నాను. మీరొనర్చిన అపారమానవసేవకు మీకు ఋణపడియున్నాను. తక్కిన కాండములు పంప గోరుచున్నాను. భవరోగమునకు మందు కనిపెట్టిన మీచరణసేవకుడు—

7—9—55 }
బొబ్బిలి }
గెంబలి లక్ష్మణస్వామిగాంధీ



## "రామదర్శనం"

### మాసపత్రిక, పిడుగురాళ్ళ

శ్రీ తులసీ రామాయణము హిందీలోని తులసీ రామాయణమును అనుసరిస్తూ శ్రీ టంకాల సాంబమూర్తిగుప్తగారు వ్రాసిన తెనుగువచనము గ్రంధకర్తగారి భక్తిపూర్వక సేవ స్తుతిపాత్రమైనది.



ఆర్యా;

తాము ప్రేమతోపంపిన తమస్వీయరచన ఆంధ్రవచన తులసీ రామాయణమందలి మొదటిరెండుకాండములందినవి. ప్రస్తుతనాజీవితాంత సమయమందు నన్ను తరింపజేయుటకు ఆశ్రీరామచంద్రమూర్తి తన భక్తులైన తమరిని పురిగొల్పనుండనోపు. జనబాహుళ్యమునకు అందుబాటుగాను సులభగ్రాహ్యముగాను ఉన్నవనుటకు సందేహములేదు. ముఖ్యముగా వైశ్యకులసంజాతులయ్యూ, మనవంశమునకుప్రతిష్టను తెచ్చినవారైరి. మీకు శ్రీరాముండాయురారోగ్యములొసంగి రక్షించుగాకయని ప్రార్ధించుచున్నాను.

పాలకొండ }
5—1—55 }

విధేయుడు,
బుగత స్వామిశెట్టి. B. A.
రిటైర్డు సబ్ రిజిష్ట్రారు.

శ్రీ టంకాల సాంబమూర్తి గుప్తగారిచే రచింపబడిన శ్రీ రామాయణ కావ్యమును అచ్చటచ్చట చదివితిని. చెరకునకెన్ని వంకలున్నను, యెన్ని చేతనున్నను, తన మాధుర్యము విడువనట్లు శ్రీ రామచంద్రపరబ్రహ్మానందమూర్తి యొక్క పావనచరితము యెవరి నోట వెలువడినను మధురాతిమధురమై, జీవితతరుణోపాయమై, పావనమై, అలరారగలదు. అందునను పూర్వజన్మపుణ్యఫలాతిశయమున ఆగర్భశ్రీమంతులయ్యూ, భక్తాగ్రగణ్యులగు శ్రీగుప్తగారి హృదయపద్మమునుండి వెలువడిన శ్రీరామ చరితామృతము భక్తబృందములకు ఆనందసంధాయకమగుటలో నాశ్చర్యమావంతయూ లేదు

"రామ" అను పావనాక్షరసంపుటిలోనున్న మాధుర్యము మాహాత్మ్యము ద్రాక్షారసపానమునగల ఆనందము అనుభవైకవేద్యమే కాని అనుటకలవి కానట్లు నిరంతర రామనామజపాచరణులకే వేద్యము కాని లౌకిక పామరజనులకు కడుదవ్వు ఎరుగని యూరరుగుటకు బాటయే తోచగునట్లు జీవితపరమావధిని గనుటకు నిరంతరరామనామజపమే గురు పరమాత్మయని అనుభవమున నేననగలను.

శ్రీ టంకాల సాంబమూర్తిగుప్తగారు శ్రీయుతులు కళాప్రపూర్ణ ఆంధ్రకాళిదాస బిరుదాంకితులగు మాపితృదేవులు కీర్తిశేషులు వేంకటమార్యప్రసాదరాయ కవిపుంగవులకు బాల్యమిత్రులు, పరమభక్తులు నిష్టాగరిష్టులు స్ఫురద్రూపులు "యత్రరూపం తత్రగుణా" అను న్యాయము వీరియందు సార్థకము. వైశ్యకులజనితులయ్యూ కులసమాజ ప్రేమాస్పదయగు ఆత్మకన్న కోడలివలె అనురాగముతో నాదరించి సేవించు భాషాభిమానులు. శ్రీరామచరితామృతముగ్రోలి తాము తరించుటయేకాక పాఠకలోకమునకుగూడా తరింపచేసిన శ్రీ సాంబమూర్తి గుప్తగారికి శ్రీరామచంద్రమూర్తి ఆయురారోగ్యములిచ్చి ప్రోచుగావుత...

సిద్ధాంత
6—8—56

ఇట్లు,
త్రిపురాన తమ్మయ్యదొర
శ్రీమద్రామనామజపానుభవకావ్యకర్త

# విషయసూచిక.

విషయము | పుట

## సుందరాకాండము

విషయము | పుట

విషయము | పుట

విషయము　　　　　　　　　　　　　　　　　　　పుట

విషయము | పుట
--- | ---







టంకాల సాంబమూర్తి గుప్త - వీరి ధర్మపత్ని

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః

# శ్రీతులసీరామాయణము

## కిష్కింధాకాండము



## (వచనము)



### —♦ ప్రార్థన ♦—

క. పావని సేవితపదరా।
జీవా; నతసర్వజీవ । స్నేహాదృత సు।
గ్రీవా, కరుణాపూరిత।
భావా, బాహాబలజిత । పంక్తిగ్రీవా॥

### 2. —♦ శివుండు పార్వతికి, కిష్కింధా కాండము వినిపించుట ♦—

కుందేందీవర సుందర, అవయవములుగలిగి గో, సాధు, భూసురలు గుంపులుగాగలిగి రాక్షసుల శిక్షింప నుద్యుక్తులై మానిబృందంబు సంతసింప సతీజానకిని అన్వేషించుచూ పోవుచున్న గోవిందాంశోద్భవులను రఘూద్వహులసంప్రీతిని ప్రశంశించెదను. వరధన్వులు మునిసన్నుతచరితులు ధర్మకర్మపరులు మాయానగులు ముష్కర శత్రునాశకులు విజ్ఞానఖనులు

అయిన రాఘవకుల భీకరులను గొలుతును. కమలజవార్ధిజంబు కవి కల్మషనాశన మవ్యయంబు మారమణ ముఖేందు సుందర వరంబు శుభప్రదంబెట్టివారికైన [ఉగ్రసంసరణ శోకరుజాప హారంబు యగు రామనామంబను సుధారసమును యెల్లవేళ లనూ బుద్ధిమంతులు గ్రోలెదరు.] భక్తజనతాప పాపముల సంహారించి విజ్ఞానమును భువియందు రాజిలజేసి ముక్తికి స్థాన మొనర్చి మునులు స్తుతించురీతిని కాశీనగరము క్షేత్రముగా జేసిన శంకరుని సన్నుతించెదను.

పాలసముద్రమందు గరళము నొసంగినట్టి పాపముపోవ రామనామామృతంబు నిరామయంబుగా కాలకంఠుండు సత తమూ గ్రోలుచుండును.[కాశీపుణ్యరాసియనగా వాసికెక్కెను. అచ్చట మరణించుజీవులకు ఆదరించి రామతారక నామమంత్ర మునుజెప్పి మోక్షమొసగెడు నిటలాక్షుని బొగడెదను. ఓ శైలాత్మజా వినుమా మందరగిరినిబోలు రామకథసంసారాబ్ధిని దాట కైవల్యవిద్యాసుధానందానంబు నుమా గ్రిహింపుము. యనుచూ ఆశ్రీకంఠుడు (శివుడు) కిష్కింధాకాండము నిట్లు చెప్పదొడగెను. వినిపించుదును.

—• శ్రీ రా మ ల క్ష్మ ణు లు ఋ ష్య మూ క ం బు న వి శ్ర మి ం చు ట •—

ఆద్యంతములు శ్రద్ధతో వినుమా, పార్వతీ తనుమధ్యా; ఆవనజాతనేత్రుండూ సుమిత్రాపుత్రుండూ ఆనిర్జనారణ్యమున సీతారమణీ శిరోమణిని వెదకుచూ ఋష్యమూక పర్వతమును

గని విశ్రమించి అతిదుఃఖస్వాంతులై ధరణీరాజ్యమును విడనాడి కన్నతలిదండ్రులబాసి సమస్తజగత్తు అస్థిరమని యోవగించి, ఆత్మలోకుందక కానసమునకు చనుదెంచిరి. ఇవుడిట్టి దుర్ఘట నము సంభవించిందని వెనుకకు మళ్లరు. సరేకదా విచారముచే కుంగరు. ఓపార్వతీ, ధీరుల లక్షణ మిట్లేయుండునునుమా! ఋషులయునికిపట్టయిన ఈఋష్యమూక పర్వతమున విశ్రమిం చిన వీరవరులజూచి వాలివలన భయముచేత ఉపవాసమున్న సూర్యపుత్రుండు (సుగ్రీవుడు) హనుమంతునితో నిట్లనియె.

## — సుగ్రీవుడు శ్రీరాముని చరితము కనుగొనుమని హనుమను పంపుట —

హనుమా చూచితివా వారలు యెంతశూరులో! విస్తారముగు కష్టములుబొందివచ్చినవిధాన వారి జాడజూడ కనపడుచున్నది. గనుక ఒకమారువెళ్లి వారల చరితము పరికించి రమ్మనెను. భూతలరాజులో పురుషశ్రేష్ఠులో యెవ్వరోగ్రహించి, సాంకే తిక సంజ్ఞతో నెరిగింపుము. ఓవాతపుత్రా! వారలు వాలిపం పగా వచ్చినవారని తలంతువేని నీముఖంబువంచిన నేను గ్రహించి తక్షణమే యీపర్వతమునువిడచి కానసంబునకు పారిపోవుదునని తెలవిచ్చిన సుగ్రీవుని యానతి నవధరించి, బ్రాహ్మణ బ్రహ్మచారిరూపమును ధరించి వీరరాఘవసిం హులు విశ్రమించుస్థలమునకు ఆ యనిలనందనుడు నేగెను. స్వస్వరూపంబు కన్పట్టకుండ మస్తకమువంచి భక్తితోనమస్క రించి మహానులంబోలిన రామలక్ష్మణులచెంత యావానర కుల

వరుండు నమ్రుడై నిలచెను. రామసోదరులు బ్రహ్మర్షులంచు భక్తితో నమస్కరించెనో? దివ్యరూపులవుటంజేసి దేవాంశభవులంచు వినతుడై మ్రొక్కులర్పించెనో? శ్రీరామలక్ష్మణులు చిద్విలాసులంచు దలంచి నమ్రుడై నిలచెనో? మూలవిరాట్టిట్లు పుణ్యస్వరూపములదాల్చి ఏతెంచెనోయని యెరుగెనో? పుణ్యపురుషుల జూచునపుడు నమస్కరింపవలెనంచు నట్లొనర్చెనో? సకలగుణధాముడగు రామచంద్రునందు యేమిపరికించెనో యాతడే యెరుగుగాక.

—: వా యు పు త్రుం డు శ్రీ రా మ చ ం ద్రు ని తా మె వ రో తె ల్పు డ ని వే డు ట :—

నరనారాయణులో భవాంశభవులో,సన్నేలు పుణ్యాత్ములో ధరపైని బుట్టినయనంతులో, జ్ఞానసంపన్నులో, హరులో, సిద్ధులో, సాధ్యులో, గరుడులో, యక్షప్రభూత్తంసులో, నరులో, కిన్నరులో యెరుంగనగునా. నాబోటివానికి చెప్పుడీయని జ్ఞానచంద్రికలుగల మీముఖపూర్ణ చంద్రబింబములు పద్మములవై ఖరిమెచ్చని మీవిశాలనయనంబులు ధర్మదేవతకు స్థానములైన మీపవిత్రగాత్ర సౌమ్యములు మీరిర్వురూ అమానుషవిగ్రహులంచు దెల్పుచున్నవనెను. ఇంద్రనీలము స్వర్ణము యిట్టి మానవాకృతులదాల్చి వచ్చినట్లు మీర లిరువురు యెవ్వరో వీరవీరులు ధీరవరులు అని మీతీరుజూడ తెలియజేయును. కంటకావృత ఘోరకాంతార కఠినతను మీపాదపద్మంబు లెట్టులోర్చెను. గ్రీష్మాది దుస్సహాబాధల

మీకోమలాంగంబు లెట్లుసహించెను. మణికిరీటములకు కుంద నంబులబోలు మీతలలు ఇట్లేల జడలుదాల్చెను. త్రిమూర్తు లగు దేవతలలో మీరెవ్వరు? తృతీయుం డెచటనుండెను? "పరోపకారార్థ మిదం శరీర"మనెడి నార్యోక్తి బాలింప నరుగ దెంచిన క్షత్రియులామీరు? నాసంశయముదీర ఓఆర్యులారా! దయయుంచి యానతిండనెను. ధరణిని కాపాడగ నిదేతరుణ మంచు తలంచి ధర్మతత్పరులై యీరీతిని మాయానరవేషధా రులై నరుదెంచిన నరనారాయణులా?

—శ్రీ రా ము ం డు త న గా థ ను వి ని పిం చు ట—

అనిన విని, రాముండు హనుమంతునిగని తనమృదు దేవవాక్యముల దనివోవ విని విశదమగునట్లు తన స్వకీయ గాథను వినిపించెను. అయోధ్యానగరమును పాలించెడు దశరథ మహారాజు మాజనకుండు; మేము యావంనత్యవచః ప రి పా ల నా ర్థ మై వనవాస మొనర్చుచుంటిమి. మాది భాస్కరవంశము. వీడు నాతమ్ముడు లక్ష్మణుండు. సుజనావన దక్షుడీతడు. నేను రాముండను. భరతశత్రుఘ్నులను సోదరు లింకగలరు. వారు పురవరంబున నుందురు. మాతోడ బాలతి యొర్తు అరుగుదెంచెను. ఆపెను దైత్యులపహరించిరి. ఆమె జాడెరుగక వెదకుచున్నామనియెను. బ్రాహ్మణసురుండవో, అం భోజసంభవుండవో, సాధుజన కింకరుండైన శంకరుండవో, నీదు వృత్తాంతమంతయూ నింక తెలియజేసి ఓజ్ఞాననిలయా మానమ స్కారము లందుకొనుము. శ్రీరాముని వాక్యసుధాధారలతో

దోగి ధన్యుండనైతి. పారబ్ధలబ్ధఫలమున శ్రీరామవిభునిగం టిని తృప్తినిగంటిని అనుచూ నమస్కరించి నయనాంబుజ బాష్పధారల తనువును తడపి రామునిగొల్చి దేవనుత దివ్య రూపదర్శనము లభించెనంచు మదిసంతసమంది యీగతిని వచించెను.

## —: 7. ఆంజనేయుండు శ్రీరామునితో తనవృత్తాంతము దెల్పుకొనుట. :—

భవదీయ మాయావివశుండనై, నీవెవండవో నెరుగ జాలక అవివేకినై అజ్ఞుండనైతిని. నేను మోసమతిని. జ్ఞానము లేక ప్రశ్నించి జడుండనైతిని. నీవెవండవో యూహింప నా వశమా? ఓవైకుంఠనాథా నన్ను నీవెరుగవా? చెప్పుమా. పామ రునియట్లు నటించెదవా? నీమాయనుజిక్కి పొరబడ్డాను. నీ చరి త్రను తలపోయక మోసపోయాను. నీచరణయుగంబులభజించి భవసాగరమునీది తరింపనున్న కింకరుండను. నేను వానరుండను, నన్ను నీదరిజేర్చి ఉద్ధరింపుమాయనెను. సర్వశక్తి సంపన్ను డవు సర్వసాక్షివి రాముండవు అమృతధాముండవు నాప్రభు వరుండవు, నేను నీసేవకుడను. స్వామికంటే శ్రేష్ఠుడగుదునా? ఓయినకులేశా! నీమాయ నెట్లెరుంగుదును. నీవుచైతన్యమూర్తి వని నేనెరుగలేక చింతించితిని. నీవు యేతన్మాతుండవుకావు. ఓయనఘా! నాతప్పు క్షమింపుము. నీసేవకుడనుసుమా, రామా మాయావిమోహితులజేసి జీవులకు ముక్తినొసంగెదవు. ఓనిరు పమాకారా, రఘువీరా, నావాక్యములకు ప్రమాణమునీవే

జ్ఞానపథంబున జేరి, నాప్రభువర్యుని భజింపగోరెదను, కాని తద న్యమును స్వప్నమందైన మదిలో తలపోయను. సుతుడు, తండ్రినిగాక అన్యులను నమ్మునా? స్వామినిబాసి సేవకుండు యితరులను విశ్వసించునా? ఓ మునిహితకామా మధురనామా, శ్రీరామా! భక్తుని పోషించి రక్షింప ప్రభువు నిల్చియుండగా సేవకుడు నిర్భయమున వసుధనెల్ల విహరింపవచ్చుగదా?

—: 8. హనుమంతుడు తన నిజరూపమును జూపుట :—

ఇట్లునుతించి రాఘవునిపదాబ్జముల వ్రాలి భక్తితో కనులు మోడ్చి మేను గగుర్పాటుచెందగా లేచి తత్క్షణమే నిజ వానరాకృతిని దాల్చినయంతనే శ్రీరాముండా హనుమంతుని అత్యంతానురాగముతో కౌగలించుకొనియెను. అన్యరూపముతో హనుమంతుడున్నంతవరకూ శ్రీరాముండు దూరముగానుండి నిజరూపము ధరించగానే ప్రేమతో కౌగిటం జేర్చెను. రామచంద్రుండు కనుల నానందబాష్పములుత్యజించి భక్తుని శిరంబు దడిపెను. ఆ యనిలసుతుడు ప్రేమరసమున స్నాతుడై హృదయతాపమణగెనని సంతసించెను. అంత మార్తాండకుల దీపకుండు ఆదరమున హనుమంతుని యాత్మ నెరిగి, భక్తజనశేఖరుండను భావమున ప్రేమతో నిట్లనియెను.

—: శ్రీరాముం డాంజనేయుని భక్తికిమెచ్చుట :—

అనుమానింపకు ఆంజనేయా. నీసహజసౌహార్ధంబు, నీ వర్తనము అనురాగహేతువు లగుటంజేసి నేనామోదమును

జూపి నీకనుకూలించునటుల నీపరిస్థితులనువినిపాలించెదననుచూ అన్యులబూజింపక నన్నహర్నిశము విశ్వసించి భజించి సేవించునట్టి నాభక్తునకు నేను సేవకుడను. ఈచరాచర జగంబంతయూ నేనేయనినమ్మి నిశ్చలభక్తితో ధ్యానించునట్టి ఆర్యుడు నాకు ప్రేమాస్పందుడు అనియిట్లు అత్యంతకూర్మితో బలికిన వనజాక్షుని ప్రసన్నవదనముగని యాంజనేయుండు మొనలేనిభక్తితో నిట్లనియెను.

—: అంజనీతనయుడు శ్రీరామునితో సుగ్రీవునిగూర్చి విన్నవించుట. :—

ఓ ధీవరా లోకపావనా విశిష్టజనావనా శ్రీవరా రామభూవరా! సుగ్రీవుండను వానరనాధుడు, ధీవరుడు సజ్జనవిధేయుడు సద్గుణమందనుండు నున్వాశావుడు గిరిపైనివశించుచున్నవాడు, మీామైత్రికీ సేవకూ దగినశిష్యుడు. అతనికష్టంబువారింప నభయంబిచ్చి స్నేహాముచేసెదరేని వెంటనే వానరబలమునంపి మీాకార్యభారమునుబూని సీతామతల్లియుదంతమును నిస్సందేహాముగా మీాకు దెలుపును.

—• వాయుతనయుండు సుగ్రీవునితో శ్రీరామునిగూర్చి విన్నవించుట. • —

అని శ్రీరామలక్ష్మణులను తనరెండుచేతులతో మ్రొక్కించయ్యానపర్వతముపైదాటి తనకైవచ్చుట నిరీక్షిస్తున్న సుగ్రీవునిగాంచి ముందునిలచి శ్రీరామునిదర్శించితిననిమనవిచేయగా

భళిరా ధన్యోస్మి యనుచూ సుగ్రీవుండు సంతసించెను. పిమ్మట హరింజేరి ఓయనఘులారా! నాజన్మ తరించి పావన మైనది. నాపుణ్యఫల మింతంతకాదు. తాము, యీాయాసనము ల లంకరింపుడు. అతులమతులారా! నానమస్కృతు లందు కొనుడు. అనుచూ శ్రీరామలక్ష్మణుల ప్రార్థించి, ఆసనాసీను లనుజేసి అర్కసుతుండు సుగ్రీవుడు "ఆత్మభక్తునకు హితమైన దాని దైవమేఘటించునని మదినలరినంత.

-: హనుమ శ్రీరామ సుగ్రీవులమధ్య సఖ్యంబు కుదుర్చుట :-

మ తి మ ం తు డు, బు ద్ధి మ ం తు డు యగు హనుమంతుడు రామసుగ్రీవులంజూచి, ప్రస్తుతించి అన్యోన్య కష్టవృత్తాంతముల వచించి, దేవతలు సన్నుతించురీతిని ఉభయులకునూ సఖ్యమును కల్పించెను. శ్రీరాముండు అగ్నిసాక్షిగా అభయమొసగి యాతనితో స్నేహముచేసెను. యెట్టి యాపదవచ్చినా విడనాడననియూ సాయముచేతుననియూ రామునితో. భాస్కరసుతుండు పలికెను. (సుగ్రీవుడు) వహ్నిప్రసాదభావంబున శ్రీరామచంద్రసోదరులు అవతరించిరి. యజ్ఞాన్నిపాలించుకొరకు స్త్రీ హత్యనువెనుదీయక రాముండు తాటకను వధించెను. వీతిహోత్రునిసాక్షిగావిల్లువిరచిరాముండు సీతనుపెండ్లాడెను. అగ్నిహోత్రముయందే యాత్మరూపంబు దాచి, సీతాదేవి మాయోపేతయయ్యెను. అగ్నిచేతనే లంకను యనిలసుతుండు దహించెను. అగ్ని రామాయణముకు మూల బీజము. అగ్ని సకలజీవుల హృదయమందుగలదు. బుధులు,

అగ్నిని ప్రత్యక్షదైవమనెదరు. అంత రామానుజుండు (లక్ష్మణుడు) సుగ్రీవునితో రాక్షసులు శ్రీరామచంద్రుని రామను యపహరించిన యుదంతమంతయూ వివరించిచెప్పగా సుగ్రీవుండు రామబ్రహ్మమునుజూచి యిట్లనియెను.

అర్కసుతుండు అర్కకులునకు రాగలకార్యము
—: విన్నవించెను. :—

నీవు అర్కకులుండవు, నేను అర్కసుతుండను. మనయిద్దరికీ సతీవియోగములు సమానములు. ఓయినఘా! మనయిరువురకూ శత్రుసంహారణేచ్ఛకూడ సమానమే. ఆకారణముచే మనస్నేహము అనివార్యమనెను. మిథిలవంశాభిజాత నీమెలత మిన్న. మన అపారదుఃఖ సముద్రమథనమువలన నీగృహలక్ష్మి చేకూరును. ఓనిర్మలాత్మా! దైవానుకూలమున, కోర్కెలు కూడా ఫలించును.

సుగ్రీవుండు జానకీదేవి యాభరణములను
—: శ్రీరామునకు జూపుట :—

నామంత్రిపుంగవులంగూడి కార్యమరయుచూన్నొకనాడిట నుండఉపరిభాగమునుండిఒకయతివ వస్త్రమున ఆభరణములగట్టి పడవైచెను. ఓ యినకులతిలకాయీయాభరణములనుజూడుడు ఆవనితామణి యేడ్చుచు ముల్లెనుగట్టి జారవిడిచిన వివియే యని యిచ్చెను. రామచంద్రుడు స్వర్ణాభరణములెల్ల యాతురతతోచూచి హృదయమునకద్దుకొని తమ్ముని బిలచి వస్త్రాభరణములచూచి పోల్చి చెపుమాయనితమ్మునికొసంగెను. నిత్యమూ

పాదాభివందన నియతివలన జానకీదేవి పాదభూషణములు మాత్రమే యెరుగుదును. అన్యంబు లెరుగను, మహాత్మా యనుచూ రామానుజుండు యేడ్చెను. ఓ రాఘవులారా! జానకిని అన్వేషింప యత్నంబులను జేతును. విరహాగ్ని తప్తమతులై కార్యసాధనమార్గమును విడనాడి రోదనముచేయుచూ ధైర్యమునువిడనాడరాదు. యని సుగ్రీవుండు ధైర్యముచేకూరునట్లు పల్కెను.

-(15. రాముండు సుగ్రీవుని నిజవృత్తాంత మెరింగింపుమనుట)-

అంతట రామచంద్రుడు దయాపరతంత్రుండై సూర్యపుత్రుని నిజవృత్తాంత మెరుగనట్లు యాతనిదాపుననిలచి ఇట్లేకాంత గుహాంతరంగములు కాపురముండుటకు హేతువేమనియూ యింతభయమున మెలంగుట కేమి కారణమనియూ అంతయూ నాకెరింగింపుమని పలికెను.

నీవెవండవు? యీవానరులతో నిచటనుండుటకు హేతువేమి, నీనివాస మేది, నీతలిదండ్రులెవరు? ధన్యచరితా యని సుగ్రీవుని రామచంద్రుడడిగెను. మనుజునిమాటలు క్రియలూ మన్నింపదగిన నీపవిత్రలక్షణముల వానరాకృతి దేహము విరాజిల్లుచుండుట కాంచుచున్నాను. ఆబ్రహ్మదేవుడు నరవానరజాతికి మైత్రికూర్పగా నిన్ను సృజించెనా ఓసఖుడా! నీచరితము నెరిగింపుమునాకు నిత్తరిని యన్న వినుండని సుగ్రీవుండు యీ విధంబున మనవి చేసుకొనెను.

—సుగ్రీవుండు రామునకు తనజన్మవృత్తాంతం బెరిగించుట—

ఒక దినంబున బ్రహ్మ తన వ్రేలితో నేత్రమలంబుదీసి నేలను బడవైచినంత ఒక లావరియైన వానరు డాక్షణంబున జననమొందెను. వాడు బలసంపదచే తనకు సమానుండగు ననుచూ యూవిరించి వానికి "ఋక్షరాజు" యని సార్ధకనామ మిడెను. అంత నవ్వానరోత్తముండు అబ్జభవుని పాదంబులపై బడి నేను చేయదగు కార్యమెయ్యదియో చెప్పుమనిన ఆవనజ భవుం డిట్లనియెను. అనివార్యబలమున వనంబులలో నంచ రించుము. నీకెదురైన దనుజుల సంహారింపుము. తనివిదీర ఫలంబులను తినుము. మీారగరాని మేటియని ఘనతనుబొం దుము. భూతలంబునయున్న ఉత్తములను గాచుచుండుమనెను. అనిన మీాయాజ్ఞను పాలింతునని వానరోత్తముడు వనముల విహారించుచుండ నొక్కనాడడవిలో నొక్కయెడను; నలువైపులా వృక్షపంక్తులతో శోభిల్లుచున్న గుండము పలు విధంబులగు కుసుమముల తావినొనంగెడి భాండమూ ప్రఫుల్ల పంకజమండమూ యున్నట్లున్న దానిని కీశసత్తముండుపరికించెను. గుండములో తన ప్రతిబింబమునుగాంచి ప్రతిఫలించిన తన వికారరూపమునుజూచి అన్యుడెవ్వడోలోనుగలడంచు తలచి అరచెను. దానిప్రతిధ్వనిని తానువిని ఆగ్రహావేశముతో నందు గుప్పించి, స్నాతుడై అరుదెంచి, తనశరీరమున నింతమార్పు గలిగె నెందుకని చూచుకొనగా తానొకచక్కని సుదతిగా మారుట కనిపెట్టెను. భళిరా యేమియింత తొలిరూపుతొలగి

పద్మాక్షినై యుంటిని. ఇది కలయో భ్రాంతియో నిక్కమో లేక నాకర్మమో యీగుండముజొచ్చిన వారు తళుక్కులొత్తు కల్కులౌదురా? జలజాతోద్భవుని మాయయా? నాపుంసత్వం బెటుల క్షీణించెనో కదా? మగతనము పోయెననుచు భగవంతుని మాయదెలియవశమా, యనుచూ నుండ యావగలాడిని ఇందుృడూ, భాస్కరుడూ జూచిరి. ఆమెచక్కదనంబు యిందు్రడుకామార్తుడై జూచి మోహించి తనయింద్రియంబువెలది వాలంబుపై జారవిడచినంత రెండవశూలియనందగు వాలిజన్మించెను. కాగా ఆపె ముఖపద్మమునుజూచి భాస్కరుడువలచి వీర్యమును నిలుపలేక యాపడతిగళమున బడునట్లు విడిచినంత, సుగ్రీవుండను నేను జననమొందితిని. మమ్ముగాంచినపిమ్మట, యామెకు మగతనంబు అక్కజముదోప గలిగెను. అతడు మా యిరువురనూగొని యబ్జభవునకీయుదంత మాద్యంతమూ నెరుక జేసెను. వనరుహసంభవుండు (బ్రహ్మ) వానరనాధునిచరిత్రమంతయువిని, భగవత్కృతంబుగనుక విచారింపవద్దనియూబలంచేకూరుననియూ చెప్పి, ఉత్తమోత్తములైన తనయులగంటిగదా! లోపముండదని మమ్మునుజూచి తనచతుర్ముఖములనుండి చిరునవ్వులతోపలికెను. ఓధీవరులారా! దక్షిణదిశకుజనిఅచ్చటకిష్కింధా నగరముగట్టి అతులరాజ్యమునుస్థాపించి మీ యిష్టానుసారం అఖిలసుఖముల ననుభవించుచూ నుండవలెననెను. రఘుకులమున దశరధరాజవరుని గర్భమున ఆదివిష్ణువు ఆవిర్భవించి వనవాస మొనర్పగలడు. ఆతని దర్శనమువలన మీకు సకలకల్యా

ణములు సంఘటిల్లునని. అబ్జసంభవుని వాక్యములువిని, వానికి మ్రొక్కి కిష్కింధకువచ్చి మేము సకలరాక్షసుల నిచట సంహరించి యెల్లరు సంతసింప ఖ్యాతిగాంచితిమి.

-♦ సుగ్రీవుడు రాఘవునితో వాలి బలాతిశయములదెల్పుట ♦-

మాయన్న వాలి బంధు శ్రేణి స్తుతించునట్లు, రణమందు కౌశల్యముజూపి శత్రువులశాసించి, గర్వముగల శత్రువుల మర్ధించుటలో యశంబుపొంది దశదిశలూ తనకీర్తి వ్యాపించు రీతిని కిష్కింధా రాజ్యమును యేలెను. వాడు నిజముగా విజయ శ్రీధాముండుసుమా; రావణునితో స్నేహము చేకూరినవరకూ వాలి దనుజాంతకుడని ప్రఖ్యాతిగాంచెను. వారిరువురకూ కామినీవాంఛ యేకమగుటచే సఖ్యంబుమేర మీరెను. అదే అట్లుండ ఒకనాడొక యుగ్రవీరుడు త్రిదశా రాతివీరుడు; గర్వియై తన్నెదిరంపగలమేటి ఎవ్వడూ లేడని యెంచి మాపట్టణమున జొచ్చెను.

-♦ మాయావి దుందుభులచరిత్ర రామచంద్రునితో చెప్పుట ♦-

మాయావి దుందుభులనెడి యిద్దరూ మయుని కుమారులు, వారలసాధ్యులు దేవతలను సహితమూ పీడించెడివారు. వారిరువురలో దుందుభియనెడివాడు అతులబలుండు వాని ఘోరమింతింతయని వర్ణించుటకు వీలులేదు. ఆకాలాంతకుడైనా భీతిల్లి వానియెదుట నిలువజాలడు. దుందుభి కంఠధ్వని రణదుందుభివంటిది. వినినచో ధూర్జటికైనా దుందుడుకు బుట్టును. ఓయనఘా! మాయావియనువాడహంకరించి పుర

బహిర్ద్వారమున బొబ్బరించి, రమ్ము రమ్మనినంత శూరుండగు వాలి లయకాలశూలివలె విజృంభించెను. కాలమేఘగర్జనవిని సింహముమారు గర్జించునట్లు బొబ్బరించిన మాయావియుబ్బు అణంగునట్లు దశదిశలూ వణకునట్లు వాలి గర్జించెను. శత్రువుని విజృంభణము యేమాత్రమైనా సహించజాలని వాలి అత్యుగ్రుండయి తన భుజములయందు ధీకొట్టుచూ ఆకాశము దాకినట్లుగా గర్జించి రారమ్మని వానియురమ్మున బొడిచెను. పిడుగులుపడినటులు పృథ్వీకంపింపగా తన ఒక్కపోటునకే బింకముచెడి దరినున్న పర్వతమునకు జనగా వాలి తనను విడువక వెంటాడి అడవింగల యెల్లజంతుచయమూ మునులూ, భీతిల్లినటులుగర్జించెను. అంత గిరి గుహాప్రాంతనిలచి పరికించుచూనుండుము. వీనినిజంపి సత్వరముగ వత్తునని నాతో మాఅన్న చెప్పి నేను చలింపక సుస్థిరమైన ధైర్యమునువహించి కందరమునుగాంచుచూ ఒక నెలవరకూ నిలచితిని రామా, వాలి రాలేదునరే శైలగహ్వరమునుండీ రక్తప్రవాహము పొరలి వచ్చెను. వాలినిజంపి ఆగాక్షసుడు బయటకువచ్చి నన్నుకూడా చంపునేమోయని భయపడితిని. వాలినేజంపినట్టి బలవంతుడు నన్నువిడుచునా యని సాక్కితిని. మరేమియూ బాలుపోక పలాయనమే కర్జంబని ఆశైలమునుండి ఆత్మపురంబుప్రాంతకు పర్విడితిని. పిమ్మట పీటికెంజని స్వాస్థ్యముజెంది, వాలి వైరిచే మరణించియుండునని, మంత్రులతోను, ఆప్తబంధువులతోను జరిగిన వృత్తాంతమంతయూ దెలిపి చాలాదినములవరకూ వేచి

వేసరితిని. అంతనొకదినంబున మంత్రులీవిధమున బల్కిరి.
పంపాపురవాసుల మన్ననలబడసి పాలింపదగిన ఘనుడవు.

—♦ వానరమంత్రులు సుగ్రీవునకు పట్టముగట్టుట. ♦—

దుఃఖమునుబాసిపురినిపాలింపుము. ఇంకనూ క్లేశంబునొందు
లకు సుఖింపుము యనిరి. ఇంతకూ దుఃఖభారమున నేడ్చిన
చచ్చినవారు మరల వత్తురా? చింతలోమునిగి యీవిధాన
గృశించిన లాభమున్నదా? ధీమంతుడవుగనుక అనుమానము
దక్కి రాజ్యమేలుము. సామంతులు ప్రజలూ మేలనునట్లు
ఓఅర్కనందనా పరిపాలింపుమనిరి. వలదని బ్రతిమాలినా
వినక పౌరులు నిర్బంధమున పట్టముంగట్టి వెడలిరి. ప్రజల
కనుకూలముగ రాజ్యమేలి యెట్లో కాలముగడుపుచుంటిని.

-♦ వాలి వచ్చి సుగ్రీవునిపైకోపగించి మర్దించి వెడలగొట్టుట ♦-

అంతనొకనాడు ప్రళయార్కబింబముబోలుమోముతో
అంతకునిబోలి వాలి భయదాకృతితో వడినేగుదెంచి ప్రతిధ్వని
బయల్పడ వృద్ధుని హుంకరించి నాచెంతనునిలచి ఛీయనుచూ
కన్నులు జేవురింపగా పటపట దంతములుకొరకి వాలంబు
పైకెత్తి ముఖంబున ముచ్చమటలూర నేను గతించినానని
తలంచి యిచ్చటకువచ్చి నాపురంబు ఆక్రమించితివా? నీవు
సోదరుడవుకావు. కపటాత్ముడవు యనెను. నేను మాయావిని
వధింపనేగినంతలో అదను చేకూరెననియెంచి ఆవెంటనే
యీచటికి కరుదెంచి నాపురంబుయేలుచుంటివనుచూ రోషించి
దూషించె నంతటితో విడువక.

## వాలి తారను, బలాత్కరించుట

ఓరఘుకులేశ్వరా! నిక్కముచెప్పుచుంటిని. పట్టరానికోపముతో నన్ను తిట్టి గట్టిగాకొట్టి, సర్వస్వమూ స్వీకరించి బహుభంగుల నేను బ్రతిమాలిననూ భాస్వరగాత్రియగు నాదుకులభామినిని బలాత్కరించెను. తారను సురచిరనఖజితతారను; నావలపుల పంచదారను ప్రేమధారను సముదారను నాతారను నన్ను దుఃఖసముద్రమున ముంచివేసి గొనిపోయెను. ఓసఖి నాయతాత్మా! ఒక్కవాలితక్క అన్యుండెవ్వడూ నన్ను గెలువలేడు. వానిపేరు విన్నంతమాత్రముననే, నామేను వణకును. అట్టి వాలికి నాయాలినిచ్చి వచ్చినాను. నిత్యమూ జయము తప్ప అన్యమెరుగనిదానవాలి వాలి నిర్వక్ర విక్రముగల గజాసురశూలి వాలి, ప్రత్యర్థిబలశాలియైననూ లయకాలకీలి వాలి, దుష్టుల దుష్కర్మదుర్మదపంక తీవ్రాంశుమాలి వాలి, వాలముచే సప్తసాగరములను అల్లకల్లోలమొనర్చుశైలి వాలి, తాను ఉగ్రుడై నిగ్రహించిన నెవ్వండైనా తనయెదుట నిల్వలేరు. రావణకుంభకర్ణాదుల నెదుర్చజాలు సుగ్రీవుండు నేను కాని, వాలి నెదిరింపజాలను. ఓవనమాలీ, వాలికి దేవవిభుండిచ్చిన రమణీయమణి ప్రభావంబుచే వానినెటుల సంగరమున నోర్వగలను. శత్రుభయమున (వాలి) సకలదేశాలుతిరిగి; ఘనుండగుమాతంగముని శాపకారణమున వాలి యిచ్చోటికి రాజాలండని ఈనగేంద్రమున ఓయినకులేంద్రా నివసించు

చుంటివి. అర్కసుతుంగని ఓ మిత్రరత్నమా! యనఘుఁ డగు మతంగముని నిష్కారణముగా వాలి నెందుకు శపించెను. ఆత్మసోదరుడవగు నిన్ను దునిమినవాలిని ద్రుంపక దుందుభి మిన్నకుండునా? అర్కజాడు (సుగ్రీవుడు) ఔను మంచిప్రశ్న యడిగితివని ఓరామా! దుందుభి సమస్తరాక్షసవీరులకు మేటి లయకాలునకైనా జంకడు. ఆతడని వార్యబలవంతుడు ఆతతాయి దిగ్విజయమందు యెల్లదేశంబులదిరిగి హిమవద్గిరిని బెగల్పనెంచెనంత. నచ్చటి మునీశ్వరుండొకడిట్లనియెను. ఈ నగమును బెగల్చిన బలవంతుడ వౌదువా? చాలు చాలు. నీయన్ననుజంపి యేగిన బలాఢ్యుని(వాలిని) చంపలేక యెన్నగరాని మేటినని సిగ్గులేక ఎల్లెడజయింతునని యేగుచుంటివి. అనిన విని పట్టరానిక్రోధంబువహించి వాలినెట్లైన వధింతునంచు వెంటనే ఓవాలీ, అతులబలుండకట యని హుంకరించి రా, యుద్ధమునకు రా రమ్మనినంత యిదే యదనని వాలి తలంచి యుద్ధమునకేగి వాని భుజదర్పమణంచి వధించి వాని కాయమును మీదికివిసరగా యెల్లెడలా వానిరక్తము త్రుళ్లెను.

## —♦ మాతంగముని వాలిని శపించుట ♦—

మాతంగమున్యాశ్రమమున రక్తము దృశ్యగా అగ్రహించి వాలి యిచ్చటకు వచ్చెనేని వానిశిరస్సు వ్రయ్యలగుగాకయని శపించెను. మునిశాపము నలుగడలూ వ్యాపింపగావిని వాలి భీతిల్లి యీనగంబుద్రొక్కుట మానుకొనెను. ఆకారణమున యీకొండదక్క వేరొకస్థలంబునకుబోవ సాహసింపను. వాలి

పేర్చిన్న నామేనువణకును. ఓ శ్రీరామచంద్రా ఆపద్బాంధవా నన్నెట్లురక్షింతువో నీదేభారమని యనియెను. అక్రమంగా నాసర్వస్వమునూ, నాభార్యనూ ఆక్రమించెను. బలము గలవానిదే న్యాయమీ యవనియందు గానన్ను కాపాడుదైవమున్నాడో లేడోయని విచారిస్తున్నాను. ఈపలుకులను శ్రీరాముండువిని పిన్నగవుతో యినసుతుని కరమ్మంబట్టి అనఘాయని ధనువునిబూని యిట్లనియెను. అతులిత వీరసింహుడని ఖ్యాతిజెందినవాడు ధర్మపద్ధతిని చరించుట న్యాయము. అది తప్పినవాడు అధమాధముడు. ఉమాపతియూ విరించియూ యతనిపక్షమువచ్చి నిలచినా నేను ఒక్కకోలతోనే అప్రతిహత సుప్రతాప బలవంతుని వాలిని మర్దించి సంహరింపగలననెను.

తాను సమర్థుండయ్యూ తన మిత్రుని దుఃఖమునుతొలగింపజేయక మెలగువాడు క్రూరవర్తనుడు, కుటిలుండు కలినుండు వానిమోమును జూడకూడదు. తనదుఃఖము కొండంతయయిననూ సఖుని దుఃఖము స్వల్పమైననూ తన దుఃఖమును మిగింగి తక్షణమే ప్రాణమిత్రుని కాపాడువాడు ఘనుడు యని రాముడనెను. అనయమూ తాను అపాదారవిపంబుధిలో మునిగియున్న యేజనుడు సఖ్యంబు విస్మరించి మిత్రుని దురవస్థబాపడో వాడు పాపవర్తనుడు ఆగుగాక. నిజముగా ప్రాణసఖుడనిన నమ్మనవచ్చునా? తన స్నేహితుడు దుష్టపథమునందు సతతమూ సంచరించుచున్న తక్షణమే వాని సత్పథమునకు

మరలించువాని సత్పురుషుండని సన్నుతింతును. సమ్ముఖమందు నిత్యమూ సఖ్యమునే నటించి ప్రేమసేవ ప్రకటించి యిచ్చకముల నేర్పుతో పలికి పరోక్షమందు లోపములజాటినవాడు సఖుండా? వాడు కాలసర్పమువలే వక్రగామియై, ఓసుగ్రీవా ప్రాణసంకటమే యగును. అనయమూ అన్యోన్యాను రాగములుకలిగి అవుసరమెరిగి తోడ్పడి హితముగా చరించువారు స్నేహితులుగాక పలుకరించిన వారంతా ప్రాణసఖులగుదురా త్రికరణముగా ప్రేమించువానివలె నటించి అవసరమునుబట్టి స్వార్థపరుండై తియ్యని మాటలాడి యరుగువాడు కుటిలచిత్తుండు సుమా మూర్ఖసేవకుడు అతిలోభి భూవరుండు కుటిలమిత్రుడు అపవిత్రకోమలాంగి శూలములవంటివారని బుధులందురు. గాన మెలకువతో మెలగవలయును.

—♦ శ్రీరాముండు ధర్మముల బల్కుట ♦—

తనజనకునితో మునులతో ద్రోహమెరుగని పుణ్యజనాధీశునితో స్నేహముచేసిన వానికి పాపములుహరించును. వాలి లోకసన్నుత మహాబలుండు. అయినప్పటికి తనకులోకువైన దనుజవిభుడు రావణుడు సతుల బాధించుచుండగా సమ్మతించి, ప్రోత్సహించుటచూచి మిన్నకుండుటతగునా? అనినరాముండు బలవంతుడైనవాడు దుర్బలులకు ప్రాపై, జగద్ద్రోహులను పాలింపవలెనుగాని ఇట్టిఖలుండై భోగార్థియై ద్రోహికిస్నేహితుడై వీరధర్మమును నిశ్శేషంబు గావించవచ్చునా? లోకము మెచ్చుకొనునట్లు వాలినిదునిమి ధర్మమును స్థాపింతును. ఈ

మాటలనువిని అర్కసుతుండు నవ్వి ధైర్యమును తెచ్చుకొని యిట్లనియెను. ఓ జానకీవరా! వాలిఅత్యంత బలాఢ్యుడు, శూలినైనా లక్ష్యపెట్టడు. అట్టివానిని ఒక్కకోలతో గూల్చెద నంటివి.

—శ్రీరాముని సుగ్రీవుడు సప్తతాళములనుద్రుంచుమనుట.—

అనుమానముకలిగి మనంబున సంశయించుచున్నాను. మిక్కిలి యెత్తైన సప్తతాళములను ఒకబాణముచే కూల్చగల్గితివేని వాలిని వధింపగల బలుండవగుదువు. అనిన శ్రీరాముండిట్లు బలికెను. నన్ను పరీక్షింపగోరి ఓ మిత్రమా యిట్లనుచుంటివా? నీకోరిక ముఖ్యముగా నీడేర్తును. ముందుగా నాసప్తతాళ వృత్తాంతము సంగ్రహముగా చెప్పుమనిన సుగ్రీవుండిట్లు మనవిచేసెను. ఒకనాడు వాలి ఉగ్రాటవిలోచరించి నలువిధంబులగు వృక్షములనుజూచి, తాళవనమునజొచ్చి, తాటిపండ్లనేడింటిని సంగ్రహించి నీటితో కడిగెను. పిమ్మట స్నానముజేసి సదనంబుజేరి అనుష్ఠానమునెల్లదీర్చి జపించి ఈశ్వరుని ధ్యానించి; తాళఫలంబుల నారగింప ఆవానరనాధుడేగి ప్రీతిబంధకమౌ నొకసర్పమును జూచెను. నక్షత్రమండలముననే ప్రకాశిస్తున్న తాళఫలంబులపై సర్పము పడగనువిప్పి తాండవించుట పరికించె నావానరప్రభుండు, అట్లు చూచి కోపముతో ఓసర్పమా నీకు ప్రాణాశలేదా? నాపండ్లనుముట్టుటకు నీకు తగునా. నిన్ను విడువక శపింతునవెను. నీశరీరమువిచ్చి యేడు తాటిచెట్లయిపుట్టి ఆకాశమునంటు పొడవునపెరిగి యిచ్చటనే

యుండుమని వాలి వెడలిపోయెను. అంత తత్క్షణుండీ వృత్తాంత మంతయూవిని యెవ్వండీ యేడుతాళములను ఒక్కకోలచే కూల్చునో వాలి వానిచే కూలుగాకయని శపించెను, కాగా మతంగమహాముని దుందుభునిశరీరమును ఒక్కబాణముచే ఎవండుజిమ్మునో వానికి వాలిప్రాణముల నర్పించుమని సుగ్రీవుండు పలికెను. అనఘా! రఘువీరా! ఆద్యంతమూ అఖిలవృత్తాంతమూ విన్నవించితిని. నీయాజ్ఞకై వేచియున్నాను. నన్ను జంకవద్దని అభయమొసంగియుంటివి రామా. కరుణతో నన్ను కాపాడుము దేవా.

రఘువీరుడు ఒక్కబాణమున సప్తతాళంబులు గూల్చి
—: దుందుభుని కాయమును గాలిలో వ్రేలాడునట్లుజిమ్ముట :—

అనిన భావగర్భితంబగు మందహాసముతో అర్కసుతుం జూచి తలయూచి యాతిక్షణమే తనవిల్లెక్కుపెట్టి యేకబాణంబుచే యేడుతాటిచెట్లను నేలకుంగూల్చిదుందుభువికాయమును గాలిలో వ్రేలాడునట్లు జిమ్మివేయగా సుగ్రీవుడూ హనుమంతుడూ సెభాసని నుతించిరి. శాపవిముక్తింజెంది సర్పరాజంబు అఖిలగుణధాముడు రణభీముడు రాముని అభినుతించి అర్కసుతునకు మేలౌనని వచించి వేగముగా నాకలోకమునకేగెను. నాయనుమాన మంతయూ మనంబున అంతరించెను. ఏమో యనుకొంటినిగాని నీమహిమను కొనియాడ శక్యముకాకయున్నది. నీయసమాన బాణము త్రినేత్రునైన జయించును.

ఆవాలికి ఆయువుమూడెను. సకలాసురకోటికి చావుసిద్ధమని సుగ్రీవుడనెను.

### —♦ సుగ్రీవుడు రామభద్రుని స్తుతించుట ♦—

ఓ విశ్వసంభవా! విశ్వాత్మా! విశ్వనాథా నీవుఆదివిష్ణువే యని విశ్వసించితిని ప్రభో. మానవులయందు లేని నీమహిమ మహాములకైనా పరికించిజూడ అద్భుతమే యనెను. వీరుల మని గర్వపడి ధర్మమునుదప్పి చరించురిపుకోటికి నీయమోఘ చాప టంకారము ఘణంఘణ కాంశ్యకింకిణీరవంబు యనుచూ గ్రహించి సంతసించితిని రామా యనుచూ సారహీనమైన సంసారసాగర పంకమందుజిక్కి సంసారమే సారవంతంబని భ్రమించితిని. నన్నాదరించి యేతీరున బోధిచెదవో దీనుండను. జ్ఞానహీనుండను. శ్రీరఘురామా! నీపాదదాసుం డగుటకైనా అర్హుడనౌదునా తెలవిండు. ఓపతితపావనా! నాకు సద్భక్తి నొసంగినచాలు. కిష్కింధకు పట్టముగట్ట సవసరములేదు. మహిలో అపారసముద్రమునుదాట నీపాద జలజసేవయే నా కౌకనావ. సంసారమునదక్క మంచిగాని చెడ్డగాని ఎన్నడూ సంభవింపవు. అఖిలమూ త్యజించి నిన్నాశ్రయించి తుదకు మోక్షమును సాధించుకొని నేనీకుందునుధరింపజాను. ఊహింపగా శత్రుడెవ్వడు మిత్రుడెవ్వడు అంతయూ నీమాయాకల్పితమే రామా. వాలి నిక్కముగా నాకు పరమహితుండే యేలన వానిచేతనే నినుగాంచుమహాభాగ్యము నాకబ్బెననెను సంసార సాగరమునుత్యజించిసతతమూ నీచరణకమలములనేనమ్మి నిన్నే

భజింతును. నాకొకరితో వైరమేల? భండనంబేల. ఈలోకమేల సామ్రాజ్యమేల? వాలిని జంపవద్దు. ఆతడు బల్మినిబట్టినకాంత మరివద్దు. అతండేలిన నేలవచ్చు [క్రోధమేవైరి, శత్రుద్ధయే నా లలితాంగి నీభజనయే సుఖపద్రదంబగు నారాజ్యలక్ష్మి ఇంకేల విచారము ఇంకేలకార్యము కాదాయనెను] అరిషడ్వర్గములు సంహారించుటకు దేవదేవా! నీసేవచేకూరిన చాలదా? నీదర్శన భాగ్యమున నాకోర్కెధాగ్నిచల్లారెను. దుర్భర సంసారపయోధి నిస్తరణ (దాటుట) మార్గంబు గన్పెట్టితిని. నీకరుణగల్గిన నీపద సేవయొనర్చి కైవల్యంబు బడయగలను.

: శ్రీరాముడు, సుగ్రీవునికి, వాలితోయుద్ధముచేయుమని దెల్పుట. :

తన మహాత్మ్యమెరిగి తత్త్వజ్ఞానియైన సుగ్రీవునిజూచి శ్రీరాముం డిట్లనియెను. ఐహికసుఖంబులన్నియూ ముందనుభవించి పిదప కైవల్యపదవికై వెతుకవలయును. అనఘా! ప్రతిజ్ఞజేసి యుంటిని అయ్యది యెన్నటికైనా నిష్ప్రయోజనమని దలంపకుము. నేను సత్యమును తప్పనుసుమా ఘనంబగు రాజ్యవైభవమిచ్చుటనుభవించి ఆపయిని పునర్జన్మమెత్తకుండా పరంబున మోక్షమను శాశ్వితసుఖంబనుభవింతువనెను. మనంబున భీతి జెందక వాలిని సమరంబునకుబిల్చి పెనంగుమించుకయును నీకు నిక్కముగా జయముచేకూరును. అనినంత భాస్కరపుత్రుండు ధైర్యముతో వాలి గృహద్వారముచెంతకేగి బొబ్బరించి, యుద్ధమునకు ఢీయని కపిరాజును బిలచెను. శయనగృహమందు తన పద్మనయనతో సరససల్లాపములదేలు సమయాన హుంకార

మాలకించి, వాలి ఉల్లము చలింప తల్లడిల్లి ఔరా యేమీ యపూర్వసాహసము, సింహద్వారముజొచ్చి ధీయని తిరస్కార భావముతో నాజికి సుగ్రీవుడు బిలచెను..

—♦ వాలి తన తమ్మునితో యుద్ధము సేయుట ♦—

వాడు నాపేరు వినినంతనే భీతి చెందునుకదా. ఈ తారను గొంపోవ దలంచివచ్చెనో లేక యెవరేని ప్రోత్సహింం చిరో ఊహింపజాలకున్నాను. సాటియైన మేటివలె ఒంటరిగా వచ్చెను. వీడు యేపాటి బలవంతుడో చూచెదను. వీనినిసంహ రింతును. నాపేరు విన్నమీదట వీడికెవడు ప్రాపుచేరెదరో చూచెదను. అనుచూ లంఘించి యాడుగరచి, బొబ్బలిడి తొడచరిచి ధ్వజమునుబోలు తనవాలంబెత్తి ప్రజ్వలాగ్నియై వాలి సుగ్రీవునిపై బడినంత, తార యెదురుగావెళ్ళి ఆర్తితో అంగదా రమ్ము రమ్మని రక్షింపుమని వాలిపాదములపై వ్రాలి ఆత్మ నించుక శాంతిజెంది ప్రేమముట్టిపడునట్లు యిట్లనియెను.

తార సుగ్రీవునితో యుద్ధము వలదని
—♦ వాలిని బ్రతిమాలుట. ♦—

ఆడువారు బుద్ధిహీనులని మదినెంచక వినుడు. తగిన ప్రోత్సాహములేక యాతడు నిన్ను తాకొనుచున్నంతటీ తెంపరి కాడు. నగరమునందు రాఘవుం డగుపడిఅభయహస్త మొసంగి నట్లు వింటిని. ఓ వానరనాథా, రాముడు మహామహిమా ఢ్యుడు, మర్త్యమాత్రుండు కాడనెను. ఇంతకుముం దెన్నడైనా

ఆమహీంధరమునుదిగి యిటరానివాడు నీపొంతకువచ్చి ఢీయను
నంతటి మూర్ఖుడా? తనకు బాసటయై దిగంతవిశ్రాంత యశో
ధ్వజుండగు రఘురాముడు వెంబడిరాకయుండిన తానిటుల
వచ్చునా? నామంతనము విని నిలువుము. నిరపాయుండవై
సుఖింపుమనెను. బాల్యమందే తాటకిని జంపెను. దాశరథుని
శక్తి సామర్థ్యములు వినుతింపశక్యమా, హాటకగర్భునిచే వరం
బులు వడశిన దైత్యులనేకుల జంపెగదాయని మానులు ప్రస్తు
తింప వినుచుండలేదా? ఈతడే యీజగన్నాటక సూత్రధారి
యని జ్ఞానులు చెప్పగా వినలేదా? సాత్విక గుణాభిరాముడు,
సమరభీముడు, అర్కకుల వారినిధిసోముడు, అఘువిరాముడు,
ఆర్యనుత సద్గుణస్తోముడు, ఆతని నెరిదింప వశమా? పూప
ప్రాయమందే, పాపాత్ములవధించి, రాతినాతిగజేసి ఖ్యాతి
గాంచెను. శివుని విల్లువిరచి, సీతను పెండ్లాడి, పరశురాము
బాహుగర్వమణంచెను. సకలసామ్రాజ్యలక్ష్మిని, సవతితల్లి
కొసంగి, యోగియై యడవుల కేగుదెంచెను. ఖరదూషణాది
దనుజవీరులగూల్చి, లోకాతీతమహిమనుగనెను. (ఆదినారా
యణుండే యీరాముండనుచు, మునులు సకలదేశంబుల
జాటుచుండ, (వినియూ నతని నొక్కనాడైనా సేవింపకుం
టిమి.) యింతకంటెను దుష్కార్య మెందేనికలదా? కవుల
వాక్కు, మహాత్ములకార్యదీక్ష, బ్రాహ్మణద్వేషము, ఈశ్వరు
పాశుపతము, సాధుజనహింస, శ్రీరామచంద్రునిశరము, భక్త
వరుసంకల్పసిద్ధి, వ్యర్థమగునా?

—: వాలి తారను ఓదార్చుట :—

అనిన వాలివిని, దరహాస మొప్ప, ఓసీ, భీరువా, నీకింత దంతయేల? రామచంద్రుండు త్రిభువనారాధ్యుండైనా, దైవమే యైనా, మన కేలభయంబ నెను. ఓయంబుజాక్షీ, అనఘుండగు రాముడు, అఖిలలోకైకవీరుడనగ ప్రఖ్యాతి నార్జించెను, నిజమే, అతని గెలచితినా, యశంబు బొందుదును. వారిచే చావుచేకూరునా, మోక్షప్రాప్తి కల్గునుగదా. అతనిని అంద రూ మహానుభావుడనియే, అందురు. మర్త్యుడో దేవుడో ఎవరికెరుక. మనుజాకృతి దాల్చి, దేవుడిక్షితిని జనించి ఈ విధంబున వచించిన, చెల్లదు. సతతమూ ధర్మమునే, నిలుపు మహాత్ముడే, దేవుడుసుమా! ఓమగువా, శ్రీరాముండు సమ దర్శి, యాతడు సుగ్రీవు డాప్తుడనుచూ,తగవుదప్పి వ్యవహరిం చునా? రాముండెంతటివాడైనా యగునుగాక, సమరము వచ్చునెడ, యోధసింహుండు జంకునా? తన్నుమించిన బల శాలి ధరణినున్న, యోధుండు సైరింపనోప డెపుడు. నిక్క ముగా, రాముడో లేక నేనో, భువిలోన నిలువవలయును. ఓయిందువదనా, యిరువురకూ, యిందు తావులేదనెను. అని ఒక్కుమ్మడి హుంకరించి, తనసింహద్వారమునుదాటి, సుగ్రీ వునితాకి, కేలందించి, లంఘించినంత, సుగ్రీవుండుకొంతదనుక, ధైర్యంబున బోరెను.

—: సుగ్రీవుడు వాలిదెబ్బలకు తాళలేక పారిపోవుట; —

అంతట వాలినేత్రములనుండి అగ్నికణంబులురాల, రఘురామలక్ష్మణులు విభ్రాంతిజెందగా, అశనీపాతముపైబడి

నట్లు, వాలిగుద్దగా, భాస్వంతతనూజుడు (సుగ్రీవుడు)పపుచెడి; బళ్ళున రక్తముగ్రక్కి పరుగున పోయెను. వాలి, తనను వెంబ డించి వస్తున్నాడా యన్నట్లు, చెమట మేనుగ్రమ్మగా, సొమ్మసిలి, వేగమే రక్షింపుమో దేవా రామభద్రా! యనుచూ, ఇనసుతుండు, రామునితో నిట్లనియెను.

—♦ సుగ్రీవుడు రామునితో మొరబెట్టుట ♦—

ఓపరంధామా, రామా! వాలిచెలరేగి నావక్షంబు పగులబొడిచెను. ఒక్కగుద్దునకే, నేను నల్లను గ్రక్కుకొం టిని, నన్ను కాపాడజాలక మిన్నకుంటివో? నీకు ధర్మమా! చెప్పుమా; నిన్ను గిరితటంబున గన్నదిమొదలు నిన్నే నమ్మి యున్నాను, నిన్నే శరణుజొచ్చితిని. ఓసచ్చిదానందధామా సురనుత, రణభీమా, సూర్యవంశాబ్ధిసోమా, కరుణగల్గి, ఓఆప న్నివారణా, నన్ను గావుము, యనెను, అనిన రాముడువిని, కరుణారసంబుతో నీగతి వచించెను. "కనుగొన, వాలీ, నీవూ, నొక్కకై నడిదోచెను" ఆకారణమున సంశయించితిని, "మార్గణ మెవ్వనిపై "బాణం విడువడమాయని, అంతేకాని, సఖుండా! కపటమున కాదనెను. ఇంక విచారింపకుము, ఇప్పుడే, పుష్ప మాలికను కంఠమున ధరించి, వడినేగి, యేపుమీర చెలరేగి బింకమునుజూపి, వాలితో బోరుము. జంకకు మొకించుకంతైన నేను భూరుహాముచాటున నిల్చి ఒక్కబాణమ్మున వాలిః గూల్చెదను, అనవిని, యర్కసుతుడు, వెడలి వాలి నాహ్వ సించి, భీతివిడచి, తనకు బలమున్నంతవరకూ పెనగులాడి కిమ్మట శ్రీరాముని దలచెను.

సూర్యవంశవిభుండు ఇంద్రసుతుని
—౹ ఒక్కబాణముచే వధించుట. ౹—

తన్ను ధ్యానించుభక్తుని తలపెరింగి, సమయంబని శరాసనముబూని, అమరులు సంతోషింప, ఒక్కబాణము చేతనే వాలిని కూలవేసెను. రివ్వుమని రామునిబాణము, హృదయమును పగిల్చి పోవగా వాలి తూలి నేలగూలి హృదయశోణితమునందు పొదలుచూ, శ్రీరాముని పుణ్యాకాముని జూచెను. శ్రీరాముని దివ్యవర్చస్సును గాంచి, మాధవుడో, లేక యీతడు మాధవుండో యనుచూ, యగుగాక, యీరీతి నాచరింప సర్వామా యని గర్హించి యిట్లనియెను.

—♦ వాలి రాముని నిందించుట ♦—

ఓ రామా! చెట్టుచాటునడాగి లక్షించి విగతజీవుని జేయుట మగతనమా? నీవు శూరుడవా? కాదు. చోరుడవు. నన్నెదర్పలేక డాగి పొడచితివి. నీకిది ధర్మమా యనెను. నీవు తేజస్వివే నిజముగా విమలుండవే కాగా దివ్యమంగళ విగ్రహుండవు. అక్రమంగా నిట్టికార్య మొనర్పబాల్పడితివి. అయ్యో నీకిదిపాడియా? తెక్కలివిధంబున నాకు తెలియకుండ; బొంచిపొడిచి యపకీర్తిపొందితీవు. ఓయనఘా! సుగ్రీవుండేపాటి వాడు. వాడల్పబలుడు. వానిస్నేహంబున నీకేమిలాభము చేకూరును? నేను నీకుశత్రువునా? వాడు నీకు స్నేహితుడా? నన్నిట్లు వధింప నవసరమేమి? వేటకానివలె చాటునుండిచంపి పోటరివని ఉప్పొంగుచున్నావు. నీవుసమదర్శివేని నీకిట్టినేత

తగదు. మాయిర్వ్వరమధ్యగల తగవునెరిగి మెలగవలెగాని నావలన యేమియూ వినకుండ నన్నన్యాయముగా వధించితివి రామా. నా పేరు విన్నంత దానవనాయకుండు గడగడవడంకి కాళ్ళపై బడునుగదా. అయ్యో నాతో చెప్పియున్న నిక్క ముగా నతివసీతనుదెచ్చి నీకు సమర్పించియుందుననెను. ధర్మ సంస్థాపనార్థమై ధరణియందు ఆదినారాయణుం డిట్లవతరించె ననుచూ మునులు నిన్నభినుతింతురు. అనఘా. ఆమాటనిక్క వం బగునా?

## హనుమంతుడు వాలికి సదుపదేశము చేయుట

అనిన హనుమంతుడు నవ్వి యిట్లనియెను. అనఘా! ముని పుంగవులమాట లనృతమగునా? నిక్కమేమంటె ధర్మము నిలుపునట్టి నృపతియని అయినా నీవాదరింపవైతివే. "సంశ యాత్మా వినశ్యతి" యను నార్యోక్తిని రామా వినవా? అది వ్యర్థంబగునా? తాడిదన్నినవారి యాదలల దన్నువారు, వసుధ నుండబోరనుకుంటివా? ఓ వానరరాజా! నీవుపారబడితివి. నీబలానికి వెరచి రామభద్రుడు చెట్టుచాటున దాగినాడనుకొం టివేమో, కాదు. ఆదివ్యమంగళరూపమునుజూచి పరాత్పరుం డని కాళ్ళపై శరణని వేడెదవేమోయని జంకుచూ కుజంబు చాటున నిల్చెను.నిన్ను వధింపక విడచిన తనప్రతిజ్ఞవ్యర్థమగును గదా? వంశమర్యాదనుబట్టి తొలుతప్రతిజ్ఞవిడువవలెనా? శరణు జొచ్చినవాని జంపవలెనా?

—౯ శ్రీరాముడు వాలికి సదుత్తరం బిచ్చుట ౭—

అంత రాముండు వాలిపొంతననిలిచి ఓ వానరోత్తమా నీప్రశ్నలకు నేను తగిన ప్రత్యుత్తరము నీయదగునుకదా. నా పలుకులు సావధానుండవై వినుము. మంత్రమహితంబైన మాయామణినిధరించి, అతులబలుల తేజంబపహరించి అక్రమంగా మెలగుటది నీకుధర్మమా? ఎల్లేని నిన్ను జయింపవచ్చు అమరనాథుని ప్రదత్తమగు మణి నక్కునదాల్చి యెదుర్చు వారి సత్వమపహరించి గెల్చుట ధర్మమా. ఆమణినివిడచి యుద్ధరంగమున నీవు నిల్వజాలిన నీసహోదరుడే నిన్ను సక్రమముగా వధించి తననతిని ఆసహాయశూరుండై గైకొనియుండెడివాడు. నేను దేవుడనో నరుడనో ఆవిషయం నేనేచెప్పుకొనుట నిష్ఫలంబు. అవనింగల సర్వజీవుల యాత్మలందు ఆతండుగలడని నమ్మినచో హానికలదా? ధర్మమెటనుండునో, దైవమూ అచటనేయుండును. నేను ధర్మపరుండను గాన, నాయందు దైవము తప్పకయుండును. దైవకార్యంబే ధర్మసంస్థాపనంబు. పిదప నేనెవండనో భగవంతుడెవడో నీవేచెప్పుమా. అఖిలజీవులు తానని దలంచి ధరణిలో ధర్మముతప్పినతరుణమున ధర్మంబునిలుప రక్తముధారబోయు ధన్యుడే దైవంబని తత్వవిదులు పల్కుదురు. యుద్ధమున నిన్నెదిర్చి వధింపగ, సర్వశక్తి సంపన్నుండైన భగవంతుడే రావలెనా? దేవుడే నిన్వధింపజాలునని మదినమ్మితివేని ఓ వీరలోకోన్నతా ఒక్క బాణానికే, ఈరీతిని కూలిపోతివా? నేను దేవుండనంబున నన్నె

లని గొలచి, ఈప్సితముల బడయనెంచినావా? నేను మానవుం
డైన నన్ను జంపి మామకీనధనము, తరుణినిహరింపదలచినావా?
తమ్మునిభార్య చెల్లెలని యార్యులుపల్కగ నాలకించి సంశ
యములేక అమానుషవాక్యంబని దలంపక తమ్మునినిరసించి,
తనివిబొందక, తనధర్మచారిణిని సర్వజనంబు లేవగించునట్లు
అక్రమంగా వ్యభిచారిణి చేసివేస్తివి. అనుజభార్యయు, చెల్లెలు
కోడలు, కుమార్తెయు సమానులని ఆర్యవచనంబు వినియూ
పాపాత్ముండయి సంచరించుట ఓవానరేశా! ధర్మమూచెపుమా
తలపంగా నీకంటె రావణుండు తక్కువపాపాత్ముం డనవచ్చును
ఆతడు పరకాంతలనే యపహరించును. నీవో తమ్ముని భార్యనే
హరించితివి. నిన్నువధింపక వానినే దునుమదగునా? నీవు బల
వంతుడవు. దానవేశ్వరుడు నీకులోకువ. ఆతండు నీతిదప్పి సంచ
రించుటకు నీ వంగీకరించినటులే మిన్నకుంటివేమి. నాచెలువ
గొనెనంచు నీతోడ చెప్పియున్నచో నీసురవిభు బట్టితెచ్చెద
నంటివీవు. అనుజుని యిల్లాలిని బలిమింగొనిన పాపిని, నిన్నెట్లు
చూడవచ్చును. యింద్రతనయా చెపుమా, ఇంద్రునకు ఆత్మజు
డవు. ఆతడిచ్చిన మణినిధరించి శతృలమదమణంచి బాధించు
నట్టి అసురవిభుని చక్కజేయక యిన్నాళ్ళెట్లుంటివోయి.
వానరనాధా? అన్యకాంతలవిత్తంబు నపహరించి బలగర్వమున
ధర్మంబుదప్పి సంచరించిన కూృరులచంపుటది క్షత్రియునకు
సహజధర్మము. రాజ్యమనగా ప్రజలసొత్తు. వలదువలదన్న
గోరి ప్రజలు నిర్బంధముగ సుగ్రీవునకు రాజ్యపదవొసంగి,

రతని నీవు వాని నిర్వాశితుని జేసితి వక్రముమున, వీరభోజనము రాజ్యమంచు వీరవరుని దళిత భూమండలంబంచు యతి చరించు, కూర్రులదృంచి, ధర్మముఁబ్రోవ, నప్పుడప్పుడు అవని జనింతు ననెను.

— వాలి శ్రీరాముని స్తోత్రము జేయుట —

అన విని, వాలి యిట్లనియెను. అసురపతియా, నేనున్నా యేకీభవించిన, పాపికల్గునని, ముందుగా నన్ను జంపితివి, దానికేమి. నిన్ను గనినంత నాచింతలన్నియూ, నశించిన వనెను. సౌఖ్యముల బొందగోరి, నేను దోషములను కొన్నావర్పితిని. దానిలో సందేహములేదు. జరిగినదానినిగూర్చి మరి చర్చయేల. నాకు నీసందర్శనప్రాప్తిచే, మనశ్శాంతి గలిగి నది. అంతియేచాలు. ఓ రామా, యని, మరియు, నిట్లని యెను, ఓఅనఘా, నీవన్నట్లు నాయందు గొప్పతప్పులున్నవి, ఇప్పుడు నేనొప్పుకొనుచుంటిని. నాయహంకార మంతయూ, నాశనంబయ్యెను. ఓపంకజాక్షా, నినుగాంచి, పావనుండైతివి. మానవాకృతినున్న నీముఖంబను అద్దమందు, దైవము, నాకు ప్రతిబింబమట్లు గన్పట్టుచుండెను. నిస్సందేహముగా, నీవు దివ్యపురుషుండవే, యనెను. అంత్యకాలమున, నీయాకృతింగని, పావనుడైతిని. నాపాపములు తొలగిపోయినవి. ఓయనఘా, నీచేత జచ్చినందుకు నీపాదసేవకూడా, తృప్తిగా బడయజాల కున్నాను. ధర్మసంస్థాపనార్థంబు, ధరణియందు [illegible]

మహాత్మ్యండ కారణముగా. సంసారసౌఖ్యములకొరకుం జన్మమొందునా? నీబాణంబమోఘంబు,నాకుగల దురభిమానము ఛేదించెనో సరసిజాక్షా నీవు దివ్యుండవు. త్రిలోకపావనుడవు. ఇపుడు నాయంతరాత్మ బోధించగా తెలిసెను. ఉర్విం గల సకలజీవుల సౌఖ్యముప్పతిల్లగోరి యేతెంచిన జగద్గురుండవీవు. నేను పామరుండను. ఓదేవా, సైరింప వేడుచున్నాను. తండ్రికి బిడ్డలకు కలహమెందేని కలదా? అనిన రామచంద్రుడు వాలిశిరంబున అభయహస్తంబిడి నవ్వుచూ నీరీతిబలికెను.

—: శ్రీరాముడు వాలికి అభయహస్తం బిడుట. :—

నీయెడ దోషమంతరించినది. భూమియందు చిరకాలము దేహముతో నుండదలంతువేని అట్లు నిలుమా. జరామరణ దుఃఖములు లేకుండాజేసెదను వానరనాధాయనెను.

—: వాలి శ్రీరామమూర్తిని మోక్షమును గోరుట. :—

అపుడు వాలి తనహస్తములమోడ్చి శ్రీరాముని, నుతించి యిట్లనియెను. అంత్యకాలమున నీయాకృతిగంటిని. సకలపాపములగెంటి పరమమును గంటిని. శుష్కించి తపం బొనరించుచూ నిన్ను సన్నుతించు మునులకుఅయినా దర్శనమొసంగని పుణ్యమూర్తివి. ఆహా! నాపుణ్యమేమో ప్రత్యక్షమై మాట్లాడుచుంటివి. అనఘా, నాభాగ్యమేమనందు శ్రీరామభద్రా, దయాసముద్రా! నిన్ను తనివితీరవీక్షించి సన్నుతించి నీదునామాక్షరముల బఠించి ప్రాణములబాయు కంటెను వేరుభాగ్యమున్నె. ఇట్టితరుణంబు నాకు మొప్పు

డబ్బును. స్వచ్ఛమగు మోక్షమునత్యజించి తుచ్ఛమైన ఐహికసుఖంబుల వాంఛించు నజ్ఞుండెవడు? వేదములు సహితమూ నిన్ను నుతింపజాలవు అట్టినిన్నుగని మోక్షరాజ్యంబు గంటిని. నియతిమై, నింద్రియమ్ముల నిగ్రహించి ప్రాణవాయువును షట్చక్రపథమునందు పోనిచ్చి, మౌనులు సహస్రార మధ్యమున నెవనిదర్శింతురో అట్టి నిన్నుగంటిని. అసలు కామధేనువును దర్శించు ఘనుడెవ్వడూ లేడు. కాని చల్లయాచించి అంతతో సంతసించును. నీవు ఆదినారాయణుండవు. నిన్ను ఐహికంబులగోరి వ్యర్థుడగు వాడుంటునా? నిజముగా నిన్ను మోక్షమునేకోరును. అనఘులకుతప్ప యితరులకు ప్రాణప్రయాణవేళల నీనామము జ్ఞప్తికి రానేరాదు. నేను నిక్కముగా యెంతపుణ్యము చేసితినో నిన్ను కండ్లారచూచి ధ్యానించి తరియింప నాకు తరుణమబ్బెను. నేనువరించు కామితములియ్య సమర్థుండవు నీవే. నాకర్మానుసారము చరాచర సమన్వితమైన జగంబందు యేజన్మ మెత్తినచో భవసాగరము నుండి తరింపజేయునట్టి నీధ్యానముయను కామితమును, ఓధర్మవిచక్షణా, అంబుజేక్షణా నాకొసంగుమనెను.

## వాలి శ్రీరామమూర్తిని అంగదుని
## —: కాపాడుమని వేడుట. :—

నిన్ను గనుటవల్ల నాకోర్కె లీడేరెను దేవా. నావంశమును నిల్పుటకు నాకొక్కకుమారుడు అంగదుడనువాడు కలడు. నీ కరుణాకటాక్షముచే; ప్రజ్ఞావంతుడై, లోకనుల్లో

కుండై, నీదివ్యపరదాసుండై నీ కృపాకటాక్షమున కర్హుండై మెలంగునట్లు నాశీర్వదించినచో శాంతించెదను. రాఘవా యనెను. ఓరాజనందనా ఆశ్రితచందనా! యుద్ధపాండిత్యపటిమ గల్గిన మహావీరుల తానొక్కడే జయింపగల అఖండబలాఢ్యుడు, నాతనూజు డంగదుండు. వాడుద్దండుడు నీపావనపాదద్వయము గొల్చుచూ సంతతమూ నీయుండనుండ నియమింపుము. ఆదరింపుము రామా, నాపుత్రున కభయమొసగ మనుచూ నంగదుని రామునకప్పగించి ధీరుడయి, నిశ్చలుండయి; దృష్టినిలపి భక్తితో మొక్కి యీరీతి ప్రస్తుతించెను. కామమోహాది ఉగ్రగాఢాంధకారమునకు అర్కకిరణములు, శ్రీరామకీర్తనములు, బహుజన్మసంచిత భయదకిల్బిషపంకనిగ్రహములు, శ్రీరామకీర్తనములు, భవరోగదావాగ్ని కీలలు శ్రీరామకీర్తనములు మునిజనమోక్ష లక్ష్మీదివ్య గేహములు శ్రీరామకీర్తనములు, భక్తవరదములు, ఆశ్రితవత్సలములు, అఖిలశుభదంబులు, ఆర్తజనావములు' పుణ్యఫలదంబులు, అవతారపురుష సత్స్వవర్తనములు శ్రీరామకీర్తనములు. అట్లువినుతించి నవ్వుచూ నాక్షణంబే తనప్రాణముల నిర్లక్ష్యముగా నరకునేయని భద్రగజంబుమాడ్కి విడచె నా వానరనాథుడు. అంబుజాక్షుని కరుణాకటాక్షమునను వాలి సంతసించుచూ స్వర్గమునకుబోయెను. పంపాతీర వాసులందరూ వాలియొక్క మరణవార్తవిని వానిందలంచి అధికముగా నేడ్చిరి.

—: తార వాలి మరణమునకు విలపించుట :—

అంతట తార నడుము తడబడగా, కేశబంధము వీడగా పైట జారగా కన్నీరు కాల్వలై జాలువారగా నవనవమైన చటికి వచ్చెను. ఆమె నిశ్చేష్టయై నిలచి వాలింబిల్చి బోరున యేడ్చె శ్రీరాముని జూచి అక్కటా యని వాలిశిరము నదిమినొక్కి వెక్కి వెక్కి పలువిధముల నేడ్చెను సౌందర్యలక్ష్మికి సదనమౌనట్టి వదనమా యిది జితపంచబాణమా? నలపించి కన్నులరింప జేసిన చూపులేనా యివి ఇంద్రతనయా? ప్రఖ్యాతి జెందిన బలులను గెలిచిన బాహువులేనా యివి మోహనాంగా? ఆలింగనమున కానందమైనట్టి వక్షమా యిది ప్రాణనాథా! అప్రతిహత ప్రతాప మార్తాండ తేజసూ; నేటికి అస్తమించితివా? ఆర్యవరు డయ్యు నీతమ్ముడగు సుగ్రీవుకు అన్నయానెకు ప్రేమబాసెను. శ్రీరాముండు నీకొంపతీసెను వలదంటిని బ్రతిమాలుకొంటిని, అనుజుని బాధించిన ఫలము తప్పక బొందెదవంటిని. ధర్మనం స్థాపనకై మర్త్యావతారమెత్తి రఘూద్వహుండయ్యె నంటిని. వైరంబువద్దంటిని నాపలుకులు వినక తెచ్చుకొంటివిమృతిని. ప్రారబ్ధకర్మంబువలన యని ఎలిగితివా? అంగదుని విచారము బాపగజూడవా? నేబిలచిన పల్కవా? ఆవేల్పుసానులనిచ్చగించి మమ్ము మరచితివా? నేను పొక్కుచూ వెక్కుచుంటిని. నన్ను తలంపవా? కామినీహృదయతస్కరా? నరవంశభాస్కరా యని పరిపరివిధముల నేడ్చెను. వాలీ, రణకేళీజితశూలీ! వీరవంశ శుష్కారణ్యజ్వాలీ! వనమాలియగు నారాముని కాళ్లపై బడిన

ఈమరణము సంభవించునా? ఒసురనాథా! ఇంద్రా! రాముడు నీపుత్రునోకనిని కాకి రూపంబున వచ్చినవానిని అంధునిగా జేసెను. ఇప్పుడు కృపనుమాని యింకొక్కసుతుని జంపెను. ఇంకేసుతునికి యింకనాశ్రయుడయి నోసంగుననుచూ యీరామాధవుని గోల్పెదవో (రాముని) జెప్పుమా నాథాయని—

— శ్రీరాముండు తారను ఓదార్చుట —

యిట్లునెత్తిని మొత్తుకొనుచూ, యేడ్చుచున్నయ్యబ్జాక్షిని జూచి, ఆవనజాక్షుడు, ఆమెచెంతకేగి కరుణాసాగరుండై యిట్లనియెను. ఓవనితారత్నమూ. మేను శాశ్వితమా?విభ్రాంతింజెంది, మనస్తాపము బొందిన, ఏమియూ లాభము లేదు. ఇట్లెందుకు, ఆక్రోశించెదవు, యెందుకని? ఎవ్వండు నిన్ను పెండ్లాడి ఇంతవర కఖిలకష్టంబుల కోర్చినవాడు, భానుసుతుండుండ, జచ్చినవానికొరకింత యేడ్చెదవా? అబలా, నిన్నేమందుననెను. ఆత్మ శాశ్వితముగా నిల్చునదిన్ని, దేహమనిత్యమై, పంచభూతాత్మకంబై, యెట్లు పడియున్నదో, యిపుడుచూడు, నిజమును తెలుసుకోలేక, యెందుకొరకిట్లు యేడ్చెదవు? అనిన, శ్రీరాముని ఉపదేశమును, అతివవిని దుఃఖమును కొంతమరచెను.

— సుగ్రీవుని పట్టాభిషేకము —

అంత రాముని యాజ్ఞను బడసి అర్కసుతుండు ప్రీతితో, వాలి కుత్తరక్రియల జేసెను. పిమ్మట సౌమిత్రి రాముని అనుమతింబొంది, నగరమునకేగి, భానునందనునకు

(సుగ్రీవునకు) పౌరులు ప్రస్తుతించుచుండ పట్టముంగట్టి,వాలి సుతున(అంగదునకు)యువ రాజపదవి నొసగెను. హనుమదాదులు శ్రీరాము నభినుతించి, యతనియనుమతిం బడసి పురంబునకు జేరిరపుడు. శంకవిడనాడి సుగ్రీవు శయ్యఁజేరి తార; నూతన శృంగారతారయయ్యెను. రాముం డఖిలజీవులను, బొమ్మల నాడించురీతిని, యాడించుచూ యలరుచుండును. సంతతమూ యెవండు రామునిధ్యానించునో వాడే ధన్యుం డగును. రామునిబోలుతండ్రి రఘురామునిబోలినతల్లి జానకీరాముని బోలు దేశికుడు శ్రీరామునిబోలు పరోపకారి శ్రీరాముని బోలు దైవము ధరణిలో లేడని నమ్మి సర్వమూ రామమయ మని యనుచూ గొల్చినచో స్థిరముగా స్వస్థతజెందుననెను, నరులు మునులు వేల్పులు స్వార్థపరులే ఒక్కరామచంద్రుడే పరోపకారి; ఎంతటి కార్యమైనా ధర్మచింతతో చేయునేకాని స్వార్థమును కోరడెపుడు. దుఃఖముచేక్రుంగి జీవచ్ఛవమువలే ముఖకళలుదక్కి అనిశంబు పొక్కిపొక్కి చిక్కినసుగ్రీవుని జేర దీసి అతులబలో పేతంబైన అధికారమొసగెను. విస్తారగుణా న్వితుడు విష్ణుఅంశ సంభూతుడు చిత్కళాధాముడు రాజశేఖ రుడు అగు రామచంద్రుండు సామాన్యమాత్రుండా యను కొనెను.

–: రామచంద్రుడు సుగ్రీవునకు రాజధర్మములు దెల్పుట. :–

అంత గోవిందుడగు రాముండు దినరాజసుతుని (సుగ్రీవుని) బిలిపించి యిట్లనియెను. ఓసఖుండా, భూపతులు భూమిని

ధర్మమార్గమున నేలుకొనవలెను. నేను ధీమంతుడననియూ; రణధీరుడననియూ భయంకరమగు ఆయుధములజూపి ప్రజల వేచుకొని దోచుకోతగదు. యెట్టివానికయినాయని నలహా నొసంగెను. ప్రజలవిత్తంబు హరింపనెంచి ఘోరపద్ధతుల నెల కొల్పతగదు. యోధులగువారిని నిరాయుధులంజేసి ఏయవని పతియైనా అణగదొక్కతగదు. తనపరిపాలనము ప్రజలకు ధర్మవిరుద్ధంబని తోచినచో మనుజవిభుడు పద్ధతులమార్చి ప్రజనుదనియించపజేయు టన్యాయము. అటులగాక. కినుకజూపి మంచిని వరికింపగ దనప్రజలనుబాధించి సొత్తుకాజేయుభూపతిని దుమింపవలెను. కుటిలుండగురాజు ప్రజకూ ధర్మమునకూ వైరియై నమస్తమునకు హానిచేకూర్చును. గాని అట్టిరాజును వెంటనే హతమార్పవలయును. రామచంద్రు డుపన్యశించిన రాజనీతిని భక్తితోవిని అర్కనందనుడు మంచిదేయని నమ్మ తించి నమస్కారమొనర్చి నత్కరించుటకై తనసౌధమున కాహ్వానించెను వినుము సుగ్రీవా. వదునాలుగేండ్లువరకూ నగ రమునజూడను, ప్రవర్షణగిరియందేను నివసించెదను. గాన మానసమున మరువకుమునన్ను. వరపరుతువునందు కలవనైనా మరువవద్దు అనినవిని ఎంతమాటంటివి వోయంబుజాక్షా, నీయాన తిని నా యోదలం దాల్తును. తరుణ మాసన్నమగువరకూ తాళ వలయుననుచూ సుగ్రీవుడు ప్రణతుండై పురికి వెడలెను. అంత రామచంద్రుండు లక్ష్మణునితోడ అవనిధరంబెక్కి గుహాంతర మునజొచ్చి ఓర్మితో వాసముంజేసి ఒకనాడు నలుదిక్కుల [illegible]

— వ ర్ష ఋ తు వు —

మాటమాటకి మేన జమ్మటలుగ్రిక్క లోకులు చీకాకుపడుచూ, నుస్సురనెడి వేడినిట్టూర్పుతో భీష్మమగు గ్రీష్మము వెడలెను. రాజహంసల గాలించి, ప్రజలకెల్ల నస్నాల నొసంగి మార్గమునబోవువారికి బాధపెట్టుటకై బయలుదేరెను. అల్లదేచూడు లక్ష్మణా, యామేఘచయము సంతోషముచే నెమళ్ళు నాట్యమాడగా మేఘగర్జనల వర్షాపాతముచే హంసలు భయంబొందగా, చుట్టూ మేఘావృతంబై నచ్చెచూచితివా దిగ్భాగంబులయందు, సోదరా! ఫలములతో వృక్షములుకుసుమంబులతోడ లతలు సొగసుగా నిండియుండ అందునవారిలు చిలుకులపల్కులు ముద్దులొలుక ఆపుష్పరసమును యానటకు మధుపంబులు (తేనెటీగలు) నందడింప యావనజాక్షుండు (రాముడు) ప్రవర్షణగిరిపైని యెంతయో సంతసమున గడపుచుండెను. అఖిలవిలాసగతుల సకలమృగపక్షులు సంచరించుచుండ ప్రకృతిసంపద యొప్పునటుల పర్వతంబున హర్షముచే శ్రీరాముండలరుచుండెను. అంతటా ఉరుములు, మెరుపులు చెలరేగి కుంభములతో సలిలంబు క్రుమ్మరించురీతిని భోరున వర్షము కురియుచుండ చూడ సొంపుగ కన్పడె క్షోణీధరము. మునులు, యోగులు వచ్చి దర్శనముచేయ రాముండు సంతసించి మధ్యమధ్యను రాజనీతులనూ, భక్తివైరాగ్యములనూ, లక్ష్మణునకు చక్కగా బోధించుచుండెను. భక్తులను, విరాగులను జూచి గృహస్థులతులసంతోషమును పొందునటుల ఆలన

ములగాంచి (మేఘములు) పింఛములనువిప్పి నీలకంఠంబులు
ఆడు లీలనుగంటివా? ఉరుముల నాంకింపగా వియోగుల మనం
బు తల్లడిల్లును. మెరుపులకాంతి యస్థిరులమేర, పదింపదిగా
వచించును. పిడుగులు పయింబడగా నగంబులు సైచును.
క్రూరచిత్తులను వరలనుబోలు నెగ్గులకు ఉత్తములోర్చురీతిని,
జరుగును లక్ష్మణాయనెను. వర్షధారలను సాధుజనసరస
ప్రసంగములను, సైపజాలని కుజనుల చందమున పశుపక్ష్యా
దులు ఇంచుకంతయు సైపక, యేవగించెను. పుడమినిగల
సొంపైన మానుల కూలద్రోయుచూ, వడివడిగా పొంగి
ఒడ్లు కోరించుచూ పారెడు నీసెలయేళ్లను చూచితివా? నడు
మంత్రిపుకలిమి బొందిన అల్పులు గర్వించి అడకువలేక
లోకులకు హానిచేకూర్చురీతిని ప్రవహించుచున్నవిసుమా;
మాయలోజిక్కిన జీవుని మానసంబు కళంకముబొందిన
కరణి యీవర్షపునీరు, భూమిపై బడినంతనే లక్ష్మణా జూచి
తివా, కళంకంబు బొందెను. ఈజలము ధరయందుగల వేడిని
బాపి, జీవుల కాపాడగాజాలును కంటివా? సజ్జనులు సద్గు
ణంబుల సంగ్రహించువిధాన సరస్సులు వర్షసలిలములు బడసి
నిండినవి. వాటిలో నేత్రపర్వముగా కప్పలు కుప్పతెప్పలుగా
మెలగుచుండెను. ఈశ్వరునిబొంది, జీవులు శాశ్వతబ్రహ్మ
లోకసుఖంబు బడయు, నియతిదెలుపు రీతిని సమస్తనదులును
వననిధిని సంగమంబగును. చూచుకొలది ఆనందమతిశయిం
చును. పతితపాషండుల వితండవాదములచే వేదమార్గము

నశించువిధమున సకలవనపదమార్గములు లేతపచ్చికతో కప్పబడియున్నవి. చూచినావా లక్ష్మణా? బ్రహ్మచారుల వేదపఠనంబు మాడ్కి, కప్పల బెకబెకలు ఘోషనిండెను, విజ్ఞానులు విలసిల్లురీతిని, గ్రూకులెల్లను విలసిల్లుచుండెను. సదాగ్రజ్యమున దుష్టజనంబుభాతి జిల్లేడుచెట్లు పెల్లణంగెను. ధన కాంక్షగలవాని, ధర్మనుపగిది, పంకముచే తోగ్రవపొంకమడ లెను. స్వార్థపరుని సంపద ననుకరించి, పొలమునగల వరి చేలు పొలుపుమీరెను. అధిక స్వేచ్ఛబొందిన యువతిబోలి, కడువడిగ జలంబుగట్టుదాటి ప్రవహించెను, మాయంజిక్కిన నరుని యజ్ఞానమువలెనే చీకట్లు అంతటా గాఢముగా నల్లుకొనెను. అపుడపుడు విజ్ఞాన మంకురించుగతిని ఖద్యోతకాంతి, కలుగుచుండెను. కామమోహాలోభాదుల రూపడంచి ఆత్మ పరిశుద్ధిజేయు మహాత్మునివలె గాబుమొలకల బెల్లగించి, కృషివలుడుక్షేత్రమును బాగుజేసెను. కలియుగంబున అఖిలవర్ణాశ్రమములు, కనిపించనికరణి యీకాలమున స్త్రీపురుష చక్రవాకపక్షులు దినమునందు కాన్పింపకున్నవి గాన ఆశ్చర్యము దోపుచున్నది. తెలసిన సాధుసజ్జనహృదయములందు లేశమైనా కామంబు లేనియటుల ఊసరక్షేత్రంబులందు ఒక్కమొలకైనా కన్పట్టుకున్నది, చూడుతమ్ముడా పరంబెరుక లభించగానే యింద్రియములు చేష్టలనుడక్కి విశ్రమించురీతిని, వర్షయోగంబున, సామాన్యబాటసారులు, పైకి వెడలకుండ విశ్రమమును బొందిరి. ఖలుండు పుత్రుడై పుట్టినందున కుల

ధర్మములు నశించును. ఆవిధానముననే వాయువు చెలరేగి వీచి నచో యెల్ల మేఘములు దిక్కులు చెల్లాచెదరాయె సుమా. నీటితాకుడువలన సూర్యునకు తేజంబు తగ్గెను. నీటిని బాసి యెంతయో వెలుగజొచ్చెను; అట్లనే అల్పసాంగత్యమున జ్ఞానమంతరించుచు అల్పులబాసిన జ్ఞానమతిశయించును.

—: శ ర దృ తు వు :—

రాజద్రాజ రాజహంసదంపతుల సామ్రాజ్యంబు కాశో త్పలాంబోజశ్రీకము ధవళజీమూతము నక్షత్రరత్నాంబరంబు, మధురసుధాక్షాళితాళాజాడ్యంబు, శరత్సమాగమ విలా సంబుసుమా లక్ష్మణా, నిరీక్షింపుమా; పండితం మన్యవిరస శబ్దములబోలి దదలను నిరస్తమేఘగర్జనలు హెచ్చెను. వర్షఋతువుకు వార్ధక్యమువచ్చెనా యన్నట్లు పచ్చగడ్డికి తెల్లనిపువ్వులు పుట్టెను. ఆత్మసంతుష్టిచే లోభమంతరించి నటుల అగస్త్యోదయంబున, అంబువుల మహోల్బణమణంగ, వ్యామోహమంతరించిన, నైర్మల్యమొందిన స్వాంతమట్లు, జలా శయంబులు అమలభావంబుబొందెను. వివేకముగలవానికి మమకారమణంగురీతిని, నదీసరోవరముల యుబ్బణంగె. నెర వాదిగతించినవెంటనే తిరిగి, కల్మిబొరసినమూఢ్కి, ఖంజనము (కాటుకపిట్ట) బొందెగతించిసద్వృష్టి; శరదను జూచితివా తత్స మాగమముచాలా శుభప్రదమునుసుమా నీతిదప్పనినృపతి రాజ్యమున ఈతిబాధలుండనిరీతి శరదసొంపుబొంపు బురద బూడిదలేక, యెంతవైభవంబుగా నున్నదోజూడు. మును

గలకలిమిని కోల్పోయి పరితపించు ధనికునిచందాన అఖిల జలాశయములలోనుండు మత్స్యసంతతులు, వ్యాకులము జెందుచున్నవి. నిష్కామయోగీంద్రుభంగి, మేఘము లంతరించి గగనంబు నిర్మలముగా నుండెను. ఎక్కడనో ఒకసద్భక్తుడుండుకరణి, నెచటనో వానకురియు ఈఋతువునందు యుద్ధమున జయించుకొరకు, రాజులరుగువేళ, అమితధనకాంక్షతో వర్తకులరుగువేళ, యాచనకై భిక్షకులరుగువేళ, తమ్ముడా లక్ష్మణా, మెల్లమెల్లగా దాపరించెను. మిక్కిలి పెద్దజలాశ్రయము నాశ్రయించి సకలసౌఖ్యంబులొందు మత్స్యముల మాడ్కి సకలభక్తులు దైవంబు నాశ్రయించి అఖిలసుఖముల బడయుదురు. జీవనప్రద విమలసరోవరంబు ఫుల్లపద్మంబులతో, శృంగారము నొప్పునట్లు, సగుణరూపంబుదాల్చి నిర్గుణుండు, తేజోమయుండై నెగడుచుండె. స్వాతివానను బడయని చాతకములు, దాహముచే బాధపడుచుండెను. అటులే దైవభక్తిలేక, సంసారదుర్భరక్లేశములను మూర్ఖులు బాధపడుదురు యనెను. శరదాతప తాపము చంద్రమసుడు వారించెను. అట్లే దుర్భరభవపాపపరిపాకము సజ్జనుండు వారించును. చంద్రునిజూచి చకోరములు సంతసించురీతిని భక్తవరునిజూచి సాధుజనులు సంతసించెదరని శరత్సమయలక్ష్మి పల్కుచున్నది. పక్షులధ్వనులనుబట్టి గోచరమగును. భవసంబంధపాపచయము, దైవభక్తివలన క్షయమొందునట్లు, శరత్కాలమున మశకమత్కుణకోటి హేమంతమునకు, లయము

నొందునుగదా లక్ష్మణా! సద్గురువు నాశ్రయించినచో కామ, మోహ, లోభాదులెట్లు నశించిపోవునో అట్లేవర్ష కాలమున పుట్టి పెరిగిన క్రిములెల్ల ఈ శరత్కాలమున నాశమొందును. హర్షమెసగ, వర్ష ఋతువు వెడలెను. శరద యేతెంచి, దిశలు తేజంబుగొలిపె, ఇదేసమయము కార్యముల జక్కజేయ నెచ్చటయున్నదో నాసీత నేనెరుగు టెట్లు అనెను. సీతను విలోకించక చిత్తము తల్లడిల్లు చున్నది సుగ్రీవు డావృత్తాంతం బెరిగింపరాడాయెను. తారనుబొంది వాగ్దత్తజ్ఞానమును విడచి నన్ను మరచినాడా! క్రీడావిలోలుండై రాజ్యసంపదలతో కులుకుచూ, యుద్వృత్తిని బొందెనా! నెలత (సీత) యెచటనైన జీవించి నిల్చియున్నచో కాలునిన్నైనా గెలచి తెచ్చెదను. ఉనికిని యెరిగింతునని బలికి, సుగ్రీవుండు రాజ్యమదంబున రాకయున్నాడు లక్ష్మణా. వాలినిగూల్చిన కోలచే సుగ్రీవునెటులగూల్చెదను! వినోదముగా నేను నేలను నాటిన మొలకను, నాచేతనే యెట్లు పెల్లగింతునులక్ష్మణా! కిరీటకాంతులు దిశలందు శోభిల్లగా గర్వించి పూబోడినిగూడి మదించి మైమరచి ఆమోహాబ్ధిలో నీదుచూ పాడినిదప్పెనో, లేక రాముడెవడో యనుకొనెనో, వెంటనేవచ్చి కార్యవిధానములదెలుపడా! ప్రావీణ్యమునుజూపడా? కామాంధకారము కనులగప్పెను. వెంటనే అఖండసంపద చేకూరెకదా! మన స్నేహము ఆ యినసుతుడు, రాజ్యమదమున, మరచుట అబ్బురమా తమ్ముడా!

—: లక్ష్మణుడు సుగ్రీవునిపై ఆగ్రహించుట :—

అనగా, లక్ష్మణు డాగ్రహించి, బాహుదండంబున ధనువాక్కుమ్మడి నెక్కుబెట్టి ఓయన్నా! యిపుడే సుగ్రీవుని దండింతుననియూ వేగమే యానతిమ్మనిన, యోధాగ్రేసరుని ప్రేరేపింపక రాముడు తమ్ముని యహంకారమును వారించుచూ, యిట్లనియెను. ఓలక్ష్మణా! ఆగ్రహమున దాలిమి దక్కి మోహముచే మరచిన నానఖుని ఒక్కుమ్మడి వధింప సాహసించక కటోక్త్యులంబల్కి భయమునుగొల్పి శీఘ్రముగా వానిం తోడ్కొనిరమ్ము. అఖిలానుకూలములు గలుగును, ఇట్లు రాముడు తమ్ముని దురాగ్రహమును అణచి ఆతడు వ్యామోహంబున నాదమరచెకాబోలు. అంతమాత్రమున వధించనగునా యనుచుండ నాయవసరమున—

-: హనుమంతుడు సుగ్రీవుని ఆక్షేపించుట ;-

మతిమంతుడు, హనుమంతుడు వానరేశుడు కృతకృత్యుండగుటంజేసి వానరేశుడు సీతాపతిగతి మరచెగదాయని వెంటనే వెడలి వానరనాథులి గనియెను. మదనవశు జిక్కి సర్వంబు మరచినట్లు అర్కసుతునకు మ్రొక్కి ఆయనిల సుతుడు హస్తములమోడ్చి శ్రీరాముని దలంచి ఏకవాక్యంబుగానవ్వి యిట్లనియెను. మరచితివా రఘూద్వహుని మానసంబున అధర్మపద్ధతిని నేర్చితివా? కృతఘ్నుడవనటుల స్నేహధర్మమును చెరచెదవా? రఘూద్వహుడు చెప్పినకార్యమును ఎట్లేర్చరచితివో, ఓవానరేశ్వరా యుదార్థ

మును ఒకించుక బల్కుమనెను. భేదదానదండోపాయ ములవిడచి సామమున సౌమ్యమున నిన్ను చక్క జేసిన రాముని మరచితివా? ఓ వానరేశ్వరా! దూతలబంపితివా లేదా? అనిన తృళ్ళిపడి యర్కసుతుడు విషయవాంఛకు లోనైతి వెడగునికితిని—

సూర్యతనయుడు వానరసేనను చేకూర్పుమని
—* హనుమకు ఆజ్ఞాపించుట *—

ఓయనిలనందనా! దూతలను వెంటనేబంపి ముందుగా వానరవీరులను రప్పించవలెను. వేగముగా వారురాకున్న విడువకుండ యెవ్వరైనాసరే శిక్షింతుననుము. నాశాసనమున కడ్డులేదనుము, ఇప్పుడే అన్నిదిశలను చాటింపుమూ, పవన తనయా! అతిశాంతుండైన హన్మంతుడు సక్రమంబుగా వెం టనే రాజశాసనమును దెలిపి యెల్లెడలంగల వానరమల్లవీరుల దోడితెండని తొలుత దూతలను నలుదిక్కులకూ బంపెను.

అంతట అంగదుడు వినయానతుండై వచ్చి వినిన్వంతతనూజుడు (సుగ్రీవుని) పాదములపైబడి మ్రొక్కి యిట్లువచించెను. ధీమంతుడును యశోనిశాంతుండును యగు హన్మంతుని పంపినచో దిగ్భ్రాంతులువంటి వానరులు ఆదరించి తప్పక వత్తురుసుమా. ఆంజనేయుడు సరసుడు బుద్ధిమంతుడు అతిశాంతుడు ద్వీపములు కులపర్వతములు సరస్సులు సాగ రంబులు బాగానెరింగినవాడు ఎవ్వరికిని చిక్కనట్టి అసాధ్య బలవంతుడు. సర్వమునీంద్రసంచయముతో బరిచయమున్న

వాడు గనుక కార్యసానుకూలముకొఱ కాతని బంపుమనెను. అంత నర్కసుతుం డనిలసుతునకు వెడలిరమ్మనినంత ఆవీర వరుండు మంచిదని సంతసించి కుప్పించి, యెగిరి పాశ్చిమకు జని వానరవీరులజూచెను. గవయుగవాక్షు లనేకలక్షల వాన రులతో శీఘ్రముగా వానరేశు నికటమునకువచ్చి వినతులై మ్రొక్కి అతనిచే అధికమైన మన్ననలబొందిరి. గవయుగవా క్షులబంపి వెంటనే హనుమంతుడు, రోహిపర్వతమునకుజని, దుర్ధ ర్షునిగని, రాజాజ్ఞ నెరిగించి, అటనుండి శీఘ్రముగా వ్యాహార పర్వతంబుజేరి బలవీరుడను కీశనాయకుని కిష్కింధకంపి, య చ్చటనుండి ధుంధుమాద్రికరిగి బలువైన శ్రీఖండవానరుల పంపి కదళికనుజేరి, గజునిబంపి, అంజనాద్రికేగి, కుముదుని బంపి, నీలశైలమును దవిశి, నీలునిబరికించి, సుగ్రీవాజ్ఞ దెలిపి, వానిని కిష్కింధకంపి తక్షణమే బదరికాశ్రమమున కరిగి, నటనుండి, గంధమాదనాద్రిజేరి, అచ్చటచ్చటగల వానర యోధులంబంపి, అర్జునాద్రికికుప్పించి, దుర్జయుని, సుషేణుని (తారతండ్రి) బంపి, శీఘ్రగతిని మేరుగిరిలోనున్న వానర శ్రేష్ఠులలర బ్రవేశించె నచట- తరుణార్కబింబముబోలు, వదనంబుతో వరలువాని శరణాగతులబ్రోచు కరుణారస మొప్పునట్టి చక్షువులవాని నరసురనుతమేరునగమును చుల్క నగాజూచు ఘనశరీరముతో గ్రాలువాని ఇంద్రచాపమా యన్నట్లు తనవాలంబెత్తి వాయువేగమున వెడలువాని అంత రిక్షము నాక్రమించు స్థూలదీర్ఘబాహువులవాని పరికించి రా

యనిలపుత్రుని; యచటి కీశాధిపతులు, ఆదరించి ఆజ్ఞను పాలించిరి. వీర కేసరి యను కీశనాయకుండు, అఖిలవానరసైన్యములతోడ హనుమపంపున పంపకు నప్పుడే వెడలెను. వాని సేనలుయొక్క సంఖ్యగణించుట కాయాదిశేషుండైన, పనికి రాడు. రుద్రగిరికేగి, పరమపావన కైలాసపర్వతస్థ వానరుల పంపకుబంపి, పిమ్మట అలకాపురింజేరె నాయనిలసుతుడు. సూక్ష్మబుద్ధిగల వానరకులాధిపు లెల్లరూ కొల్చియుండగా నిస్తులబలవంతు డితడని, తననాయము నెరుంగజేయ, మాయలంబన్ని దానవుల కంతమొందించునట్టి బలపురమని, వాయుసుతుండు, కనుగొనెను. బలపురదుండులేచి, పావనికిమ్రొక్కి యతని యానతి దలదాల్చి, వెంటనే గొప్ప వానరసేనతో పంపకు వెడలెను. జయము జయము శ్రీరామలక్ష్మణుల కనుచూ, జయము రామసఖుండగు, సుగ్రీవునకనుచూ, గండుమీరిన మిడుతలదండుసగిది, వేయి లక్షలవానరులు, అప్పుడు వెడలిరి. పిదప మైనాకపర్వతంబెక్కి యచటగల వానరశ్రేణి కానతిచ్చి, తర్వాత మంచుమలకేగి, వానరమండలాధిపతిని, నండకనామునిఓపార్వతీ హన్మంతుడు పంపెనపుడు. కరువలిపట్టి (హనుమంతుడు) వింధ్యపర్వతమునుగని, గజంబుల నొక్కతొక్కదెబ్బతో గొట్టగల్గిన యఖండబలాఢ్యుడు వసంతునితో సుగ్రీవాజ్ఞనుదెల్పి, ఖగనాథునిమించు జవంబుతో సుందరంబగు ఇంద్రకేలిని కనులవేడుకగా, దారుకొనెను. అంతయుండు వానరకోటి అనిలపుత్రుని నాజ్ఞ నవధరించి, రాముని

డతిబలుండు అరిజైత్రుడగుగాక యనుచు వెంటనే పంపకేగిరి. హిమ్మట కరువలి వేగముగా, కళ్జాపపర్వతంబెక్కి వానరపతి మైంధవునిబిలిచి కర్జమెరిగించినంత నాతడు పెక్కువానర సేనతో పంపకుజనెను. నీలుడు, మహాకాలుడునంటివాడు, సాధువులకుపకారి సచ్ఛీలుడు, సాటిలేని కపిశేఖరుడు ముక్కోటి వానరులతో జనెను. ధవళగిరిపద్దనున్న దుర్గంధుడనువాని, బహుబలాఢ్యుని కోట్లసంఖ్యగల వానరుల పంపకుబంపి వాయుసుతుండు వెడలెను. ఉదయగిరికేగి కుముద, కుందులు వానరాధిపతుల కిష్కింధకుబంపి, వాయుగతిని భూతలగిరు లన్ని హనుమంతుడు వెతకజొచ్చెను. ఓహిమనత్కుమారీ! పార్వతీ! యెల్లెడలగల వానరమల్లవీరుల వెదకి, పంపాపురీశ్వరు వద్దకంపి, శ్రీఘ్రముగా నావాయుసుతుడు, నెలవునకు మగిడి వచ్చెను, వానరసముద్రముగా బోలని బ్రహ్మ పెక్కురు రాహుకేతువుల సృజించెనేమోయనుచు బ్రహ్మాండమూ చంద్రుడూ దాగుకొనిరి. మిడుతల దండు వలెనున్న వానర సైన్యమును లెక్కింప నెవరితరము? వాయువేగమున బోవు చున్న వానరసమూహములజూచి దేవతలు భీతిల్లజొచ్చిరి. దట్టమయిన చీకట్లుక్రమ్మి చంద్రసూర్యులమ్రింగి అంతరిక్షంబు నలుముకొనియెను. కహకహారావంబు మార్మ్రోగగా దైత్యుల యుల్లములు తల్లడిల్లెను. అతిబలులు, శ్రీరామలక్ష్మణులు ఆహవంబున శత్రుల జయింతురనెడు ఉత్సాహముచే జయ జయధ్వానములు సంక్రమించగా కాలుండు యిదే శుభ ముహూర్తంబని లంకలో కాలుబెట్టెను.

లంకారాజ్యపతనహేతువన ధూమకేతువుబోలిన స్థూల దీర్ఘవాలమును మీదికెత్తి వేగముగావచ్చిన యాహనుమను కౌగిటంజేర్చె నాసుగ్రీవుండు.

—♦ లక్ష్మణుడు ఉగ్రుడై సుగ్రీవుని జేరుట ✳—

అంతట లక్ష్మణుండు ఉగ్రుడై హస్తంబున విలుబూని దిక్తటంబుల వ్యాపించు ప్రళయాగ్నికరణి, తన ఆశ్యమున ప్రళయార్కకాంతి రహింప భానుసుతుడేడీయంచు అరుదెంచెను. వచ్చినసౌమిత్రింగని భానుపుత్రుండు రిచ్చపాటున తల్లడిల్లగా కపులెల్లభూ భీతిల్లిరి. అంగదుండంతట నేగుదెంచి వినతుండై కాళ్లపై బడినంత లక్ష్మణుడచ్చపు ప్రేమతో నతని కౌగిటజేర్చెను. తారయేతెంచి ఓయనఘా ! సంసారధర్మం బెట్టిదో నీవు బుద్ధిమంతుడవుగనుక యెరుగుదువు. తప్పుల క్షమించుమని పాదములపై వ్రాలినంత సుగ్రీవుం డిట్లనియెను. అనఘా! విషయముల కగ్గమైనవాడు సదసద్వివేకము లరయగలడే! మోహావశంబున యింద్రియములకు మునులుసైతమూ భ్రమపడెదరనుసంగతి వినవా; సౌమిత్రీ యనెను. అంత హనుమంతు డమలధీమంతుం డగుటంజేసి సౌమిత్రినజ్జకేతెంచి ప్రస్తుతించి అఖిలదేశంబులనుండేతెంచిన వానరవీరసైన్యంబును జూపెను. సౌమిత్రి మేల్మేలని మెచ్చుకొని వారలదోడ్కొని రామభద్రుజేరి మొక్కి పొంతనిలచి అంతయూ నెరిగించిన ఇనసుతుండు వినతుండై విన్నవించెను.

—• సుగ్రీవుడు లక్ష్మణుని క్షమించుమని వేడుట *—

ప్రబలంబగు నీమాయంజిక్కి యాదమరచితిని. ఎట్టి జ్ఞానియైనా విషయేచ్ఛ తగిలి చెడును. నేననగ పామరుండను గదా; యెంతవాడనో చెపుమా? మునులు పామరులు అమరులు మోహాంబనెడు ఉరులకుఁజిక్కి తరుణులవశంబగుదురు. ఎవడు వ్యామోహమను గ్రాతికి అవశుడై చరించునో వాడే నీకు సమానుడని దలంతును. పామరుండు యింద్రియములకు పట్టుబడక సంతతసాధనముచే జ్ఞానికావచ్చును. ఇంతకూ భవత్కటాక్ష మొక్కింతయున్న సర్వమునూ లభించు ననుకూల సమయమందనెను. శూరులనేకవర్గముల శోభిల్లుదురు. వానరులుకుమీరు హంవీరులు. దుష్టదానవుల పీచమణగింపజాలు ధీరులు. వారలజూచి రాఘవుడు పెక్కుతియ్యనిపల్కుల సత్కరించి ప్రతివానరవీరుని సత్కృపచే దనియించెను. రామచంద్రుని సత్కృపారసమునందు స్నానముంజేసి ఒక్కొక్క వానరవీరుడు రామా గుణధామా సంగ్రామభీమా యనుచూ మ్రొక్కులిడవచ్చిరా రామచరణములకు పంకజాక్షుని కరుణకు పాత్రులైన వానరుల నేను జూచితి ఓపంకజాక్షీ! వరుస రిక్కల లెక్కింపవచ్చుగాని వానరులెందరో లెక్కింపనలవికాదు ప్రతిఫుష్పమందూ మధువున్నరీతిని యెల్లవానరవీరుల హృదయముల నాచరాచరచక్రవర్తి సంచరించెను. రాముడు నిజముగా ఆదినారాయణుండే—

## సుగ్రీవుడు సీతాన్వేషణార్థై వానరయోధులను

## —♦ నలిదిక్కులా బంపుట ♦—

అంత సుగ్రీవుడు కీశాధిపతులందరిని గాంచి యిట్లనెను. మీరు రాఘవుని కార్యదీక్షనేగి యెల్లెడల తిరిగి తిరిగి జానకీమతల్లినిజూచి సత్వరముగా రావలెను. ఏమరకుండా వినండి మీకొక్క నెలమాత్రమే గడవొసంగినాను. అవనిసుతజాడ తెలియక వ్యవధిదాటివత్తురేని వెంటనే మిమ్ము వధింతును. విడువనిపట్టుదలతో మీరంతా భూ నదీనదములు సాంద్రవనముల కందరంబుల ఆలశ్యములేక చతుస్సముద్రమధ్యగల సమస్తభాగముల తాల్మితో వెదకి క్ష్మాసుతయొక్క త్రోవ యెరిగిరావలెను. అవనిసుతగూర్చి యెల్లరనడిగి అవనిగల యెల్లలోకంబులరసి మీరుచూడని తావొక్కంటైనా లేదనకుండా మహితగుణధాముండా శ్రీరాముని కార్యము మరువవద్దు. గజగవాక్షులారా! యీకార్యంబు సాధింప మీరు తూర్పుదిక్కున వెదకబోండు. గడవుదాటకుండ కలియజూచి వేగరండు. తదుపరి సుషేణునిబిలచి మైందవునితో కలసి ఉత్తరదిక్కునకుబోయి ఆలసింపక యుర్వీపుత్రిక నరశిరండు. చెప్పిన గడవును దాటవలదు. గంధమాదనము మేరువు నీలార్జునాదులు కైలాసగిరి అలకాపురము అందందు పరికించి యక్షకిన్నర నరులను పృథ్వీసుతనుగూర్చి పృచ్ఛజేసి మానససరోవరమున స్నానమాడి క్షుత్పిపాసల తీర్చుకొనుటకై మిక్కిలి రసభరితంబైన మధురఫలంబులు పరిపక్వమైనవిమాత్రము

గొని బడలికదీర్చుకొని వేపాశికన్నడినా అడుగుచూ మరల వచ్చి సీతావృత్తాంతంబు దెలుపవలయును. పిమ్మట మ్లేచ్ఛ దేశములు అందుగల గిరులను దరులను వనంబులను పొద లునుజూచి ఉత్తర సముద్రమునగల ప్రదేశములన్నియూ వెదకి మంచుజలము పేరొకొనుచుట్టియూ సూర్యుడు ప్రసరింప నట్టియూ స్థలంబుల వెదకి పిమ్మట శ్వేతభూమికి వెళ్ళుడు.
వనితలమంతయూ తిరిగి కైలాసనగరమందు కాకభుశుండి గలడు. అతని దర్శించిరంతు. ఆనగము సమీపమున పవిత్రమైన స్వచ్ఛజలకుండము మీకు కన్పడును. అందలి జలంబు, అమృతతుల్యము, కస్తూరమయంబైన సువాసన ఒప్పుచుండును. ఆప్రదేశము అతిసారవంతము దానిచెంత నొకజంబూవృక్షముకలదు. అందుకనే యాభూభాగంబునకు జంబూద్వీపమందురు. దానింజూచుట నయనపర్వమేయగును. మాధుర్యముతో నొప్పారు నాజంబూఫలరసభరితంబగు గుండ మెప్పుడూ నిండియుండును. అమరులు ఉల్లమలర నాకుండ మున స్నానమాడుచుందురు. ఆసుందరతరంబైన కుండంబు నుండి ఒకనది యెల్లప్పుడూ ప్రవహించుచుండును. అదియే సరయూనదియొక్క జన్మస్థానము. అందుమునిగిన మీయఘ ములు బాయును. పిదప శ్రీరామనామంబు స్మరించి శూర సేనమండపముజొచ్చి నచ్చట రోమశఋషిని దర్శించి వాని యాశీర్వాదంబు బడసి వానిరోమము ఒక్కొక్క ప్రళయ మునందొకటి రాలుచుండును. గాన [illegible] నున్నదు.

వానిని భూజాతనుగూర్చి నడిగి పిమ్మట శాండిల్యమున్యాశ్రిమ మునకుజని దర్శించి కొందరు వానరులు అశ్వక్రాంతమున రోమఋషిసీమలరసి సైనికకుక్కుటస్థానంబులజూచి పశుశీల మునుగాంచి ప్రళయము క్రౌంచము యావర్తము వెదకి తురగ ష్కమును పరీక్షించి, అశ్వీయ దేశ మరిగి కాని వలము బర్బర రథక్రాంతము వెదకి పిదప విష్ణుక్రాంతవిషయముల మెలగి చీన, మహాచీనముల జరించి తాళతోషకాత్యున్నతస్థలంబుల గనుడనెను. స్వర్ణభూమినిజొచ్చి స్వేచ్ఛగ జరించి, పార్వ తావర్తపారశ్యపహనవముల, బ్రిహ్మదేశమును దుర్గద్వీపము లను తిరిగితిరిగి అపక్రాంతప్రదేశమునుగని కాంచనపర్వస్థవీధుల కలియజూచి తోవ్రిగన్పట్టి మునుల సాధువుల నడిగి, వారల యుదంతము గ్రిహింపవలయును. శూద్రియవన గ్రామా దులజూచి, కాంధారము బరికించి, పంచనదమును దర్శించి కాశ్మీరంబు తిలకించి గిరిగుహాశ్రేణివిలోకించి అంభోధినదీపరీత సకలద్వీపంబులను చూడుండనెను. శ్రీమయనక కోసల, మిథిల, సౌవీర, సౌరాష్ట్రిభాగములున్న కేకయ, వారణాసి, కురుజంగాలము, కన్యాకుబ్జము, ఉత్కళ, కాంచి, చంప, వంగ, గౌడ, దేశంబుల గనుగొని కళింగంబు విలోకింపుడు.

కామరూపశూరసేనాదులు, మగధ ఘూర్జర, యింద్రి ప్రస్థ, మత్స్యప్రిదేశంబులు జొచ్చి, అతిగహస్య ప్రిదేశంబులు సహితము చూడవలెను. ఈ ఆదేశంబులేమిటి, యావద్భూత లంబవలోకించి, ఆయాసంబనియెంచక నాయానతిని మన్నింప

వలెను. అనినవిని రాఘవుండు ప్రాణసఖా, సుగ్రీవా, యిన్ని దేశాలెప్పుడు చూచితివియని యడిగిన కంటనీరుబెట్టు కొని, ఓయనఘా, నాయన్నవాలి భయంబున పూర్వము పర్వతములు, వనములు, సర్వదేశముల వాసముచేసి, వేషధారినై తిరిగితిని. ఇంద్రతనయుని భీతివల్ల నెల్లదేశముల సంచరించితిని, సకలంబు గంటిని, నేనెరుగని వార్నిధులు, నదులు, వనములులేవు. నేటికి తత్ప్రయోజనము గంటిని. పిదప సుగ్రీవుం డత్యుగ్రవీరుల, కీశపతులబిలచి ధీరవరులారా మీరలు పశ్చిమదిశకు వెడలి, స్వామికార్యమును సాధింపవలెను. రంగభూమిని పరీక్షించికొందరు, అన్యదేశంబులగొందరు, అరశి రండు, శ్రద్ధతో స్వామి కార్యము జరపి, నెలగడవు దాటకరావలెను. లేనిచో శిక్షించెదను. సకలసేనావనద సంతా, జాంబవంతా, అతులబలసంతా, హనుమంతా, అరికృతాంతా, అంగదా, దోర్బలాంగదా, అసురకాలులార, నలనీలులార బలాఢ్యులార స్వామికార్యము సాధింప నిదే సమయము. శక్తివంచనలేక వెంటనే దక్షిణదిశకుబోయి ధరణిపుత్రి యునికి బరికించి సద్యశోధనముగండు. భోగవిలాసులు యీభూస్థలిని శాశ్వతమని యెంచి అంధులై భవసాగరమున బడి, మోక్షసాధనము విడచి పాపాత్ములై చచ్చుచూ పుట్టుచుందురు. బాగోగులరసి జనుండు ఉత్తమమార్గమును పొందుట మంచిదికదా? ఓవీరాగ్రగణ్యులారా, రామచంద్రుడు దేవతారాధ్యుడు; అతనిచరణములంగొల్చి సంసారజలధిందాటి

పుణ్యామతులారా మీరు పరమపదమును సాధింపవలెను. భూమింగల ప్రతిదేహి, రామపాదాంబుజములగొల్చి తన్నామ మంత్రింబుజపించి, ఘోరసంసారవార్ధిదాటి ఓసోదరులారా, తత్వమును గ్రహింపవలెనుగదా! కంటికికానరాని మోక్షపదవి కంటె పామరులకు ఐహికసుఖంబు మిగుల తియ్యగానుండును రామచంద్రుని సేవకూడా కర్తవ్యంబని భక్తితో ధ్యానించు వాడు పావనుండగును. ఈశరీరము తుచ్ఛమని యెవగించి రామకార్యమును సాధించి రామనామమంత్రమును స్మరించుచూ సత్యశోధనముబొంద . వేగమేనుగిడి రావలయును. సుగ్రీవానతి నవధరించి, జాంబవంతుడు జయమని పొగడ అంగదుడు ఔననెను. నలుడు, నీలుడు, కేసరితనయుండు నంతసించిరి. వానరబలమంతా ప్రయాణసన్నద్ధులౌచుండ ఆంజనేయుడు శ్రీరామపాదాబ్జములకుమ్రొక్క "ఆజ్ఞయని" దేవతలంతా అభినుతించుచుండగా, యనినజానకీనాథుడు ఏకాంతముగా ఓ హన్మంతా! బలవంతా యని ఆశీర్వదించి తన ముద్రికనిచ్చి మంతనములాడి శీర్షమున తనహస్తమిడెను.

శ్రీరాముడు హన్మంతునకు తన ముద్రిక

— ♦ నానవాలిచ్చుట ♦ —

హనుమా వినుమా జానకిని గనుమా! రాముండు నిక్కముగా నిన్ను గైకొనును; హనుమా అనుమానింపవద్దనుమా, నీకు జయంబగునను మా. అనిన హన్మంతుడు మ్రొక్కి ధ్యానించి నుతించి ఆహా! జన్మసార్థకమయ్యె నను

చూ, స్వామికార్యంబు సాధించివత్తునంచూ హుంకరించి యహంకరించి జృంభించెను. శాశ్వతధర్మసర్వస్వరూపుడై, వర్ణనాతీతుడై మోక్షరాజ్యపదవీసింహాసనాధ్యక్షుడై భక్తులకు భాస్కరుడై నన్ను పాలింప శ్రీరాముడై పుట్టిన ఆదిదేవుని కృపచేతను నేను ధన్యుండనై తిననెను. శ్రీరఘురాముని బాధించిన కూరుని పతివ్రతాచోరుని రావణునిజూచి వాని లంకాపురముజూచి, సీతాసతీమణి యునిక్కజూచి నాదుర్వార పరాక్రమము వైనుల్కించుక వెల్లడించి ఆరాక్షసవీరులు భీతిల నురలుమేలన నేగుదెంతును. అని క్రొండంత యుప్పొంగి రామచంద్రు నాత్మధ్యానించి రామా! రఘురామాయనుచూ ప్రస్తుతించి రాఘవులకు జయము జయంబనుచు కేసరీపుత్రుండు వెడలెను. వానరులెల్లనూ వార్ధుల నదులదాటుచూ అరణ్య పర్వతప్రాంతములను గిరుల పల్లెలదాటుచూ అష్టదిక్కులను భ్రమించునూ రాముని ధ్యానించుచూ దక్షిణదిశకు యూ హనుమదాదులు బోయిరి.

— హనుమ జాంబవదాదులు దక్షిణదిశకు వెదకబోవుట

హనుమ జాంబవంత అంగదాదులు నిరువదికోట్లుగా దక్షిణమునకు మిక్కిలి ఉత్సాహపూరితులై యేగుచుండిరి. మనస్సులు స్థిరంబై రాముని కార్యదీక్షలో మానకుండా లీనములై, నవలీల దేశంబు లతిక్రమించుచూ వానరులు యేగుచుండ——

—: అంగదుడు, వజ్రదంష్ట్రిని హతమార్చుట :—

అనివార్యబలాఢ్యుండైన వజ్రదాంష్ట్రుడను దానవుం డొకడు ప్రళయాంతకుడువలె తారసిల్లెను. ఇంతటి భయం కరుండు భూమియందెన్నడూ పుట్టియుండడు. వీడత్యంతబలా ఢ్యుడు. ఇతడు, నరాంతకుడో యమరాంతకుడో కల్పాంత కుడో చరాచరకులాంతకుడో యని వానరులు భీతిల్లుచుండ యాదైత్యుడు వానరులచెంతకు వచ్చుచూ నుండెను. భళిరా నీవెవ్వడవురా రాక్షసా నీబాహుబలంబుచే నల్పులగారించిన మెత్తురా? చాలురా! నీదుర్వారదోర్బలమునుజూప వచ్చినాడ వటరా రా రమ్ము. బాహాబాహియుద్ధమున నాయులవేపా టిదో నీకుజూపెదనని యంగదుండు యహంకారమునుజూపి యెదురురావచ్చు రాక్షసు నీసడించి తలపడి దానవునిపై కొనగా నిర్వురకు పోరు పరిఢవిల్లెను. ఘొల్లుమని వాన రులు బొబ్బలిడ వేల్పులుమనంబు నుల్లసిల్ల మెచ్చుకొని వా యునందనుండు హెచ్చరింప మల్లయుద్ధము కడుంగడు మల్ల డించెను. స్వాంతంబున శ్రీరామమూర్తిని స్మరించి తనతండ్రి ప్రఖ్యాతి మదిదలంచి తనయంగమునుబెంచి యంగదుండు రాక్షసుని నేలకుంగూల్చి యవలీలను వానింజీల్చెను. జాంబ వంతుడు హనుమంతుడు మెచ్చుకొనగా వానరులు కెవ్వున యరచి పరిస్తుతించి జయజయ రామచంద్రాయని చప్పుక రించిరి. పిదప నచ్చోటువిడచి మహావేగంబున ఘోరదుర్గమ పథములను తిరిగిజూచుచూ నలుపటు [illegible]

గనిరీతిగా వెదలుచుండిరి. సాహసోపేతముగా దట్టమైనయర
ణ్యముల సంచరించి ఉత్సాహముతో నగాగ్రములను దిలకించి
గుహాళులంజొచ్చి హా శ్రీహరీ యనుచు సీతామతల్లికై చిం
తించి తాపముచే భ్రమించి జలాశయముల బరికించిరి. జనక
జాన్వేషణముచాలించి జలముకొరకు వెదకజొచ్చిరి. విపినము
లం దుదకుబుడిసెడునీరైన దొరకనందున వానరశూరు లంతా
సొమ్మసిల్లిరి. అమితధీమంతుడగు హనుమంతుడపుడు అవని
ధరంబొండునెక్కి అన్ని దిశల పరికించి ఒకగుహానుండి జల
ప్రవాహము వెలువడుటజూచి యచటికి వెడలెను. రాముని
కృపచేతను సలిలము లభించెనంచు బ్రీతికితిగుని సంపదం
గను వేదభంగి హనుమంతుడు లోనికిజొచ్చి యంతటను
వెదకి సరోవరంబొకటిగని మార్గమువెదకి యాపదగడచె
యనుచూ వానరచయంబును వెంటనే గొనివచ్చెను.

త్వరపడి వానరులు హనుమంతునిగూడి శైలబిలంబులో
జొచ్చి అందుండు సరస్సున స్నానమాడి దాహములుతీర్చు
కొని సుందరంబైన ఫలపుష్పతరులంగని నేదదీర్చుకొని తత్పరి
సరవృక్షవాటికలయందు దారుచు గేరుచు ఆటలాడుచూ సం
చరించి ఫలవృక్షములకొల్లలాడి సుమంబులగోసి పోగులు
పోగులుగా జేయుచూ గేళ్లుదాటి ఉల్లాసముతో జనుచూ—

— వానరులు గిరిబిలంబులో స్వయంప్రభనుగనుట —

ఒకచ్చోడ దవ్వున స్వయంప్రభయనెడి యోగిని జూచిరి.
అంత జాంబవంతుడు హనుమంతుని తోడ్కొని యోగిని

దర్శించి నమస్కరించి శ్రీరాముని యుదంతమంతయూ చెప్పి సీతాన్వేషణని గూర్చి యడిగినంత యూపె చిరునవ్వుతో నిట్లు పలికెను. ఓ వానర శ్రేష్ఠులారా! రామభద్రుని పాదసేవనిరతులారా! నాజ్ఞానయోగతపంబులు సార్థకమై విరించనుండానతి యిచ్చినట్లు శుభావహమై నేడు ఫలించెను. నేను యూరామ చంద్రుడున్న చోటున కిప్పుడేయేగి దర్శించెదనని చెప్పి నేను గంధర్వునికుమార్తెను హేమయనెడి యప్సరస నామసఖి. అమరనాథుండామెను యపహరించెను. ఆవిరక్తిచే చాలా కాలమయి యిందు తపస్సానర్చుచుంటిని. నాతపంబునకు ఆనలువమెచ్చి కరుణచే నన్ను వరంబు కోరుకొమ్మనగా నేను దైవమును చూపింపుమంటిని, చతురాస్యుండించుకనవ్వి యిట్లనెను. అర్కవంశాబ్ధిసోముండై పరంధాముడు, రాముండను పేరుతో, అవనిపైని అవతరించబోవుచున్నాడు. ఆవృత్తాంతమంతయూ వానరులువచ్చి నీకెరిగింతురుగాన అందాక నీవిచ్చటనేయుండుమనెను. ఓవానరవీరులారా! తదాదిగా కొండంతయాశబెట్టుకొని, యిచ్చట వేచికొనియుంటిని. ఇప్పుడు శ్రీరాముని దర్శింప వెడలుదానను.

స్వయంప్రభ వానరులకు జానకిని చూడగలరని
—; ఆశీర్వదించుట :—

మీకార్య మెట్టిశంకయూ లేక యీడేరగలదనెను. మీరంతా సముద్రతీరంబునకు యాలశింపక పొండు. ఓవానరవర్యులారా! శీఘ్రముగా జానకీదేవిని జూడగలరనెను.

అనిన వారెల్లరూ సంతసించి, అంబుధింజేరబోయిరి. ఆవనిత రామచంద్రుని పదపద్మంబుల సంస్మరించుచునూ, జని రఘు రామునిగని చాగిలి మ్రొక్కి నుతించినంత ఆయనఘుడు సంత సించి అపు డాత డిట్లనెను. పిమ్మట ఆమెను యాదరించుచు, బదరికాశ్రమము యెంతో పావనంబైనది. ఓస్వయంప్రభా! కన్యామతల్లీ! నీయుల్లమలర నచట నివసించి యధ్యాత్మమభ్య శించి మోక్షమందెదవు గనుక అచట కరుగుమమ్మా యని రాముడనెను. ఆపె ధన్యాత్మురాలనంచూ అభినుతించి రామా! రఘురామా! తారకనామా యనుచూ ఆవెంటనే స్వయంప్రభ బదరికాశ్రమమున జేరెను.

అంత అంగదుడు గడువుదాటకుండ ప్రభుకార్య మొన ర్పగ, నాల్గుదిక్కులను గల అడవులను పర్వతములను గుహాగహ నంబులంజొచ్చి బడలితిగాని సీత యెందునూ కానరాదు. మాటదక్కనిచో సముద్రములో పడి చావవలెను గాని, పెక్కుమాట లేల? ఇప్పుడు ఇనసుతుండిచ్చిన గడువునమీా పించెను. మృత్యువాసన్నమగుచున్నది. మనలను వానర నాథుండు వధించును. సీత యేడనున్నదో తెలియదు. ఓయంగదా, మనకింక దిక్కులేదా యని ఇట్లు పరిపరివిధాల వానరులేడ్వగా అంగదుడు కంటతడిబెట్టి నాజనకుని చంపించి నట్టి సుగ్రీవుడు యీానెపంబున నన్ను చంపకయుండునా?

'జాంబవంతుడు వానరవీరులను విచారింపకుడు'

—; అని ఓదార్చుట ;—

అంత జాంబవంతుండు యిట్లు పలికెను. ఓవానరులారా! పౌరుషము బాయక దైవమును నమ్మి హనుమంతుండుండగా మన కేమిహానియని మానవాకృతినొందిన రాముండు రమాధవుడంచు దలపక మీమానసములు చలించెను. అనుమానముచేతను, భీతిచేతను, ఓర్పుజెందుడు! సగుణనిర్గుణబ్రహ్మమై సంభవించి రామచంద్రుడు కార్యభారము వహించును. కార్యపర్యవసానసంకల్పముడిగి విచారింపక సంచరింపుడు. గోవులను భూదేవతలను దేవతలను ఉద్ధరింపంగ, శ్రీరాముడుద్భవించెను. తలపగా మనము నిమిత్తమాత్రులము, ఆపరాత్పరుని కార్యము వ్యర్థమగునా? దిగులు విడనాడి, ధైర్యముపహించి, కార్యములజేసిన యాతని కరుణవలన కార్యమీడేరును. కాల మనుకూలమయిననాడు శ్రీరామచంద్రుని పాదసేవ, వమ్మగునా? అని జాంబవంతుడెంతో అనుకూల గతిని వచింప విని—

—; సంపాతి వానరులం గనుట ;—

కడు కనకనలాడుచూ ఒక విహంగం బరుదెంచెను. ఆకలిచే తూలుచూ వానరుల మ్రింగదలంచి ఔరా! నాళీకభవుండు నేడు కొందర బలిష్ఠుల నాకు భోజనార్థమై నొసంగెగదాయని మనంబునపొంగుచూ వచ్చిన ఏకరణిని రఘూత్తముని యింతి గనుగొనవచ్చునంచు శోకంబుచే తడ

బడుచూ, శోషిలుచుండిన వానరసమూహమును ఆకలిపై మ్రింగవచ్చిన వానరులు ఖగాధిపునిజూచి గోరుచుట్టుచే రోకటిపోటటంచు మదినిరోసి భయంబుచే పర్విడి పోవు చుండగా అంత సంగదనెడబాప సంగదుండు వానరులంజూచి మీారు భయంబుదక్కి ఒక్కవిహంగంబునకే యిట్లు తల్ల డిల్లి వెడలిపోవచ్చునా, వానరవీరులారా, యని ఈతడు ఖగేం ద్రుడు మహానుభావుడు, రాక్షసులపాలిట యముడు, అతుల బలాఢ్యుడు ఆర్యవరుడు అచ్యుతుండైన రామునకు హితుండు జటాయువునకు సోదరుడు, అహీనచరిత్రుడు వాని గ్రహింపజాలక అనుమానముచే పారిపోవచ్చునా? యనెను. ఘనుండగు జటాయువు అల్పుండుగాడు వాడు జగన్నుత మోక్షపదంబుబొందెను. ఈతండు అతని సోదరుండు. మూర్ఖునివలె శ్రీరాముని కార్యమున కడ్డువచ్చునా? తప్పకుండా సహాయమే చేయగలడు. ఊరకనే సంశయించవద్దు. ఏమియూ నతనివలన ప్రమాదములేదు. నామాట నమ్మవలెనని జాంబ వంతుడూ అనిలసుతుడూ భయపడక రండనిన ఆఖగవిభుండీసం వాద మంతయూవిని "అభయు"మని పల్కి వెంటనే యిట్లని యెను. ఓవానరశ్రేష్ఠులారా, భీతిలవద్దు. మీారు వీరవరేణ్యులని వింటిని రాఘవునిభక్తుడను. నాపేరు సంపాతియందురు. మీాకు అనురక్తుడను, నావంటి రామభక్తుండైన యొకపక్షినిజూచి పారుదురా? దైత్యేతరులను నేను వధించను. మీారువచ్చిన కార్యము సాకల్యముగా వచింపుడనెను. నేను ఆకటికాకకు

తాళలేక మతిహీనుండనై ఖలుండనై అన్యులుగా నెంచి వధింప వచ్చినాను. శ్రీరాముని భక్తులగు కపిరాజుల మిత్రింగుమనా! అక్కటా! క్షుద్బాధచే తనువు చాలాకృశించగా వచ్చినాను. మన్నింపుడ నేను. రండు వానరులారా! శ్రీరామకార్యభార వహులారా! లోకైకవీరులారా! మనరామచంద్రుని సేవకుడను నేనున్నా గాన యతనిచరితంబు వర్ణించిన విందునః.

అతనిమాటలువిని జాంబవీరాదిప్రముఖులు యుదంత మంతయూ వినిపించగా తనసోదరుని "జటాయు" విక్రంబంత విని వినుతించి యేడ్చి గ్రక్కున నన్ను బార్థికింగొనిపొండు. పావనుండయిన నాసోదరునకు తిలోదకము లిత్తుననేను. అనిన వానరు లాతనిబట్టి అబ్ధిపొంతకు వెంటనే గొనిపోయిన స్నానముంజేసి సోదరుని సంస్మరించి బాష్పములతో దర్పణ మిచ్చి వానరులంజూచి శ్రీరాముని బ్రస్తుతించి జనకజను దలంచి, దనుజవిభుని శపించి అనుజుని తలంచి యాతని సాహసమునకుమెచ్చి తనచరితంబు యాపతంగవిభుడుచెప్పెను. ఓకారణజన్ములారా! భీమబలాఢ్యులారా, వీరవరేణ్యులార రిపుభీకరులారా! మహానుభావులారా! రణధీరులారా! రఘురామసేవకులారా!

-: సంపాతి తనజీవితచరిత్ర వానరులకు దెల్పుట ;

మానమాచార మొకించుక వినిపించెద నాలకింపు డనేను. మాయుదంత మద్భుతము,జటాయువు నేను సోదరులము మూయువనింబుట్టి శూరులమసి బిరుదుల పొందితిమి. దైత్య

ల్లెరూ మముగాంచి తల్లడిల్లుచుండిరి. బాల్యమున మేమె రుంగక పంతముచే సూర్యుని కబళింపనెంచి చెలగితిమి. ఇనుని వేడిమికి అడలి సహింపజాలక మా జటాయువు వడిగామగిడి వచ్చెను. నేను సాహసముచే ఇంచుకైనా జంకక మీదికెగసి సూర్యుని వేడిమిని సహింపగా నా రెక్కలు కాలిపోవ పంతము నన్నగిల్లి గుబాలున గూలిపోతిని. పర్వతమందుగల ముని వర్యులు నన్నుగాంచి యప్పుడు తల్లడమందిరి. అంత చంద్రముంగను వారు నా చెంతికువచ్చి ఉపచారములొనర్చి బాధవారించి తత్త్వముపదేశించి భయమువలదని ననుజూచి యిట్లనియెను. ఓ ఖగకులోత్తంసా, త్రేతాయుగంబున పర బ్రహ్మంబు అవని రాముడై యవతరించును. అతనిభార్యను రావణుండపహరించును. ఆమెను వెదకగా వానరులు వత్తురు. వారలజూచి నీవు పావనుండగుదువు. అవనిసుతగూర్చి అపుడు యెరిగించగా అద్భుతంబుగా నీకు బక్షంబు లుద్భ వించును. అంతదనుకా స్వాంతమున రాముని భజింపుచుండు మనెను. ఆతని వాక్యంబులువిని నాయంతరాత్మ రేకెత్తి శ్రీరాముని జపించుకొనుచూ ఓ భక్తవరులారా, మీరాకకై నిరీక్షించుచుంటిననెను. వినుడు వానరులారా! సువర్ణుం డను నాపుత్రుడు ఒకరోజున నే నాకలితో స్రుక్కియుండగా నాభోజనముకొరకు వనమృగంబులగొని విలంబముగావచ్చెను. వాడొచ్చునరికి భాస్కరుడపరాబ్ధిగ్రుంకుచుండగా నేమదయను దొరగి శపింపనెంచి నంత వాడు భయపడి, యిట్లని పలికెను.

ఓజనకా! నాపలుకులు అనృతములనక వినుము నీయా నతిని తలదాల్చి నేను వేగముగా వనమృగంబులు తెచ్చుచుండగా తోోవలో పురుషవయండొకడు కనబడెను, వానికి యిరువదిచేతులు మేపైన శరీరము శిరస్సులపంక్తికలిగి రాచ కీవితో నొకతరుణిని మరునితల్లినిబోలు త్రిలోకసుందరిని, రథమునందు ఉంచుకొని అంబరవీధిని వచ్చుచుండగా తొలుత మృగంబనుకొని దలంచి, వానినొడిశిపట్టితిని వాడొడిగి బెదరి ఒడుపుతప్పించుకొని నన్ను విడువుమనుచూ కలువుగోలుతనంబున తెలుపుకొనుచూ తేరు దక్షిణదిశకు పట్టి నేనుచూచుచుండగా ఆశూరుండు వెడలెను. అందుచే నింతయాలస్యమాయెను యని వేడుకొనజొచ్చెను. అంతటి వాడు వేడుకొనెనంచు దలంచి వానిని నాపొంతకు తేక పో విడిచితిని. అనగా అక్కటా! పొక్కితిని. నారెక్కలూడె నంచెంతయూ నేడ్చుచుంటిని. సుతుని సహింపకతిట్టితిని, ఏమిచేతును. ఒక్కింత యవకాశము లేక యసురేంద్రుని విడచితిని. నేను దౌర్భాగ్యుండనై, యవనిపుత్రిని బోోవలేక పోతిని. యని పొక్కిపొక్కి మునివరేణ్యుని వాక్యంబులు జ్ఞప్తికి తెచ్చుకొని, మీకొరకు కాచుకొని యున్నాననెను.

—; సంపాతి లంకనుగూర్చి వానరులకు చెల్పుట ;—

వినుడు పయోధిమధ్యమున వేల్పులకైనా జొరరానిదై దేవేంద్రునికి పక్కబల్లెమై శాత్రవుల కకాలమృత్యువై కనులకుపండువై సొగసుగా, త్రికూటాద్రిపైని, లంకబలదర్పిత

దానవసాహసాంకమై, సకలవిలాసములతో నన్నుతికెక్కి ధరి త్రికి మకుటంబువలె నున్నలంక తలపోయగా, ముజ్జగంబు లందిట్టిదింకొకటి దహింపజాలదు చిత్రికళలయందు ప్రావీ ణ్యులు దెల్పగా వింటిని. మానవుల వధించి పరభామల వరించి దేవతాస్థానము లాక్రమించి సర్వుల సంపదలెల్ల హరించి, దిట్టరులౌ దానవులుగొల్వ, కొలువైనరావణుండు లంకా నగరంబున మెలంగు గాలియు, గీలియు సేవలొనర్పగా అట్టి యకలంక, లంకలో సతమూ చూడ సొంపైన—

లంకలో అశోకవనమందు సీతను కనుగొనుడని

—♦ సంపాతి చెప్పుట ♦—

అశోకవనమునకు పొందు, అచ్చోట భూపుత్రిని పరికిం పుడు. అచటనామె, నిస్సందేహముగా నుండునుగనుక మీలో మతిమంతుని బలవంతుని వెదకి మీసేనలో నట్టి వీరుడు గలడేని అమరులు పొగడునట్లు శతయోజనములు వారిధి దాటునట్లు చూడుడు. ఎవ్వండు పయోధిదాటి అసు రేంద్రపురంబుజొచ్చి భయమువీడి వనమునందు సీతంబరి కించి యుదంతమెరింగి రాక్షసప్రవరు లెదిర్చిన, తనబలిమి నొకింతుక చూపి, వచ్చువాడు, రామకృపకు పాత్రుండై చిరంజీవియై యవనియందుండును. రామచంద్రుని నామమం త్రమునుజపించి, పారము గానరాని సంసారజలధిదాటి, యెట్టిపామరుండైనా, ధన్యుడగును. ఇట్టివారధి లంఘించుటనగా నెంత అతులలాఘవము గల, యలఘుదేవ్వడో ఓమిత్రులారా! మీలోమీరే నిర్ణయించుకొని యెవ్వ

రలాగు లంఘించి తిరిగివత్తురో, వానికి నావందనములు అర్పింతును.

ఓ వానరప్రవరులారా! కనుక శ్రీరామచంద్రుని కరుణవలన నాకు పక్షములు వచ్చినవి. రామకార్యమును సాధించిరండు వేగమేయనుచూ సంపాతిమీది కెగిరి చనియెను. నూత్నపక్షములతో శరవేగముగా సంపాతి యేగుచుండగా భళిరాయనుచూ వానరానీక మన్యోన్యఅవలోకముతో దరహాసములుచేయుచూ నిలిచి సముద్రమువైపు విలోకించుచూ వారివారిబలంబుల విషయమై పరిశీలింపజొచ్చిరి. అలతిగా నూరుయోజనములు అంబుధిదాటుటసరే, తిరిగి రావీలుండవలెనుగదా, కార్యము వ్యర్థమానేమోయనుచూ వాలిసుతుండు మౌనివ్రపశి నిలచెను. జాంబవంతుడు బలిముఖుడు మొదలుగాగల వానరప్రముఖులు వారివారి బాహుబలంబులు లోదలంచుకొనుచూ ఓజాంబవంతా! నీవు గడుసరివి. పెద్దకాలము గడపినవాడవు. నీవు మాకెల్లమేటివి. గనుపున్న నీవూరకుందువా? నీకు తెలియని దేమున్నదనిరి. అనిన అంగదుని పల్కులువిని వానరులజూచి జాంబవంతుడు ఓఅలఘుబలులారా! నాకు వార్ధక్యమాయెను. మనకార్య మెట్లగునో యోచించి చెప్పుమనెను. నేనమోఘబలవంతుడనని పూర్వము ఖ్యాతిగాంచితిని. కలకాలము యౌవ్వనముండునా? ఆగర్వము నాకు చెల్లిపోయెను. నాయవ్వనమందు మహోత్సుకతను నేజరియించునాడు, నన్నోర్వగజాలు బల్లిముని నొక్కని

నైనా యెచ్చటనూ, గాననైతిని. వినుడు, నాయౌవన మందు విష్ణువు త్రివిక్రముడై వెలసెను, భువిని బలినణం చిన వామనమూర్తి పాదములనుగాంచి, వలగొని వచ్చినాను గడియలోన యనెను. ఇట్టివార్థక్యమందైనా విడువక వార్ధి నవలీల, లంఘించి వచ్చియుందును కాని బదరికాశ్రమ వాసకారణమున కాలువడిదప్పి మడుమును గోలుపోతిని. బదరికాశ్రమమందొకనాడు ఫలములందిని, పండుకొనియుండ నంతనొకరాక్షసుడువచ్చి నొకమునివర్యుని వధింపనవుకట్టెను. నిత్యమూ జపించునట్టియూ భక్తపరుండైనట్టియూ బ్రాహ్మ ణునిబట్టి భక్షించనున్న యాయసురునిట్టి శిక్షింపనరిగినాను. మాయిద్దరికీ పెద్దపోరు సంభవించెను. ధరణీవణకునంత అసురుండు యాగ్రహించి, మూడుయోజనములున్న భూధ రముబట్టితెచ్చి, దానితో నన్నుకొట్టగా దానిని నాకాలుతో నెట్టితిని. ఆకారణమున మడుమును గోల్పోతిని. వెంటనే వానిమెడబట్టి విరగగొట్టి నేలకుకూల్చి, చీల్చివేస్తిని. మును లంతా నన్నుజూచి సన్నుతించిరి. అట్టిప్రతాపము నాకు మరల అబ్బునా? ఒక్కయూకున తొంబదియోజనము లివ్వా డైనా, దాటగలను. కాని అందువలన లాభమేమి? అం దుచే దండిమగడెవ్వడాయని వార్ధిదాటగలవానివిషయమై యేమియుదోచక అరయుచుంటిననెను. ఆమాటలువిని వాన రోత్తములదరి, సాయంబుకొరకు అంగదునిజూచి ఉపాయ మడుగ వాయునందనుడు యేమియూ యెరుగనివానివలె

నేత్రములుమోడ్చి రాముని ధ్యానించుచుండెను. వికటుండు వానరవీరులంజూచి ముప్పదియామడలుదాటి వత్తుననియెను. నీలుడు నలుబదిన ల్గామడలు, దాటగలననియెను. దుర్ధరుండేబదితొమ్మిదియామడలు దాటెదనని వచించెను. నలుడు డెబ్బదియోజనములు లంఘించగలననెను. దధిముఖుండు లేచి, యెనుబదియోజనముల దాటెదననియెను. కాని తిరిగి రాజాలనని సందేహము కలదనెను. మిగిలినవానరులు సిగ్గున మిన్నకుండిరి. అంత అంగదుడు యించుక యంగలార్చి, పరివరివిధాల పరితపించి అల్లకల్లోలముగనున్న అబ్ధినిజూచి యెల్లవానరులజూచి యిట్లనియెను. ఒక్కడుముకున, నేను నూరుయోజనములను దాటెదనుగాని అచ్చోట చైత్యాలతో పోరాడవలసివచ్చెనేని, దోర్బలము, నాకు చాలునో చాలదో యని సంశయిస్తున్నాను అనిన యంగదునిగని తలయూచి భటులూ సేవకులూ యుండగా యువరాజు ముందుగా వైరి పురికి వెడలిన హానిసంభవించును అనుచూ జాంబవంతుడు ఆంజనేయునివైపుజూచి రాజధర్మానుసరణి యువరాజును తొలుత వైరుల స్థలంబుకంపవగదు. అచటికింజని యేతెంచు నఘుడెవడో వ్యవధిలేదుగనుక ఓహనుమంతా యోచించి, చెప్పుమా యనెను. ఈయవస్థను గమనింపలేదా? రాము కార్యమును మరచితివా? తగుమార్గంమెరింగియూ, యేమి యెరుగనట్లు, మూఅరిమురి జూచుచుంటివా? మహాబలనందనా నీబలంబు నీవెరుగవు. ఈజలధి యెంతటిదైనా నీకొకలెక్కా!

వాయుతనయుడవు వాయువంటి బల్లిమండవు బ్రహ్మచారివి పావనుడవు ఘనుండవీవు. నీవులంఘింప సమకట్టిన యీపయోధి నీవేగమునకు ఒకకాల్వతో సమానము. నీవు తెంపరివి. వాయువేగమున జొరబారగజాలుదువు, నీవు సాధింపజాలని కార్యము లోకమున గాన్పింపదు. మాయందని యవస్థను గమనించి కూర్మితో మమ్ము రక్షింపుము, వేల్పులుసహితమూ సంతసించురీతి ఉపాయమొండు చెప్పుము. నీవు వెరవరివా? కావు. వేళనుబట్టి మెలంగగల ధీవరుండవు. లంకంగల రక్కసులందరి నొక్కతోకనుగట్టి గిరగిర ద్రిప్పి, కొట్టగల కేసరివి; ఆపదబాపకుండ యీవిధమున మౌనమున వహించితివి సమీరనందనా! కారణమేమి యనుచు, ఓవీర వానరులారా! వినుడు. సమీరనందనుడు అతిపవిత్రచరితుండు సావధానముగా వాని విషయమై చెప్పెద నించుక వినుడు. ఈఘనున కసాధ్యకార్య మీజగమున లేదనవచ్చును. మును లీతని జన్మవృత్తాంతంబు సర్వజనసమ్మతంబందురు. హిమవంతపర్వతమున కశ్యపుండను ఋషివర్యుడొకడు ఉత్తమ తపస్సంపన్నుడొకడు మమకారమునుజంపి తనయాశ్రమం దుండును. ఆతనియాశ్రమమున శిష్యబృందంబుగలరు. అంత నొకదినంబున వనగజంబొకటి మదించి నాయాశ్రమము అల్లకల్లోలమొనర్చెను. అచట హనుమంతునితండ్రి సాటిలేని పరాక్రమశాలి సంతతమూ తపస్సుగావించుకొనుచు కేసరి యను నామముతో క్షితియందు కీర్తిగాంచెను. కేసరియను

నామము అతనికే సరి. ఆతండు విప్రనుజితకేసరి [illegible] రా
క్షసరి సురనుతవానరకేసరి రక్షఃకులకేసరి [illegible] నా
వచించెను. అక్కటా! ఐరావతమునుబోలు [illegible] దప్పి
విచ్చలవిడిగా పెచ్చుపెరిగి బాధించుచున్నది. [illegible] రక్షిం
పుమా యనుచు మానివరులు యాతని వివిధగతుల వేడుకొన
జొచ్చిరి. అప్పుడా కేసరి తనపేరు సార్థకంబగునటుల [illegible] సత్త
ములారా! నన్ను నుతింపపనిలేదు. ఒకింత తాల్మిబూను
డనుచు, భుజదర్పమున యామత్తశుండాలమును ముష్టిచే
భువినిగూల్చి కుంభమును కేలను జీల్చిచంపెను. అంత మును
లతనిచెంతకువచ్చి వరంబులిచ్చెదమనిన కేసరి కేల్మోడ్చి
కొంతయోచించి యిట్లనియెను. మీరు భగవత్స్వరూపులు
నన్నుమెచ్చి వరంబులిత్తురా యని లోకపావనుండైతని,
అనిలునకు దుల్యుండైన యతులబలుడు నాకుమారుండై జన్మిం
చిన సంతసింతుననెను. పిమ్మటామునులెల్లరూ తథాస్తని
యచ్చోటువాసిరి. తదుపరి ఒకనాడు కేసరియొక్క పవిత్ర
కులాంగన సచ్చరిత్ర అంజన యనెడి కంజనేత్రి కడుచక్కనిచుక్క
యని లోకమందు నుతిగొన్న యింతి పూదోటలా నొంటిమై
మెలంగుచునుండెను. బంగారముపసమించిన సింగారముగ్రాల
శీతాంశుగతి నున్న మోమును రంగారజూచి గంధవహుండు
(వాయువు) గోరివచ్చెను. ప్రకృతిసంపదచూచి పంకజాక్షి
నిండుమనస్సుతో ఒకసిలపైని పండుకొనెను. కమ్మని పూబావి
గడలుకొనగా అనిలుండు ఆమెను వీక్షించి మోహించెను.

అనిలుండు చేరవచ్చి కుసుమాంగిసొగసునుగాంచి కామియై తనుదా అాకారంబయి తరుణింజేరి మెల్లగా కౌగలించిన ఆవసరు హానన త్రుళ్ళిపడి వాయువునుగాంచి శపింపనున్న గమనించి నాతో [illegible]ను. ఓవెలదీ, కోపించి నన్ను శపింపవలదు, జరిగినయుదంత మెరుగవు ఓసన్నుతాంగీ! నీమగడు నన్నుబోలిన నిరుపమానబలశాలియగు సుతుండు కావలెనని యాబ్రాహ్మణ ఋష్యాదులకోరగా అట్లేయగుగాకయని యాబ్రాహ్మణవరేణ్యు లనగా అనంతంబున నిన్ను తాకితిని. నీకు గర్భము ఫలించును.

—; వాయునందనుని జన్మవృత్తాంతము ;—

వాయునందనుడను సుపుత్రుడావిర్భవించును. వాడు జగత్ప్రఖ్యాతిజెందును. ఓ పూబోణీ! మునులవాక్కులు అమోఘములు. అట్లే నావీర్యమమోఘము. ఓ అనుపమాంగీ! అజునిసంకల్పము బలీయము అనుచు నాశీర్వదించి ఆవాయు దేవుండు చనెను. అంజన నయన విజితఖంజన సంతతముని జనహృత్ప్రీతి నిజ్ఞానాంజన పతిపజ్ఞకు జనిన యతడాపెనరణిం గని బుట్టనిమెను. తొందరపాటుతో కండ్లెర్రబారగా డెందము ఝల్లుఝల్లన పదపంకజములు తడబడ కుందనబాష్పములు కనుకొలకుల జారగా నేనడంచితిని. ప్రమాదము లేదు కదా! చెప్పవే. అనిన విని చేలకన్నులనద్దుకొని ఆజలరు హాక్షి జరిగినయుదంతమంతా, మగనితో జెప్పెను. ఆతడు భార్యనుజూచి ఓసుందరవదనా! మనకోర్కె ఈడేరెను గనుక కుందకుమనెను. అనుచు నోదార్చి మేలని యనుమతించి

కౌగిటంజేర్చి, ముద్దాడి కనులదుడిచినంత సుస్వాంతంబున యా కాంత విచారముమాని, సంశయముబాసి, యెంత యోసంత సించెను. అంత నొకనాడు శుభలగ్నమందు నాపె గర్భంబున నొకకుమారు డావిర్భవించెను. ఆతడు దినదినాభివర్ధమానుండై శుక్లపక్షశశాంకుని శోభమీరి, తేజంబున వర్ధిల్లెను. ఆతడే యీతడు; ఈరీతి ఖ్యాతిగాంచెను. బాల్యమందీతడు బాలభానుమండలముగాంచి, ఫలంబని భ్రమజెంది, మ్రింగనెంచి, నొక్కుమ్మడి నింగికెగరెను. అంత నమరేంద్రుడు యలిగి తనవజ్రాయుధముచే గొట్టగా నితడు మూర్ఛిల్లెను. వాయుదేవునికి కోపమువచ్చి వాయువులను బంధించివేయగా ఆకులైనా అల్లాడక స్తంభించిపోయెను. ఉర్వికవసానకాలమాసన్నమైనదాయని, అఖిలజీవులు, యెల్లడలా వ్యాకులము జెందగా దేవతలేతెంచి, యనిలునిజూచి చేతులనుమోడ్చి హన్మంతు నాశీర్వదించి, న్యాయమా వాయుదేవా, ఓమహానుభావా! నీవు కోపించినచో సృష్టియెట్లుండగలదు? అఖిలవరంబులిచ్చి వానికాపాడెదము. ఆగ్రహాముపీడి, జీవులనెల్ల కాపాడుమని ప్రార్థించిరి.

అనినవిని దుఃఖమించుక తగ్గించుకొని తనసుతునిచూచి ఆదేవతలనుజూచి తల్లడిల్లెడు జీవసంతతులజూచి మిక్కిలి సంతోషముతో నిట్లనియెను. అమరత్వము, అజేయత్వము సమతత్వము సర్వశాస్త్రసంపూర్ణత్వము కరుణింపుడు నాకొమారుని దీవింపుడు మిమ్మువేడెదను. సంతతము సత్పథంబున సంచరించి సాధుసజ్జనసాంగత్యమలవరించి, సకలశాస్త్రా

స్త్రముల తృణీకరించి, నాకొమారు డీభువిని శోభిల్లుగాక, ఆదివిష్ణువు రాముడై యవతరించెను. ఆతనిభక్తుడై, అతుల విఖ్యాతిగాంచి, నాకుమారుడు శోభిల్లుగాక, భువిని ధన్యమతు లారా, సకల దిక్పాలులార, యనగా, అట్లేయగుగాక యనుచూ నయ్యమరులెల్ల, సంతసించుచూ స్వర్గమునకు వెడలిరి. పిదప నెల్లెడల విచ్చలవిడిగా నీవు సంచరించితివార, కేసరీపుత్రా, నాటినుండీ జీవసంతతి సంచలింప వాయుదేవుడు జగత్ప్రాణుడయ్యెను. పర్వతముల వనముల సర్వదిశల మిం చిన బలుండవై సంచరించితివి. బాల్యమున నీవు నైజచాపల్య మున మునుల యాశ్రమముల కొంటెతనము చూప వారెల్ల రూ, నీవు నీబలము మరచునట్లు శపించి రించుక యాగ్ర హించి అమరపతి నీహనువులంగొట్టినంత, నీవొనర్చి హను మంతుడనగ, భువిని ఖ్యాతిగాంచితివి, ఓలోకైకవీరా, అమిత బలవంతా, హనుమంతా! అరికృతాంతా, యనెను. అంత హనుమంతు డింతయూ నాలకించి, జానకిని దలచి, తనయాత్మ శక్తిగాంచి, రామునిస్మరించి, పవనుని బ్రస్తుతించి అసుర విభునిదలంచి యెంతయో నాగ్రహించి, మెరవడిని వాల మాడించి మేనుపెంచి, లంకదెసచూడ్కినిగుడించి; హుంక రించి జాంబవంతునకు మ్రొక్కి జంకుదక్కి యెల్లవానరులు వినునట్లు, యిట్లనియెను.

వాయుపుత్రుడు, లంకకువెళ్లి సీతనుగాంచి

—* వత్తునని శపథము బూనుట *—

రావణకుంభకర్ణ ముఖరాక్షసవీరుల యేపణంచి సీతా వనితాశిరోమణి యుదంతము సాంతముగా నెరింగి, సంభావన

బొంది, యిచ్చోటికి వచ్చెద జెచ్చెరయని రాకయున్న నేపా
వనికాను, రామునిభక్తుండను కాను, దేహమును త్యజింతు
ననెను. భళిరా, రాముడు నాదైవము, జగత్ప్రాణుడు,
నాదుతండ్రి వేల్పులచేనే నెల్లవరంబుల బడసితిని; లోకులు
ప్రశంసింప నీరనిధిని దాటజాలనేని మరెవ్వరికైనాశక్యమా!
నిలుడీ వానరులారా, ధృతితో నిశ్చింతతో, యిచ్చటనే
యుండుడు. భూగోళమును గదలించగలను ఆదిశేషుని
వెయ్యిశిరస్సులను విదళించగలను, లంకేశుని మండలించెదను
చరనుండి జనకపుత్రిని పావనగాత్రిని వదలించెదను. బ్రహ్మ
నీరంబులను త్రుంచగలను, ధరణిని జీల్చగలను లోకాళిని కాల్చ
గలను, సప్తసముద్రముల నెండింపగలను, సురలనేడ్పించగలను
కొండలను పిండిచేయగలను దనుజులను దండించగలను జానకీ
కాంతారత్నమును అచ్చట గానలేకున్న లంకనే పెల్లగించి
తెత్తును. దనుజులెదిర్చినా స్థాణువు శూలంబుబూనివచ్చినా,
వనజభవుండు సుపర్వులతో వచ్చి యడ్డినా, ఘనంబగు రామ
బాణమును దలంచి రావణుని యిల్లుజొచ్చి జనకజనుగాంచి
రామభద్రుని ముద్రికజూపించి మరలివచ్చెదను. ఓరీ!
రావణా! లోకమాతయగు నాయుర్వీసుతను దొంగవై యేరీ
తిని హరించితివిరా? ఈవార్ధిని దాటి లంకారాజ్యమెల్లు నరవాన
రులు చేరగలరని గర్వించి వంచించితివా? వీరులు మెచ్చ నన్ను
బేర్కొనుము. నీబీరం బెట్టిదో నేను చూచెదననెను. అని
లంకాపురు బెల్లగింతునని, వీరావేశముంబొంది, హుమ్మని
హుంకరించి మేనుపెంచి తృటిలో కొండంత ఉప్పొంగిన
హనుమంతునిగని—

—; జాంబవంతుడు హనుమంతుని మహిమను గొనియాడుట ;—

ప్రహ్లాదంబుతో జాంబవంతు డిట్లనియెను. ఓనా
యనా! ఆంజనేయా! రఘునాథుని భక్తుడవు. నీవెట్టికార్యమైనా
చేయగలవని యెరింగియే [illegible]లికితిని, నీమహిమ యమో
ఘము. ఈతోయధిని దాటి, బంధుజనదుఃఖమును బాపగ
నోపుదువు. ఓ వాయునందనా! అఖిలాశ్రితచందనా! నీవు
రామాయణానురాగప్రహ్లాదుడవు యనెను. నీమేనుపెంచి జగ
డమునకు [illegible]నని, ఆసంబంధసూర్యుడై విడంబనల విడనాడి,
నీపాదములపై నివాళి రావణుండు తప్పక జానకిని అప్పగిం
చును. గాన నీయంబుధిని శీఘ్రముగాదాటి మనుకులను యా
విపత్తునుండి తొలగింపజేయుము యనెను. అనిన జాంబవం
తుని యాదరించి కేసరిసుతుండు గర్జించి గంధివాటి యిచ్చోటు
న్నక్షేత్రములోన మరలివత్తుననెను. ఇంకాజంకెందుకు రాముని
భక్తున కెందేని హానికలుగదని నమ్ముడు. దైవబలమును
మించునా దైత్యబలము? జానకిని నిస్సంశయముగాజూచి వత్తు
ననెను. జలనిధినిదాటి సీతనుజూచి చయ్యనవత్తును. మీరు
సంశయింపవద్దు. రావణునిచేనిమి తనసిరంబులదన్ని ప్రజ్వాల
జ్వాలనునిగ్రహించి సమవర్తి మదంబణంచివత్తును. నాబలంబు
మీరెరుగజాలరు. నాకీజగత్తునం దసాధ్య మున్నదేలేదు—
అనిన జాంబవంతుడు అనిలాత్మజుని కౌగిటంజేర్చి ఇట్లని
యెను. జనకజను యెట్లయినా చూచి వచ్చినచాలు—
రాముండు యీవార్ధినిదాటి ఆదనుజుల సంహరించి తనతన్విని
గైకొని తన్నిబొందును. పావని కడు పావనుండని సువర్యులు
నిన్ను యెంతయో నుతింతురు; అనిశమూ రాముగాధ గాని

యాడినా, ఆడినా పాటపాడినా వినినా స్మరించినా ఇందు[?]నినతే పవిత్రుండై స్వర్గాధిసుఖంబులు బొందును. ఘోర సంసరణరోగబాధనుండి విముక్తుడగును. ఆపరమశివుండు రామ నామసుధనుద్రావిన మహానుభావుండు. ఆరుచి నాతండే బాగాయెరుగును.

అలఘుసు శ్రీరామచరణజలరుహామగబంబరుండు సాత్వి కుండగు భక్తవరేణ్యుడు శ్రీతులసీదాసుని కవిత్వమందుగల భావమొకింత వ్రాయగలిగితినో లేదో? హనుమత్పూజిత నామా వినమత్సుత్రామా! విబుధస్తోమా! ఇనకులాంబుధి సోమా! జననుత సుగుణాభిరామా! రఘురామా! యని ప్రార్థించి సనకసనందనాది మునిసేవితరామా! సజ్జనసన్నుత జీవనా! సర్వలోకపావనా! అఖిలపాపవిమోచనా! పద్మలోచనా యని నుతించి—

మ. వినమితదనుజేంద్రా! విస్ఫురత్కీర్తిసాంద్రా!
త్రియుననుతనామా! దేవతాసార్వభౌమా!
కుస్తృపతిమదభంగా! కోమలశ్యామలాంగా!
జనహితమతిమంతా! జానకీప్రాణకాంతా!

ఇది, శ్రీ తులసీదాసు రచించిన హిందీరామాయణమును
శ్రీ భాగవతుల నారసింహాశర్మ విరచిత శ్రీతులసీ
రామాయణ పద్యకావ్యమును ఆంధ్రవచనరూప
మున రచించిన టంకాల సాంబమూర్తిగారి
అనువాదము కిష్కింధాకాండము,
సంపూర్ణము.

# శ్రీతులసీరామాయణము

## సుందరకాండము.

(వచనము)

## 1. ప్రార్థనలు

శ్రీరామా! నృపసోమా!
శ్రీరామా! హృదయకామ! చిద్గుణధామా!
గౌరీపతి, నుతనామా,
శౌరీ, సుర, సార్వభౌమ! సంగరభీమా॥

కాంతును సంతతంబును, రమాకాంతుని, సమస్తశక్తిమ్రే కాంతుని, బ్రహ్మఫణీంద్ర సన్నుతగుణాక్రాంతుని వారిని జానకీకాంతుని వందితదేవకాంతుని, ధరణీకాంతామనఃకాంతుని, శాంతుని శాశ్వతుని అప్రమేయుని అనఘుని, శాంతిప్రదుని రాఘవుని కరుణాకరు జగదీశ్వరు సురగురు వేదాంతవేద్యు సుజనారాధ్యుని సరకిన్నరనుతమాయానరుని రఘువరుని సన్నుతింతు భక్తలోకావనరామా, నీవు అఖిలాంతరాత్ముండవు నాహృదయమున్యామెఱుంగక నీదు నామసంభావనమే ధ్యానించుచుండును. నిశ్చలభక్తి నాకొసంగి, నాకుగల కామ

భవపాపము, యెల్లప్పుడూ బాపుమని నిక్కువముగా ప్రార్థించు చున్నాను.

వ్రతనియమపవిత్రుండును స్వర్ణశైలగాత్రుండును దితిజవనకృశానుండును దేవతాపద్మభానుండును సుగుణవిధానుండును, దూతకార్యప్రగానుండును, శాంతుండును దాంతుండును యగుహనుమంతుని సతతమూ నుతింతును.

ఓవానరబిడౌజా, ఆశ్రితస్వర్గభూజా, తరణిసమతేజా, ధిక్కృతదైత్యరాజా, పావనముఖసరోజా! పవనతనూజా అమితబలవంతా, అగికృతాంతా హనుమంతా యనుచూ అవధరింపుముస్వామీ! నీస్వామికి అంకితముగా నీప్రతాపము గల సుందరకాండమును సత్కథాసుధాభాండమును, మానవ కోటివీనులకు విందుగా వ్రాయబూనితిని.

—: కేసరీపుత్రుండు సముద్రమును దాటుట :—

భక్తుండగు జాంబవంతుని వాక్యములను, అనిలపుత్రుండు మిక్కిలి శ్రద్ధతోవిని రమ్యగుణసాంద్రుడు రాజేంద్రుడు రామచంద్రుని నుతించి, కపులతో నిట్లనియెను. ఓ వానరవీరులారా! వినండి. రఘుపృథ్వీనాథుని తనివివోవభజించుచూ యిచ్చట ధైర్యముతో నిలువుడు. దనుజాధీశుని లంకకేగి సీతనుగాంచి శీఘ్రముగావత్తును. నాకు ఉత్సాహ మొదవు చున్నది. గనుక సెలవిండు యనుచూ నేనచటికేగి తిరిగి వచ్చుదనుక ఆకులలములు ఫలాదులారగించి భయమునువీడి ప్రాణముల నిల్పుకొనుడు. మనకార్య మీడేరినట్లేయని

నమ్ముము. క్రూరదానవవంశ కాంతారమునకు నేను పావకుండను; శ్రీరామసేవకుండను ఈవార్ధిలంఘించుటనగా నాకెంత? రామదూతకు చేతగాని కార్యముగలదా! అని పచించి శ్రీరాముని స్తుతించి తనయాత్మబలమెంచి తనతండ్రి ననిలుని దలంచి, మర్కటసైన్యమునుగాంచి నమస్కృతు లొనర్చి ఉదధిదిలకించి హుమ్మని హుంకరించి వార్ధితీరమందుగల సుందరపర్వతంబు తనజవంబును సైరింపగలదంచు ఆపవనసుతుడాపర్వతముపైకి లంఘించి మృగములు చెదరి పారిపోవురీతిని అధిష్టించెను. కందరములు శృంగాగ్రితకంధరములు సొంపు నింపగా అందరికీ మందరిగిరిగా దోచెడు సుందరగిరితో, వసుంధరవణకెను.

పర్వతముపై నిలచి సింహనాదముచేసి, అతిదీర్ఘముగ కాయంబుపెంచి సముద్రము పరికించి, అంతరిక్షముజూచి జానకీరాముని సంస్మరించి వాయుదేవుని దలంచి పవనంబు బంధించి, దీర్ఘబాహువులజాచి నేత్రమ్ముల నిగుడ్చి మొగంబు బిగించి తలయెత్తి పాదంబులుద్రొక్కి సర్వమృగములు ఖగములు సంచలింప సకలభుజంగములు బెగడ ముజ్జగంబులు బొగడ నగము నగముగా దెగగా ఆపవనసుతుడు కుప్పించెను. అవనిజం జూడవెడలిన యనిలపుత్రు డాత్మబంధువుగానెంచి అవనిజంబులు (పర్వతములు) అతనితోగూడ కొంతదవ్వరిగి తిరుగ జలధిపై వ్రాలెను. చెక్కుచెదరక నావాయుసుతుడు విష్ణుపదధ్యానుడై వెడలుచుండెను. విష్ణుపదమును బట్టిన

విబుధుండు అధఃపతనమెప్పుడైనా పొందడు. రామబాణము వలెనే యాతడు రివ్వుమని భూనభోంతరాళంబున బోవుచుండెను. అతనిని జయింపనెంచి త్రోవలో నెవరయినా అడ్డగింప జగతి నెంతటివారికైనా శక్యముకాదు. జానకీ విభుని విజయధ్వజంబువలెను యాతుధానులకు ధూమకేతువు వలెను కనబడునట్లు వాయుసుతుండు తనవాలమును మీదికెత్తి, నిశ్శంకతో లంకాన్ముఖుండై యేగుచూనుండెను. వాయు వేగమున వియత్పథముజొచ్చు వాయుపుత్రుని పొడవాటి వాలమునుగని రాహువో కేతువో యని భ్రాంతిజెంది చంద్ర సూర్యులు అదృశ్యమునుజూచి కలగిరి. విహంగమువలె చెలంగి రామకార్యాంతరంగుడై వెడలుచున్న హన్మంతుని సముద్రుండుజూచి ఆతనిక్రొక్కింత శ్రమదీర్చనమకట్టి భూమిభృత్కాంతునిజూచి నీకిదే శుభకాలంబనుచూ యీరీతిని బలికెను. నీవు యెరుంగుదువో లేదో కాని ఇంద్రాది దేవతల హితముగోరి ఆదినారాయణుండు శ్రీరాముండై అవతరించెను. ఆతని కార్యార్థమై అల్లదే అనిలసుతుడు వెడలుచున్నాడు. వానికి విశ్రమం బొసగుమనెను. ఓయి మైనాకమా, ఒక్కమాట చెప్పెదవినుము. దేవేంద్రుడు ఆగ్రహించి కుధరముల రెక్కలు నరుకువేళను అనిలదేవుండు నిన్ను కాపాడెనుగదా! ఇపుడా యనిలపుత్రుండు దేవకార్యార్థమై వెడలుచున్నాడు నీవు పైకిలేచి యాశ్రయంబిచ్చి ఆయాసముదీర్చ తోడ్పడిన అమరవిభుకృపకు నీవు యర్హుండగుదువు.

—: మైనాకము హనుమకు విశ్రమం బిచ్చుట :—

అనిన విని మేల్మేలని యబ్ధింబొగడి వింజమాటుల మైనాకధరము ఆకాశమంటులాగున పైకిలేచి హనుమంతుని జూచి యాదరమున నిట్లని యెను. ఓయనఘా! మహానుభావా! అమరావనా పావనా ధర్మజీవనా, అనిలతనూజా వానర బిడౌజా, నిజాశ్రితకల్పభూజా, దుర్జనయమరాజా నాశిఖర ముపైనించుక విశ్రమించి నాయాతిథ్యమంది, కరుణింపుము, నమస్కరించెదను. అనిన గిరిజశిఖరంబు తనకరంబున తాకి, నీదుమర్యాదకునేను నేడదేరినాడను. నేను నిల్వదగదింక, ఇందుగ్రినివలన భయములేదు, ఇట్లేయుండుమనెను. అనుచూ యతనికభయమొసగి హనుమ పయనంబు సాగించె నా క్షణంబె.

—♦ సురస హన్మంతుని భక్షించెదనని, అడ్డగించుట ♦—

అతనిబలమును పరికింప నమరులు సురసయనుదాని నంతోషముతో బంపిరి. భళిరా! నీవెవ్వడవురా! క్రొవ్విగ్రాతివి నేడు నాభాగ్యము పండెను. నీమాంసమును తనివిదీర మెస గెదను. దైవము నిన్నుజూపెను, గాన విడువక కబళించె దను. ఏతలంపునైనా మాని నిలువుము యీవేగమింకెందుల కనెను. అనుచూ తననోరుదెరచి నరసకేతెంచి సురసనుజూచి ఆపెకెదురుగానిలచి దేహముపెంచి చేతులనుమోడ్చి యిట్లు హనుమవచించెను. నీవెవ్వతెవమ్మా, పయంబడరాకు నమ స్కరింతును. నేనెవ్వడనో తెలుసుకొనుట కిదిసమయముకాదు,

తిరిగి వెంటనే వత్తును, అపుడు నన్ను తృప్తిదీర భుజింపుము, నేనిపుడు నిల్వగజాలను ఒకించుకైన నిల్వరింపకుము. ఇపుడు జానకిని బరికించి, యోగుడెంచి, నాస్వామి కెరుంగజేసి, నే వత్తునమ్మా, అపుడు నన్ను భుజింపుమమ్మా, నేనన్నృతమాడ నమ్మా, నేను బ్రహ్మచారిని రాముని భక్తుండననెను. అనిన విని యపహాసించి తలసంకించి, నీతాతలవంటి బల్లిదులనెల్ల భక్షించి బ్రబలినట్టి నన్నెరుగవా యని నాగమాత యిట్లని యెను. తియ్యనిపలుకులాడి ఓటక్కరీ, తప్పుకొనుచున్నావా నీవెందేగినా విడువను. నీకుత్తుకబట్టి నెమ్ముల నరియ్యలుజేసి, రుధిరము, మాంసము తృప్తిదీర నారగించి నోరూరగ గరుసిన దేవ్రిచ్చి యేగేదను. సురసా, ఆటోపము హెచ్చెనుగాని నావాక్యములు సరసాలాపములంచు నెంచితివా? అనిన సురస నాపంరంభమునుజూచి అయినా ఆవగింజంతయైనా భీతిజెందక పుయిర్యంబవార్యంబుగా నాసరసను నిల్చితివెంతవాడవో పరీక్ష జేసి భక్షించెదను అనెను. అనుచూ, తననోరు తెరచి, అంతరాళమంతా వ్యాపింపజేయుగా అపుడాగ్రహించి మింగ బోయిన సురస వదనమందు సమీరసుతుండు సూక్ష్మరూపుడై జొచ్చెను. అట్లు ప్రవేశించి ఆక్షణంబుననే వెలికి వెడలెంచి దేహంబు మరలపెంచి నిలచి అట్టహాసముచేయగా ఆశ్చర్యమొంది సురస హనుమంతో నిట్లనియెను. ఓహారివి భేయా, మహాకాయా! ఆంజనేయా అతులబలవంతా, మతి మంతా, శౌర్యవంతా, నీధీబలము దోర్బలము మెచ్చునకు

గంటిని మెచ్చుకొంటిననుచూ నేను నాగమాతను నాపేరు సురస, రామకార్యార్థమై దనుజపురికి పోవుచున్న నిన్ను పరీక్షింపుమని దేవతలు నన్ను పురెత్తెంచిరనెను.

—♦ సురస హనుమంతుని స్తుతించుట ♦—

ఓయనఘా! వాయుతనూజా, రాఘవుని కార్యంబు సాధించగల్గిన ధీమంతుడవౌదువు. లోకనుతహంవీరుండవు. నాకలోకమున నీబలసంపదనుగూర్చి బాహాటంబుగ జాటెదను. ఆ దనుజాధీశుని బలంబణప దక్షుండవే యనెను, ఓతల్లీ! నిన్ను నమస్కరించెదను, నేను ధన్యుడనైతిని నీతో మాటలాడుటలో స్థయిర్యంబు కలిగెను. విద్యుచ్ఛక్తివలెనేజని భూమి పుత్రినిగని చైత్యవాత్రిత దోస్సారంబు పొల్లుంజేసివత్తును. జాలముశాయక నను బోనిచ్చిన కార్యము జక్కజేతును అని కరంబులుమోడ్చి అనిలసుతుడు రాముని ధ్యానించి నాగమాతనువిడచి జానకిం దలచి వేల్పులలర వేగముగా పయనము సాగించెను.

—∗ సింహిక రామదూతను అడ్డగించుట వానిచే జచ్చుట ∗—

ఛాయనుబట్టి జీవుల నంహరించి భక్షించి యంబుధిని మెలగుచుండు సింహికయనెడు దనుజ మిక్కిలిబలశాలియై జయింపసలవికానిదై యుండెను. మాయామేయుండైనవాయు తనూజుని విక్రమముతో నారితేరిన మహాబాహుని విలోకించి యాహారము చిక్కెనని యాఛాయాగ్రాహిణి, సింహిక, తత్కాయచ్ఛాయనుబట్టి వెంటనే భక్షింప నాకర్షించెను.

భూమింగల యనేక అపూర్వబలాఢ్యుల మ్రింగినట్టి మాయా
విని సింహిక వాని దేహఛాయను సహింపలేక కండ్లుమోడ్చి
పొమ్మసిల్లెను. ఆపావని దానింజంపి సురలునుతింపగా వడిగా
వారధిదాటెను.

— పావని సముద్రమునుదాటి లంకం జేరుట —

దరికానరాని భవవార్ధిని తరించినయోగివలె యీ
సముద్రమును తనయనివార్యబలంబున హనుమంతుడుదాటి తత్తీ
రమునజేరి నల్దిక్కులా జూచుచుండగా దేవతలు తన్నుతి కైవా
రము చేయుచుండిరి. డంకానౌబత్తులతో శంకాతంకములు
లేక మహాహంకారముతో నెనగెడు లంకాపురిని మహాబల
సుతుండు, ఆంజనేయుడు గనెను. వారిధితీరమున గల దివ్యవన
ముల శోభనుగాంచి శృంగారలతలంజూచి మకరందముగ్రోలి
ఝుంకారముచేయు తుమ్మెదల పరికించి మృగంబులను శారికా
కీరవిహంగములను తిలకించి సమీరనందనుడంతట యతుల
ఫలపుష్పములతోనిండిన ధరణీరుహములగాంచి సంతసించి
భ్రమజెంది పవనతనయుండు ఆనందముంజెంది యించుక విశ్ర
మించెను. కనులమోడ్చి యనంతరకార్యమునుగూర్చి యో
చించి పొంతనున్న పర్వతంబెక్కి లంకయొక్క పొంకబింక
ములు వీక్షించెను. ఓనగరాట్తనయా! గౌరీ! ఘనమగు
రామభక్తిలేనిచో హనుమంతుని కింత మహిమయుండునాయని
మహాదేవుండనెను. శ్రీరామభక్తిచే నాతడు వారాసి దాట
గల్గెను. అట్లే రాముని గొల్చి యీసంసారాబ్ధిని దాటి

వాడైనా తరించగలడు. కాలునైనా భక్షించు మహాకా
లుడు, ఆరాముడు. తాను భోగకాంక్షగల భూపాలుండు
కాడు. ఓలోలేక్షణా! పార్వతీ! రాముడు ధర్మకర్మలోలుడు
గోపాలుడు పతితపావనుడు యని శంకరుండనెను.

పర్వతమునుండి దనుజులగర్వమును వారికండకావర
మును, సౌధశ్రేణులను, సర్వంబునూ, హనుమ జూచి యానం
దించెను. గోపురలక్ష్మిగెల్చి, గోపురకోటినిబొల్చి లక్ష్మికి
కాపురంబైనటుల యలకాపురంబునైభవములతో నొప్పు
శ్రీవినిగ్రహించి, లంకాపుర రాజ్యలక్ష్మి తనకాలికి వారిధియని
తలంచి దానిదృష్టికి తులలేనిదై తోచెను. నంతశమూ పురిని
బ్రోవ ఆయుధపాణులు సంచరించుచుండ తమసౌధములపై
నిలచి, యమరాంగనల బిలచి కారించుదైత్యశృంగారవనిత
లుండ రావణునియంగరక్షకులచే కాపాడబడెడు ప్రాకారము
లుండ అనిశంబూ గగనమునుండి పురలక్ష్మిమానంబు బ్రోచు
విమానములుండ భవ్యతరుల నాటపట్టగు ఉద్యానవనములుండ
సారసాన్వితసారకాసారములును, అక్కజముగా హనుమవీక్షిం
చెను. కుటజ కరవీర ఖర్జూర, కోవిదార, కర్ణికార, సప్తచ్ఛద
గంధపూర్ణ సరళ, ముచిళింద నీపాదిధరణిజముల సుమఫల
వితానసతములను యాతండు జూచెను. పవనధూతమస్తకము
లై పక్షులకాశ్రయములై, యెసగెడు నవనిజములను, హంస
బక చక్రకారండ, జలవిహంగ, వివిధజలాశయములను అఖిల
ఫలఉద్యానములనుజూచి పరవశుండై అతులరమ్యకనకగోపుర

ములతో విరాజిల్లు లంకాపురంబుగాంచి హనుమంతు డాశ్చర్య మొందెను.

రావణుడు అనిశమూ అన్యవనితాజనమానధనాపహారియై ప్రచార మొనర్చుచుండుటచే లంకానగరంబు గాచుటకు నియమించిన యుగ్రధన్వులనూ, దానవవీరులనూ కొండపై నుండి కపీంద్రుడుచూచెను. చల్లనికుసుమమకరందములు గోలు కైరవాంభోజయుత పరిఖావృతంబు నిరుపమదోస్సార నిర్జరరాక్షసనంరక్షితంబు, ఆకాశమునంటికొనియున్న హార్మ్యాగ్రంబులుగల ప్రాసాదములు మేఘములతాకుచున్న ప్రాకారములు, కేతన విరాజమాన, నికేతనంబు నమవాహనచలిత ఘంటాపథంబు,కనకమయగోపురంబులంకాపురంబు గాచిహనుమంతుడించుక శంకించెను.

- ఆంజనేయుడు, సీతనెట్లుగనుటో యని, యోచించుట -

ఈవారమం దెవడేని రహస్యముగ జరింపగలడా? ఆహా! జానకి యెచ్చటనున్నదో చూచుటెట్లు? నాయాపదదాటు టెట్లు? భయదానురకోటికి జిక్కి తల్లి యేమావుననున్నదో, యిప్పుడెట్లిరుంగనోవును ననుచూ బలిమిని వీరుల హతమార్చి సిరినంపాదించి పద్మాక్షుల మానంబులహరించి, పొంకముగా లంకారాజ్యమున జలధిప్రావృతదుర్గమధ్యమున తాను సౌఖ్యములబొందుచున్నాడు. భళిరా, రావణునివైభవము నుతింప బ్రహ్మకయినాతరమా? బలులు అత్యుగ్రులు కామరూపులు దివ్యధ్వంసవిద్యాంసులుడజ్జ్వల నానావిధ భీకరాపరులు,సంగ్రామ

సింహాలు దుర్ధర్షులు, నిర్దయులు సకల మాయోపాయులు ఇట్టిఖలులను దైత్యులను మోసపుచ్చి మెలంగుట యెట్లగునోకదా? ఆహవవిధానపారీణయాతుధానబాణసంధాన రక్షితాఖిలస్థానమైన యీగ్వీపాంతరమున నేనేగతి చరించు దును. కార్యమెట్లీడేరగలదు?

అక్కటా! యీపట్టణము, విషమంబు దుర్గమంబు రావణుండు పాలితంబై యున్నందున, దేవతలైనా జయింపశక్యము కానిది. రాముడేరీతినిచటకు రాగలడు? పౌరుషముచే వారిధి దాటిన దాటుగాక వానరులు యీపాకారమును ముట్టడించి దానవవీరులతోబోరి సాహసము దోర్బలము బుద్ధి బలము యేతీరునజూపుదురో యెట్లు రణ మొనర్తురోకదా? మనుజ గార్ధభ మహిష గోమాంసములను భక్షించి గరిడీల నారితేరి పేరుగాంచిన మల్లులీయసురవరులు వీరలనెదిర్చి వానరులు పోరగలరా? ఈరూపమున బోయిన నెగ్గుదురా? మరేరూపమునపోవుట మంచిదో? స్థూలరూపమువిడచి సూక్ష్మరూపము దాల్చి మశకంబురీతిని మసలవలెనో? ఎదిరించి లేని దైత్యులేపాటివీరులో చవిజూపి చవిజూచి చనుటే మేలు. జానకిని తిలకించ చౌర్యవృత్తిని నేనుచనుట శౌర్యమా? ప్రయోజనమా? రావణుడుశతులోకవిద్రావణుండట. కుంభకర్ణుడు సమరవిజృంభణుడట. ఇంద్రజిత్తు నిర్జితనిర్జరేశ్వరుడట. వీరందరిని జూడకుండా నేనువెడలదగునా? శాత్రవుండు విభీషణుడు సాధువు సత్వసంపన్నుడూ సుశాంతుడూ యనుచూ నావిభీషణుని వినుతింతును

అట్టివానిని దర్శించకుండ, నేనుజనగలనా? నిజవంశము ర్యాద నిలుప భానుడనుకూలుడై అపరాబ్ధినిగుంకెను. బారులు దీర్చి కలకలధ్వనులతో పక్షినికాయమరుగుదెంచెను. గిరి గుహాంతరములకు భీకరమృగచయంబు వెడలుచుండెను. కాను న్న ఘోరసంగ్రామసూచకముగా సంజకెంజాయదోచెను. రామచంద్రుడు రాక్షసరాజునుజంపి సింహాసనమున గూర్చుండునటుల చంద్రుండు పూర్వగిరిని కాంతినిచ్చుచూ చీకటి నణచెను. ఈపురిరహస్యముల నేనెరుంగ, చంద్రుడు తోడ్పడగవచ్చెను. నిక్కముగా నిశాచరస్నేహమున చంద్రుడు యీనిశాచరుల మాయగ్రహింపగలను. రఘుకులోత్తముని చిత్తము సంతసించునటుల యిదేతరుణమందు దనుజేంద్రుని పురంబున సంచరించి సదనములన్నీ వెదకి జానకిదేవియున్న స్థలంబుజూచి నాకెదురిచ్చిన దానవులకు నాబలంబించుక చూపి అభ్యుదయంబొందుదునని హనుమంతు డాక్షణముననే సూక్ష్మరూపుండై లంకలోజొచ్చి ధైర్యసాహసవీరదానవులను ఆయుధధారులను చూచెను.

### వాయునందనుడు లంకాపురిలోజొచ్చి లంఖిణితో — వాద మొనర్చుట —

తొలుత పురిసౌధములను తలయెత్తిజూచి రాక్షసుల వైభవంబునకు ప్రస్తుతించి, వీరలనెటుల జయింతునని భీతిజెంది ఆపవమానసుతుడు మాన్పడినిల్చెను. సామమున దుర్మార్గులు చక్కబడరు. దానమున ధనమదాంధులను జయిం

వగరాదు, ఏకమతులను భేదింపవీలుపడకు, దండిమగలాట దండింపదరముకాదు. అని పరిపరివిధంబుల దలంచి వీథులంబడి హనుమంతుడు వెదలుచుండ ఎవ్వడితండని లంకిని యేగుదెంచి, యాతనిపిలచి నిలువరించి యిట్లనియెను. నీవెవ్వడవోయి, రాక్షసులవద్ద లేశమైనా జంకక యివ్వీథిని సంచరించుచున్నావు. ఏమిపనిమీద వచ్చితివి. మైకొంటివిపలుకవేని గుండెపైని గుద్దెదను. బళువనల్ల గిరుక్కుమా చచ్చెదవు. నిక్కము వచింపుము సంతసించెదను. పరిచయమున్న చుట్టముపగిది పురముజొచ్చి శోధించునదికారెవలె, పురవహాన్యముల నెరుగుటకా? నిక్కముగా నీవెవ్వడవో చెప్పుము. దొంగవో, గూఢచారివో, దుర్జనుడవో, యక్షుడవో, రాక్షసుడవో మానవమును బూనెదవేని మానహాని ప్రాణహాని, నీకు ప్రాప్తమగును. లంకిని యందురునన్ను, కడులావును చేవను గలదానను యీలంకను కాచుదానను పురలక్ష్మి నాబలిమిని నిశ్శంకను గాలిలును నాశలవులేని దే వంకజగన్నుడైనా రాజాలడు. నీవెటులవచ్చితివిరా?

నేనీ పురద్వారం బెల్లవేళల గాచుకొనియుండెదను. ఈస్థితిలోనన్నుగానకుండ చావుచేకూరునని జంకకుండ దొంగవలె లోనజొచ్చితివి. నిన్ను మెచ్చితిని రాక్షసుని తలయెత్తవదేమి సిగ్గుచేతనా? నామాటలు ములుకులవలె నుండుటవల్లనా? శక్తిలేకనా? సురలకు మిత్రుడైన నన్నెరుగవా? శూరులు మెచ్చగల్గిన బల్లిదుండవైతే కరములు చాచి నిల్వుము. జగన్నుత

కీర్తి గడించవచ్చును. అనిన హనుమంతుడు అతివినయముజూపి, దరికేగి; కేలుమోడ్చి నీసమ్మతింబడయక నేనువచ్చుటెంతయు దోసమేయగునేమో యెరుగననెను. నిక్కము దాపనేల. రజనీ చరపురంబందు సొంపెక్కిన లక్ష్మియున్నదని విని నేనువచ్చి తిని. ఒకించుక చూచి ముదంబు జెందనుంటిని. నోయక్క క్షమించి పురవరాధీశుండు నీకేమగునో చెప్పుమాయనుచూ నిటునటుబరికించి యుపహాసించి, వెంగలివే ఓలంకినీయనుచూ వెక్కిరించి నీచేవ చూపించుమని దానిశిరమునువంచి ఆవీరాం జనేయుడు పిడుగుపడినట్లు గుద్దెను. ఆవీరదానవి పుడమిపై బడి గింజుకొని శరీరమందు స్మారకముడప్పి కడువడు రక్త మునుగ్రక్కి, లేచి వానరనాథునిజూచి, మ్రొక్కులిడి వెక్కి వెక్కి యేడ్చి యిట్లనెను.

లంకిని వానరనాథునితో రాముని కార్యము

—♦ దిగ్విజయ మగునసుట. ♦—

ఔరా! వానరనాథా! ఆదినివిరించి పల్కినటులయ్యె నేడు. నీవు అతుల బలవంతుడవు. బ్రహ్మ రావణునకు వరము లొసగి యేగువేళను ననుజూచియిట్లనియెను. ఓ లంకినీ, వినుము వానరవీరుని గుద్దునకు నీవు తాళజాలక కూలునపుడు దైత్య విభునకు మరణంబుతప్పక దాపరించును. తెల్లముగా దెల్పితిని నమ్ముమనెను. రాక్షసవినాశనార్థము, రామకార్యభారము వహించి తృటిలోన వార్ధిదాటి, భూపుత్రినిబరికింప, పురము జొచ్చి మీరిచరియించుజూవె సామీరిమారి:—

ఓ యనఘా! వాతాత్మజా రామరాట్ దూతా, అవ్యయా అంజనీతనయా నాతో బ్రహ్మ చెప్పినరీతిని నిన్ను దర్శించి నాయఘంబుల బాపుకొంటిని. శ్రీరాముని సీతారాముని దివ్యనాముని సదా సేవించి ధ్యానించెద ననెను. మిక్కిలి వేడుకతో అపవర్గ చతుష్టయమున్ను సమస్తలోకములున్నూ తక్కెడలో నొకవైపునయున్ను సజ్జన సాధుముఖ్యమిత్రుల నింకొకవైపునయున్నూ వైచి ప్రాజ్ఞుంగు తూచినచో, పవిత్రమగు సాధుమిత్రులుగల తక్కెడపక్కనే ముల్లువాలును. ఓ యనఘా! ఒక్కయితిహాసము జెప్పెదనువినుము. మునీంద్రుండగు గాధినందనుడు తపోబలమేబలమంచూ బ్రహ్మమానసపుత్రుడు వసిష్ఠుడు ఘనంబగు సజ్జనసఖ్యమే బలమంచూ వాదించుకొని నిర్ణయముకొరకు భుజగాధిపుని పంచాయతీ గాకోరిరి. అంత ఫణికాంతు డంతయూ విని యిట్లనియెను. ఓమునీంద్రులారా! మీతగవును తీర్చెదను. మీరు యీధరణిని ఒక్కనిమిషము నిలిపి తేచాలును. అనిన గాధిపుత్రుం డహంకరించి, తనతపోబలంబుచే భూమిని నిలుపయత్నించి వ్యర్థంబుకాగా తల్లడిల్లి తెల్లబోయెను. వసిష్ఠుండు తనసత్సాంగత్యబలంబున తృటిలో బుడమినినిల్పి కౌశికునిగెల్చి లోకవిఖ్యాతిం జెందెను. అపుడు మేలుమేలని ఆదిశేషుండు మెచ్చుకొనియెను. వినుమా. జగన్నాథుండు అనుకూలించిన సర్వమూసాధ్యమగును. సహ్యచందనంబౌను, ఫణి పుష్పహారమగును. శత్రులుమిత్రు లగుదురు. వ్యాఘ్రము గోవగును, సముద్రము గోష్పాదమౌను,

సర్గమత్యాగ్రదము ధూళియగును, అతిఘోరంబైనవిషము అమృతమగును, రోగ మారోగ్యమగును మృత్యువు ఆసన్న మయ్యా శమించి తొలగును. ఓయనఘా, నీవెరుంగని న్యాయమున్నదా? నీకు విజయము నిక్కముగా చేకూరును. రామదూతకు సాధ్యముగాని కార్యంబుగలదా యనెను. శ్రీరఘురాముగొలిచి, లంకగల్గు పురిని వెదకిరమ్ము. ఓయని లాత్మజా, నీకు నమస్కారమొనగెదను నిన్ను జయింపగల గండుమగండీజగంబునలేడు సురకోటినుతింపగా నీకోరిక సిద్ధించు ననెను. ఆదినారాయణుండు నీయందునుండు నిన్సంశయముగా సర్వమనుకూలించును. పొమ్ము పొమ్మనిపలికిన సూక్ష్మరూప మునుదాల్చి, వానరనాథుండు అపుడు నగరమును జొచ్చెను.

– వాతాత్మజుండు రావణుని అంతఃపురమును జొచ్చుట –

ఆపురంబందు అతడు చూడని భవనమేలేదు ఆతడు విడచిన మార్గ్యయంబేలేదు. అన్నివీథుల స్థలముల నరసి యరశి, రావణుని యంతఃపురమునుజొచ్చెను. అందు ఒక్క జానకిదప్ప యిలంగల సుందరాంగులెల్ల కానంబడిరి. వారి వారిమధ్యనుగాత్రిలు రావణుసిజూచి వారలు నిద్రించియున్న సొగసును జూచెను. శత్రుకోటి శయనించువేళ జొచ్చుట యొంతశుభమైననూ పరసతుల ముఖచంద్రబింబములజూచి మారిమారీయని నేత్రములను మోడ్చెను. వాయుపుత్రుండు పురంబంతయూ జూచెను. దానవీదానవ సంతతుల జూచెను.

నిఖిలమూజూచెను కాని, జానకినిమాత్రము చూడజాలక చింతాక్రాంతుండాయెను.

—: రామునిమాత సీతనుగానలేక విచారించుట :—

ఇచ్చట నెల్లతావుల వెదకినాను కాని తల్లి గానరాలేను. ఎచ్చట కేగువాడనని, ఏమియుపాయమని, వార్ధిదాటివచ్చిన ఫలమేమియని, నిరపాయముగా సతిని జూచివత్తునని మెచ్చి ననుబంపెగదా? నుహానీయుని రాముని తిరిగి ఎట్లుచూడగల ననెను. అక్కటా, నాకొరకు వానరులు కొండంతయాశతో నిరీక్షించుచున్నారుకదా, వారినెటుల చూతును? జానకినిచూడ కుండ నెటుల బ్రతికెదను? నాకిక దిక్కేమిటి? వడిగా సీతను జూచివత్తునని వానరులతో గనునుబంటుపోలిక పగల్భని కైవడి పెక్కులుచెప్పితిని. జలనిధిదాటితిని. కడకు జానకిని కాన లేక యేగతి వెదకెదను? ఏవిధిని మనెదను? వీరులమధ్య నా తలను యెట్లెత్తెదను? ఇన సుతుండేనగించి తనయాప్తిత మూవిధి వ్యర్థమయ్యెనని ననుజూచి యేడ్వగా శూరులు ఛీయని యీసడింపగా వార్థిదాటి సతీమతల్లిని గానకవచ్చితివా, ఓ వాయు తనూజా యని గాఘవులు కేలుచేయుగా నేనెట్లోర్తును. మేటి సురసనుగెల్చి సింహికనుజీల్చి, ఓర్చి కడగండ్లనీాటి పయోనిధి దాటి లంకిణినిజయించి నిశ్శంకగా లంకజొచ్చి ప్రఖ్యాతింగన నేను జానకినిమాత్రము గానవైతిని.

—: ఆంజనేయుడు, విభీషణుని గృహమును జూచుట. :—

ఇట్లు చింతించి దుఃఖించి యేమిసేతునురామా యని పరితాపమొంది అంతలో రామనామాక్షరాంకితరమ్యగృహము

అక్కజంబున వీక్షించెను. భళిరా ఇంతవరకూ వీక్షింపలేక భ్రమసిపోతిని. లంకలో రామశబ్దమా! రక్కసులమాయయో నిక్కువమో పోయి యీపుణ్యగృహమును వీక్షింతుననుచూ లంఘించి తద్గృహాభ్యంతరమున కరిగి తనివితీర రామనామామృతంబు చెవులగ్రోలి నొక సత్వసంపన్నుని రామభక్తుని లోనగనెను.

కంటిని బుధాగ్రగణ్యుని, త్రిజగన్నుత భక్తవరేణ్యుని, మున్ను వీనిగూర్చి నేవింటినిగదా మహాత్ముడు విభీషణుడా! ఆతడే అయినట్లయిన నాపంట పండినట్లేకదా! నావెంట గెల్పులచ్చి రఘువీరుని జూడగ రాకయుండునా! ఇంచుకదరిం జేరి మహీసుత యెచ్చటనున్నదంచు ప్రశ్నించిన హానికల్గునా! వచింపగా నిష్టములేనిచో దూషించునా! సత్యమును వచించక ఆర్యుండు నన్ను వంచించునా! మహాత్ములు కార్యభంగ మొనర్పరు కదా!

—: విభీషణునితో పవనాత్మజుండు ప్రసంగించుట :—

అని చింతించి తననుసమీపించిన హనుమనుబరికించి, యెదురుగాజని మొక్కి క్షేమంబడిగి యాసనంబిడి ఆదరముతో విభీషణు డిట్లనియెను. హరివో హరుడవో యిచటికి శ్రీహరిపంపున వచ్చిన భక్తుండవో, హరికిన్నీ నీకున్నూ వ్యత్యయమొందైనా నాకుదోపదను. హరిభక్తులచరణంబులయందు గల పరమాణువులు నాశీర్షమందు భక్తితోదాల్తును. హరిభక్తుని నిక్కముగా హరియనుచూ నమస్కరింతును. పావ

నంబాయె నేడు నాభవనంబు సార్థకంబయ్యె నాజన్మ మవని యందు; నాపాపంబులనెడి కొండలకునెల్ల నీపాదధూళి వజ్రా యుధము. అనిన హనుమంతుడువిని వినయానతుడగుచూ నవ్వి విభీషణునితో తనదేహనామములు, తనకార్యము తెలియ జేసి ధన్యుండనైతిననుచూ ఆదినారాయణుడు రాముడై ధర్మ సంస్థాపనార్థంబు ధరణియందు అవతరించెను. ఓయనఘా! నీవు భక్తుండవుగనుక నీవెరుంగనిది గలదా? అనుచూ శ్రీరాముని నుతించెను. అంత విభీషణుండు తనదేహము పుల్కరింప ధీమం తుడు, హనుమంతుడు, విరోధికృతాంతుడు, మునీంద్రశాసనవనం తుని కౌగిటజేర్చి జానకినాథుని దలంచి మైమరచి భజించెను.

—(విభీషణుడు శ్రీరామచంద్రమూర్తిని కొనియాడుట)—

సంసారదావాగ్నిలో బడియున్న పాపాత్ములకు రామ నామము సుధారసంబు, భవబంధనిర్మగ్నపతితులకు రామ నామము గ్రీష్మరవిశతంబు తాపత్రయభుజంగదష్టులకు రామ నామము ప్రసిద్ధామృతంబు, బహుజన్మ సంచితపాపాత్ములకు రామనామము సుదర్శనచయంబు, భక్తజనలోక దారిద్ర్యపర్వ తములకు రామనామము వజ్రాయుధంబు, జీర్ణరోగజీవతతికి రామనామామృతము నిరామయంబు, సతతము, సద్ధర్మకర్మశక్తి అనిశమూ రామదాససేవానురక్తి, జానకీరామభక్తి, సంసార ముక్తి యీలోకంబున నాకు చేకూరుగాక. రామనామామృత రసములేక దుర్గమవ్యామోహదాహమణగునా? రామతారక నామరశ్మిలేక, ఘోరసంసార అంధకారంబు తొలగునా?

శ్రీరామపద దాశ్యవృత్తిలేక భవరోగపాపసంతాపమారునా! రఘురామ నామమంత్రములేక కామాదిభీకరరిపుషడ్వర్గము లొంగునా? శ్రీరఘూద్వహుపాదసేవలేక మోక్షసామ్రాజ్య సౌఖ్యము బొందనగునా? ధర్మమార్గంబుదప్పిన ధరణివిభుని గొల్చినంతనే ముక్తి చేకూరనగునా? తలదాచుకొనుటకు ధర కందరములేదా? అభ్రంకషోన్నత హర్మ్యములేల? సతతమూశయినింప శాద్వలిస్థలములేదా? హంసతూలికాతల్పమేల? నిత్యమూ కట్ట వల్కలములులేవా? రమణీయ కనకమయ వసనమేల! క్షుద్బాధతీర్ప ఫలంబులులేవా? మాంసాన్న ఘృతమధువులేల! శాశ్వతైశ్వర్య మోక్షసంధానసంపద, శ్రీమనోనాధ సంసేవ లేద? శిష్టజననిందిత రాజసేవయేల? పరకృతాంతా, హన్మంతా అరయుము. హరిభక్తియూ, శుద్ధాంతఃకరణుల సేవించు భాగ్యమూ ఉత్తమచరితుల సహవాసము నాబోటిదుష్టులకు ఓయనఘా దొరకొనునా? పరకాంతా కనకాదుల హరించి సుఖింపనెంచు యసురాన్వయమందు పుట్టినవాడను! నాకు పరమార్ధమబ్బునా చెప్పుమాయనెను, తనతల నమ్ముకొని యన్యదాశ్యవృత్తిని పొట్టపోషించుకొన్న వాడొక పురుషుండా? తనకు కల్గిన కలినీరుద్రావి ధర్మపరుండు ధర్మపథంబున మెలగుననెను. ఓ వాయుతనయా! నీవు పుణ్యపురుషుడవు. నిన్నుదర్శించగా నాస్వాంతము శాంతించెను. పాపసమన్విత దనుజాన్వయమందు పుట్టితిని. రామునికరుణ బడయగలనా? హనుమా నీదర్శనంబుపయుక్తమ్ముగ చేకూరెనాకు. ఏనాటికైనా రామపాదార

విందమకరంద ధార తనివిదీర త్రాగగలనా? రామచంద్రుండు నాకు జనకుండు రామభక్తులే నాసోదరులు, నాకు తెలసిన దంతా చెప్పితిని, అన్యంబెరుగను. ఓమహాత్మా నాయుపాత్రా రాముని చూపించి నన్ను రక్షింపుమని విభీషణుండనెను. ఆశా పాశంబుల నిబద్ధబుద్ధిగల దైత్యులు సేవింప వాగాసి ప్రావృతదుర్గ మధ్యను పాలించు యాలంకేశుండెక్కడ, వానిసోదరుండైన నేనెక్కడ? శ్రీరామవిశ్వేశుని గొల్చి నేతరించు టెక్కడ? అక్కటా! యీజన్మ మెందుకనియెను. తామసంబునకు పుట్టి ల్లయిన దానవవంశమునబుట్టి దుష్కామ, లోభ, మదగర్వ వికారములు లలవరచుకొని ఆదివ్యగుణనిసన్నుత లోకపవిత్రుండగు శ్రీరాముని భజించుటెట్లు? ఓకపిరాజా! ఉపాయముదెల్పుమా యనెను. అన్యవిత్తమపహరించి పరకాంతల వంచించి బొంది సురాపాన మాంసభక్షణాసక్తులై దానవులు బ్రతుకుచుందురు అనెను.

— విభీషణుడు, దానవుల దుర్మార్గవర్తనము, వర్ణించుట —

వీరు, ఒరులస్వాతంత్ర్యముజూచి ఓర్వలేరు, వీరు సకలా యుధోపేతులు, కపటమార్గంబుగల కలుషులు, వీరిని యెట్టి వారైనా జయించలేరు. కలుషభూయిష్ఠమైన లంకాపురము కంటకాన్విత తల్పముపలెనుండును. ఇచ్చట క్షణమైన ఉండజనదు. శ్రీరాముని సేవింపకున్న నాకేది దిక్కనెను. పిమ్మట హనుమంతుడావిభీషణుని కౌగలించి, ఓయనఘా! నీవు

హరిభక్తుండవు, దనుజసంతతికి, దీపకుండవు ధన్యుండవనుచూ, ఆరావణుడు చచ్చినక్లో యనుకొనుము. ఆరాఘవుడు నిన్ను మెచ్చి పరిగ్రహించును. ధరణీసుత యునికి నెరుంగగోరి, నేను వచ్చినాను. ఓదనుజవంశవిభూషణా! విభీషణా! ఆపె యెచ్చటనున్నదో ఆరహస్యము వచింపుమని వేడెను.

విభీషణుడు వాయుపుత్రునితో జానకి
— యున్నచోటు తెల్పుట —

అంత విభీషణుడు, వినయాసక్తుడై విని ఓ మిత్రరత్నమా! స్వాంతము శాంతిపొందెనని, సంతోషముతో కౌగలించి, ఏకాంతవనాంతరంబున సీత గాసిలుచున్నదంచూ వృత్తాంతమంతయూ, దెలిపెను. రాముని సంస్మరించుచూ హనుమంతుడు వినెను. మంచిదని, ఓమిత్రరత్నమా! మానినీ శిరోమణిని కనుగొని, తచ్ఛిరోమణిగొని యరుగుదెంచెదను, యానతిమ్మని వచించి సూక్ష్మరూపంబుదాల్చి వాయుసుతుడు వెడలెను. ఇట్లు రహస్యమార్గమున వీరులకు కానబడక యుడవినిజొచ్చి శోకమున కాస్పదమయ్యె నాయశోకవనుచు తలంచి, నాజనని యెటుల యెచ్చటనున్నదో తప్పక చూతు గాక యని యావనంబు పరికించెను. ఏకవేణియై, దీనవదనయై శోకభారవివశయై, భూమి శయ్యయై, వెక్కివెక్కి యేడ్చుచూ అనిశమూ, రామ శ్రీరామయనుచూ, యున్నమానినీమణిని హనుమగాంచి, నమస్కారము జేసెను.

## వాయునందనుడు విచారసాగరము మునిగియున్న
## — భూపుత్రిని గాంచుట —

ఆధికి జిక్కి నిద్రాహారములుడక్కి యుర్విపై శుష్కించి యున్నదాని, అనిశమూ రామాయంచు బాష్పము లేకధార గాజార్చి యేడ్చుదాని, హాదైవమా యని, దీనవదనయై తన పాదముల దృష్టినిలుపుదాని యొక్క దైవములేడా, దిక్కెవ్వరని, విలపించి ప్రలపించి వెగచుదాని దానవాన్వయ ఘోర కాంతారమునకు, దావానలంబుగా దనరుదాని, జనకజం గాంచి సంభ్రమమున వినుతించి మనసా నమస్కరించి ఈ జగన్మాత యిచ్చోట నిటులుండ నెవ్వడు సహించగలడు. ఈ దుర్మార్గుండైన రావణుడు సైరించెగాని వానిందలంచి యహంకరించి అదను యిదికాదని అనిలసుతుండు శాంతించెను. ఆహా! యీమంగళదేవతామహిమగలిగి మాతృభావంబు, బుట్టించు మానినీశిరోమణినిజూచి ఆరావణదనుజ విభుండు, కామించె నేమందును. తగినతరిగాంచి తల్లి కాంతామతల్లిని దరిజేరి వృత్తాంతంబంతయూ నెరుగజేతును. అంతదనుకా, అవనిరుహమున దాగియుందునని హనుమంతుడొక సమీపవృక్షమెక్కెను. ఆపె చరణంబులందు నేత్రములు నిలపి, ఆత్మ నా రామచరణంబులందు నిలపి అతుల చింతాక్రాంతయై నణగియున్న అవనిసుతను అనిలసుతుడు చూచుచుండెను. ఉర్వింగల జనుల సంయోగవియోగములకు శరణము వె ప్రిధానములు ఈచరణములు రాముచేరునో

లేక శ్రీరాము చరణయుగళి, యిచ్చోటికి కేతెంచునో యెరుగను. అనుచూ సీతాననమీాపవృక్షాగ్రమున మెల్లగాదాగి, యీా పై కార్యమెట్టిదో యని కదలక సూక్ష్మరూపంబున వాయునందను డుండెను. తాను ఆకులచాటున సూక్ష్మాకృతినిదాగి, యచలాత్మజ నెట్లుచూడవచ్చునో, ఇక్ష్వాకుకుల ప్రదీపకుని వార్త నెట్లెరింగింపవలెనో, శ్రీకరాయని చింతిల్లుచుండెను.

—: రావణుం డాతెరిని సీతను వలపింప వచ్చుట :—

ఆతరుణమందు రావణుడు వచ్చి జయంతునకూడా నాముందు, సుందరములో జాలనివిషయములో సీత యెటుల కాదనగలదు? ఆమె నిష్కారణముగా నాతో పంతము బూనినది యని యప్సరఃకాంతలతో అసురారి కామియై నచ్చటికి గ్రక్కునచేరి యిట్లనెను. తనపదికేలలు ప్రకాశము దిక్కుల వ్యాపింప మకరకుండల రత్నమండలములు తనమేన దాండవింప ఘనసారచందనకస్తురివాసనలు వ్యాపించి పరిమళింప, తరుణపల్లవపుష్పధామములు కంఠమలంకరింప, ఇటునటు తరుణులునిల్చి కైదండలొసగ దండము దేవరా యనుచు భటులు చేతులెత్త అతులమదోన్మత్తుడై దానవరాజు సిగ్గు విడచి సీతను వలపింపవచ్చెను. పొంతను నిలచి సీతనుగాంచి ఓతరుణీ! ముద్దులుగుల్కుచు నన్ను కౌగలించి, నావంతలు బావు, నాతలలు వంచెదను. నీకు నమస్కరించెదనంచూ నే నొసగు కానుకల గైకొనుమనియూ ఓదానవనాథా! యెంతయో

నంతసించి, దహించితిననుచూ వచింపవేయనెను. నా సిరస్సులపై నున్న కిరీటమణులు ఓరమణీ! నీపాదనీరాజనములు సుమా! పూర్ణరాకేందుసఖను లీముఖములు ఓయతివా! నీయధరపానాతురములు సంతతస్త్రీలోకక్షేత్రము లీనేత్రములు. ఓలలనా! నీదర్శనలాలసములు, అప్సరస్తన కుంకుమాంకిత హస్తములు ఓరామా! నీసేవాపరాయణములు బహుభాషలేల ఓరమణీమణీ! నాయఖిలతనువు నీకర్పనము జేసివేస్తిని. కరుణతో నన్నేలకుండిన ఓగగనమధ్యా! నీబ్రితుకు మిథ్యయని నిక్కము బల్కుచున్నాను. ఓమోహినీ దేవీ! నీమోముజూచి చంద్రుని శిక్షింతును ఓ అమృతాంశువదనా, నీయధరామృతముగ్రోలి అమరులేడ్వగా అమృతభాండముత్రోతును; ఓకనకాంగీ! నీమేను కౌగలింపగనిమ్ము. కనకంబు భస్మంబుగా నొనర్తును. ఓ కామినీ! శృంగారకళల నంటగనిమ్ము. కళాశాస్త్రమును రచింతును. ఓకలికీ, నన్ను జూడుమా, కాముని గర్వమణతును. ఓరమణీ! నన్ను గూడుమా, యప్సరసల జయింతును. నన్ను వలపింపక మిన్నకున్న వోయున్నలమిన్న, యీతనువు నున్నాయనెను. భీముండన్న ప్రసిద్ధిజెందిన శివుని కేమార్లు మెప్పించి, సుత్రాముని గెల్చి యమాదుల సంగ్రామంబునదన్ని, నృపులనుదండించి శాసించితిని. ఓ రాకేందుబింబాననా, లలనా, నీరాముండా ననుగెల్చుట? యనెను. ఛీ ముండాయని మృత్యుదేవతను నే చెండాడగా చాముండాపతి నాభయంకర రణోత్సాహమును

నతింపగా రావణుండు భీముండని వీరులు ప్రశంసింపగా, ఓ లలనామణీ యీ రాముండా నను గెల్వగలడు? ఓనగరాజమహో న్నతస్తనీ, బలప్రతాపభుజవిక్రమమును ప్రకటించి భూపతుల పెంపణంచి, వనశైలములను వెకలించి యష్టదిక్పాలురచే జేయనిపించి పరాక్రమించు నన్నా రాముండు గెల్చునన్న, అందఱూ నవ్వరా? ముక్కునుబిగించి కాననలందు ముక్కుచూ మూల్గుచూనున్న రాముడీయిక్కకు రాగలడా? నాతో కయ్యమున జయించి పెంపెక్కగలడా? ఓరమణీశిరోమణీ నన్నుత్యజింపకు. భువిలో నెట్టికాంతకైనా చిక్కక నీకౌగిట జిక్కితినేయని యెను. నరూకు విమానములు కలవు. మానవుని వధింపలేమా? అస్త్రశస్త్రములతో రణదక్షులమై యుగ్రరణవీరులజంపి, వ్యాకులం బొనర్పగల మహాబలశాలురు దానవాగ్రుని తెలును గొనుము. లంకాపట్టణము కళంకహీనబలులనుగన్న రాక్షస రాజధాని. మావంకకు నరపాలసుతుండగు రాఘవుడు రాజా లడు. తాను మునులతో సహితమూ తపించుగాక, ఓపంకజ నేత్రా, దుర్భ్రమజెందక నన్ను వరించి యిప్పుడే సుఖంపుమని యెను. ఓ తరుణీలలమా! నరులు అతిమూర్ఖులై, నిరశనవ్రతులై యింద్రియనిగ్రహ మొనర్చి, మునులెయతులై అహింసావ్రతులై పరులజయింప జూతురు. అదియేపద్ధతి? వినుమాశరశస్త్రనంత తులువ్యర్థములా, చెప్పుమా! ఓయిందువదనా, మాయాజ్ఞబడ యున పోతుటీగైన మాలంక జొరజాలదునుమా! సకలమూ త్యజించి తపస్విమై చరించు రాముడేరీతి నాలంకకు రాగలడు.

—* సీతామతల్లి రావణుని దూషించుట. *—

అనినవిని యించుక యుపహాశించి తృణమునుచేబూని పృథ్వీపుత్రి నీవు తృణసమానుడవురా, ఓరాక్షసా! కారణము లేనిరణమును కల్పింపదగదురాయనెను. జంభారిమహాదోస్తంభభీషణుడు, అరిలోకశోషణుడు, భవసంకట పాపపంక, కళంక భాస్కరుడు అమితశ్రేయస్కరుండు హృదయమందెల్లపుడు సంచరించెడు మాధవుడు కృపాసాగరుడు దానవవైరి శాశ్వత ధర్మకర్మనిర్వాహుడు, సద్గుణధూర్వహుడు చండదోర్దండ కవిత కోదండ విజిత పరశురాముడు రాముడు పామరుడా? వోయీ! ఆతతాయీ పంచమహాపాతకుడు అసురసౌఖ్యవిధాయీ అన్యాయముగా హాయి లభించునని దలంతువేని వోయిదానవా! నీవు తృణప్రాయుడవు. పరశురాము జయించిన రాముండు ఆది నారాయణుండు సజ్జనావన పరాయణుడు నీవుగ్రహింపగలవా? నీతలనుదన్నిన దానవానీకవీరుల నెందరినో తానువధించెను. మూర్ఖుడగుటంజేసి యెరిగియో యెరుగనట్లు పలికెదవు. ఆతని ములుకులే యాతడెవడో పలుకును. భాస్కరునిజూచి వికసించు పద్మమెటుల అల్పఖద్యోతకాంతిని అలరగలదు? ఓయసురా! ఇంచుకతలంచి దురాశను వదలుము. ఈబాధ లెందుకుపడెద వనెను. ఓ పిరికిపందా! నీవు కుక్కవలెనేవచ్చి నన్నుతస్కరించి యిచట బంధించి బాధించి సిగ్గువిడచి కారుకూతలు కూయుచుంటివి. నీవొక వీరుడవా?

—( దైత్యనాథుడు పృథ్వీతనూజను భయపెట్టుట. )—

అనిన దైత్యనాయకుం డాగ్రహించి, తలలపంకించి; యుపహసించి చంద్రహాసముజూపి మీసములుదువ్వి ఆరాఘవు డెవ్వడని యిట్లనియెను. అప్సరస్త్రీలు మండోదరాదిసతులు నిన్ను నిరతంబు సేవింతురు నెలతా యని యెంతచెప్పినా వినక నన్నే వగించి యెగ్గులాడుచుంటివి. నిన్ను వధించిన దోష మున్నదాయని నన్ను తృణీకరించుచూ కులాధముండైన నరుం డగు రాముని సన్నుతించి లోకనుతశౌర్యధనుండని పెక్కులా డుచుంటివి. ఎన్నగరాని వీరులనెంధరినో జంపిన నన్నెరింగియూ కన్నులగానక యున్నావు. నీశిరము గ్రక్కునద్రుంచిన పాప ముండునా? నామేను పులకరించునట్లు వలపుజూపి కామినీమనో హరాయని నన్నుకౌగలించి సొంపెలరార మన్నింపవేని రాక్ష సులు సంతోషించువిధాన నిన్ను వధియింతుననెను. ఒకనెల లోన నాచిత్తము పల్లవింప నాయకాయని కౌగిలించి మనసార నన్ను వరింపకున్నచో కత్తిచే నీతనువు కండలుకండలుగా త్రుంచి మారాక్షసబృందము పకపకనవ్వి తెన్పుగా వేచుకొని భుజింతురు కామినీయనెను. అనుచూ సీతతోబలికి యహంకార ముతో రాక్షసస్త్రీలవీక్షించి రమణులారా! వింటిరా! యీపె నాయాజ్ఞ వినకయున్న నేనన్నటుల వెంటనే కావింపవలెనని మహోగ్రదృష్టితో భూపుత్రి నించుకజూచి వనితలు వెంబ డింప పరివారముతో జనెను.

## త్రిజట దనుజాంగనలతో; శ్రీరాముని
## —: ప్రభావం బెరిగించుట. :—

ఆదనుజస్త్రీలు భీకరాకృతులదాల్చి తర్జనభర్జనలుచేసి జనకజను బాధపెట్టుచుండగా వృక్షముపైనుండి ఆహానిచూచుచుండెను. త్రిజట యను రాక్షసాంగన యొకర్తె రామచంద్రుని నిరతమూ ప్రస్తుతించు ధన్యురాలామె యర్ధరాత్రమున లేచి కాచియున్న దనుజాంగనలజూచి యిట్లనియెను. నేనొక కలగంటిని. ఓయింతులారా! కల్లకాదదికాని, నిక్కమెట్లు వక్కాణింతును. ఒక్కమర్కటము మనలంకకువచ్చి రాక్షసులందరిని సంహరించెను. లంకెల్లెడలజొచ్చి మందిరములకాల్చి నవని గూల్చెను. రావణుడు వస్త్రహీనుడై గాడిదనెక్కి దక్షిణదిశకు వెడలుచుండెను. లంకకు విభీషణుడు పాలకుడుకాగా రాముని ప్రభావమే అంతటా ప్రబలుచుండెను. శ్రీసుతకు రాఘవుడు వర్తమానమంపెను. రాక్షసకులంబున ప్రళయకాలము సమీపించెను. ఆరాక్షసాంగనలు భీతిల్లి జనకజకాళ్ళపై నిపడి మ్రొక్కి ఓతల్లి పావనవనితామతల్లీ! కృపతోబోవుమంచూ ఆవనంబువిడచి తమభర్తలు సంతసింప యిండ్లకుబోయిరి.

## —: అవనిజ త్రిజటను చితి బేర్పుమని ప్రార్థించుట :—

అవనిజ త్రిజటనుజూచి దిక్కులేనిదానను యేతెరవు నాకులేదు. దైత్యనాధుడు ఒకనెల గడువుబెట్టి వెడలిపోయెను. నీవు ఆపద్బాంధవు రాలవు. ఓకాంతామణీ! నన్ను కాపాడ గలదానవు— నాపాపము తుదిముట్టగ సంతాపము చల్లార

నామేను వహ్నిలో బడవైచెదను. తడవులేకుండా చితి బేర్చుము. నాప్రాణంబులందు విడచెదను. రాముని వియోగము కడతేరును. రావణుండు గాసిలకయుండును. రావణు కఠోరవాక్కుల నేను వినజాలను. ఓత్రిజటా! యెవరైనా విననోర్తురా? వెంటనే చితిబేర్చి అగ్నిసితెమ్ము. నావందనము గొమ్ము. అని పరిపరివిధముల ప్రార్థించిన-

## —: త్రిజట జనకజను ఓదార్చుట :—

త్రిజట యాజనకపుత్రినిజూచి నీవు శ్రీసతివయ్యా; మనుజాంగనరీతి గుందుచుంటివి. మనమున యెక్కింత యోర్చిన క్షేమమగును తల్లీయనెను. ధృతిజెగి మర్త్యకాంత వలె గతికాలినట్టు బ్రతిమాలెదవు. నన్ను జితిబేర్చుమని యానతీయజెల్లునా తల్లీయనెను. ఓవనజాక్షీ! వనజాక్షుండగు శ్రీరాముడు లంకకిపుడు వచ్చును. నినుగని మెచ్చును. వినుము ఆక్రూరుడగు దనుజాధిపుండు తనకుటుంబసహితముగా వేగమే చచ్చును. శ్రీరాముండు మానవుడా? నారాయణుడు అఖిలలోకనాధుడు అవనిభారంబుదీర్ప సుమనసు లలరగా రాజకులమున యవతరించెను. మామంగళదేవతా యనుచూ ఓమానినీమణీ! నీకు నమస్కరించుచున్నాను. ఆపద సంభవించెనని యెంతో పొక్కుచుంటివి. రావణునివంశము లేకుండా నశింపజేయ జనించితివీవు ముని వర్యులు నిన్ను నుతింతురు అనుచూ సీతకు మొక్కి యిపుడే మరలివత్తునని వచించి యాస్థలంబు విడచె నాదనుజ

కాంత; అంత సంతాపించుచూ జనకనృపతనయ స్వాంతమున చింతించెను. అంతరిక్షమున అనంతకోటినక్షత్రములు వహ్ని కణములపగిది, వెలుగుచుండును. ఒక్కనక్షత్రమెటులయినా రాలిన హృదయతాపము అంతరించును. అమృతధాముండ వని నిన్ననెదరు కాని ఓకుముదబాంధవా! నీవు నిప్పుల కుప్పవు. ఇంతియని నన్నుకరుణింపక వెంటనే అగ్నిని దయచేసినచో నీకు వందనంబు లిడుదును. ఓతండ్రీ! నీవు యెల్లవేళలా సర్వమూ కాల్చుచుందువు ఓరజనీచరా! నయంబెరుగని నిప్పులకుప్పవు. నాపయి నీకు కూర్మియెందుకు? నేను ఒప్పులకుప్పయనుచూ మదినెంచక వాని విరోధము లంతరింపగా, వేడినిప్పులను దయచేయుము. ఓయశోకమా, నీనామధేయము సార్థకముగాక నాయెడల వ్యర్థమయ్యెను. నీచిగురాకులనెడి నిప్పులతో నన్ను దహించిన నాసంతాప మణుగును.

హనుమ వృక్షముపైనుండి శ్రీరాముని ముద్రికను

—: జారవిడుచుట :—

అంత హనుమంతుడంతయూ విని కటకటకంబడి వడి వహ్నికణము రాల్చుపగిది, జనకపుత్రి సంతోషించునటుల శ్రీరాముని ముద్దుటుంగరము జార్చెను. వహ్నికణమని యెంతయో భ్రమసితివి. కనులపండువుగా ఆశ్చర్యముదోప రామనామాక్షరాంకితరమ్యమైన ఉంగరంబచ్చోట నెటుల జారిపడెను యనుచూ ఇది కలయా, భ్రాంతియా, కలో

నిజమో, ఈయుంగరము నానాథునిబాసి యిచట కెట్లరు దెంచెను! యనుచూ ఓఉంగరమా, రఘూత్వమా లిర్వురకూ క్షేమమా? విభుండాపదచిక్కుకొన్న కులాంగననైన నన్ను దలంచునా? తత్సంగతిబాసి, నాబ్రతుకు కనుంగొన, వార్ధిని దాటి యెట్లువచ్చితివి? సత్యముపల్కిన నీకు మ్రొక్కెదను. నిన్ను గన్నంతనే నానాథుని వీక్షించినట్లు నామనంబు సంతస మొందెను. ఎవ్వరు నిన్నుగొనివచ్చిరో, మరేవిధానవచ్చితివో దెల్పుము. రామనామాక్షరాంకితమై, మనోజ్ఞమైయున్న నిన్ను వీక్షించినంత నావియోగదుఃఖమించుక యుపశమించెను. నా డెందమున ఆనందమతిశయిల్లుచున్నది. నావందనముగొమ్మ. యనుచు నాయుంగరము తనకన్నులకద్ది పరిపరివిధాల సీత పల్కుచూనుండ,

—: అనిలపుత్రుండు, జానకియెదుట నిలచుట :—

అదను చేకూరెననియెంచి ఆక్షణంబుననే అనిల పుత్రుండు ప్రత్యక్షముగా నిలచెను. అనిలపుత్రుసిజూచి, ఆయవనిపుత్రి మందమతినైతి రాక్షసమాయలు దెలియవు అక్కటా! యని తలవంచుకొనగా హనుమ యిట్లనియెను. తల్లీ! నేను రాక్షసుడనుకాను, నేను శ్రీరామపాదపద్మముక రందపానసంప్రాప్తమహిమచే అంబుధిని దాటివచ్చిన అనిల సుతుడను. నన్ను దయజూడవమ్మాయని, ప్రళయకాలమున పయోనిధిలో వటపత్రశాయియై తేలియాడెడు బాలదేవు డెవడు వేదములబ్రోచేందుకు మీనాకృతింగొన్న మేటిదేవు డెవడు? కమఠమై రమణియై, యమరులు సంతసింప అమృత

మొసగిన ఆర్యుడెవడు? ధరబో్రివ లోకభీకరసూకరంబైన శూరుడెవడు? స్తంభమునబుట్టి వసురజంపి ప్రహ్లాదునాహ్లాదుం జేసి, వామనుండై, పరశుడై భానువంశకులదీపకుండయ్యె నెవ్వడో దేవీ చెప్పుమా తపసి విశ్వామిత్రు జన్నంబుగాపాడి దనుజులను చంపెను. రాతి అహల్య నాతిగ జేసి ప్రఖ్యాతిగాంచెను. శివుని విల్లువిరచి, శ్రీలక్ష్మి జట్టపట్టె పరశునిబాహుగర్వాంబణంచెను. సవతితల్లికై సకలరాజ్యమునువిడచి ఖరదూషణాదిఖలుల రాక్షసుల వధించి మాయామృగంబుకొరకు వెడలినట్టి మహానుభావుండెవడో ఓతల్లీ చెప్పుమా యని ఓజననీ నిన్నుబోవ వచ్చి రావణునెదిర్చి పుడమింగూలిన పక్షికి మోక్ష మొసగి నారాముడో లేక యాదినారాయణుండో ఆతడెవ్వడు ఓతల్లి నాకానతిమ్ము. ఆతడు మానవుడుకాడు నళినదళనేత్రుండు సుమా, నీవు మానవివికావు, లక్ష్మివి. నేను పామరుండనుకాను మీపాదదాసుండను. ఇదంతా నిజము, ఓతల్లీ శాంతామతల్లీ, నన్ను దయజూడుముమ్మా యనుచూ శ్రీరామునియుంగరమును శిరమున దాల్చి తెచ్చితిని! నేను యారాముని దూతనమ్మా రఘురాముడే ప్రమాణమమ్మా, నీక్షేమమరయగా అతిశీఘ్రముగా వనధినిదాటి యీసీమకుజేరి యీవనము జేరితినమ్మా, నిక్కువమమ్మా నమ్ముమా. నేనొక బ్రహ్మచారిని, కపీంద్రుని బంధువుడను, వాయుపుత్రుడను, వానరుండను. రాముని భక్తుండను ఓమానినీమణీ ధూర్తుండైన దైత్యునిగా నన్ను దలంపకమ్మా. ఇంక నీమనంబున సంశయమువిడచి గను

మమ్మా నీకు మొక్కెద ననెను. శ్రీనాథాంశభవుండని రాముని సుగ్రీవుడుసేవింపగా అనేక వానర సేనతో త్రుటిలో వారధినిదాటి మునుల మేలన సర్వదైత్యకులసంహారమునకై త్వరలో ఓజననీ రామామణీ, మానినీ రాఘవుడు రానున్న వాడు యనెను. అనుచూ శ్రీరామ సుగ్రీవులమైత్రిని గూర్చి వచించి వాలినిగూర్చిన వార్తదెలిపి బోధించి భక్తితో కేల్గవ మోడ్చి యాకీశవరుడు నిలచెను. అంత సీత యంతయూ నాలించి యనిలసుతుడు నిజమైన భక్తుడని విశ్వసించి బాష్ప ములవిడచి మోదమిగురోత్త మేనుపులకరింప నంతసించుచూ జనకపుత్రి యిట్లనియెను.

## —: జానకి హనుమంతుని పల్కులు నమ్ముట. :—

విరహాంబుధిని తేలి మునుగుచూ తల్లడిల్లుచూ నన్ను బ్రోవ నావవలె గ్రక్కునవచ్చితివి. ఓపావనీ రాఘవులిరువురూ క్షేమమా? నన్ను యెల్లపుడూ దలతురా? నిక్కముగా జెప్పు మనియెను. అతడు కృపానముద్రుడు, ఉత్తమజనావనలోలుడు, ధర్మపాలుడు నన్నెట్లెడబాసెను? నాయెడల కర్కశమువహింప వచ్చునా? ఆశ్రితులనుబ్రోచుదుననే దృఢప్రతిజ్ఞ మరచెనా? అకటా, అబలను యిట్లవమానమోర్వగలనా? ఆకోమలశ్యామ లాంగుని గాంచుభాగ్యము నాకబ్బునా, ఓహనుమా నిక్కము వచింపుమా. ఇనకులాబ్ధిచంద్రుండు నన్నెన్నండైనా దలంచునా లేక మరచెనా?

అంజనీతనయుండు రాముని వియోగబాధను

—: అవనిజకు దెల్పుట :—

అనిన హనుమంతుడు యాపెదుఃఖమునుగాంచి మృదు మధురవాక్కులతో నోదార్చి ఇంతదుఃఖమువలదమ్మా నిన్ను యెన్నడూ మరువరనెను. నిన్నుదలంపక రాముండు నిలువ గలడా? నిన్ను మురుంచిగాదె యాసీరజాక్షుడు యిలనునాటక మాడ నేగుదెంచెను. ఆతని వియోగదుఃఖ మెంతని వచింతును. వేషమునుబట్టి వాక్కులు వెడలుచుండును. తల్లీ! నీమాట కాదన్న దక్షుడెవడు? మనుజుల కెరుంగరాని యాదనుజ మాయ విష్ణుమాయకు పీసమయినా సరిపోవునా? మనుజులకు మర్కటములకు మైత్రిగూర్చి నిన్నుమునుబెట్టి దేవతలాశ్చర్య పడ బూటక నాటకమాడుచున్నాడు నీభర్త. నీవెరుగని వృత్తాంత మెందుగలదనెను. జనకపుత్రీ! సర్వమెరిగినతల్లివి. స్వాంతమున కొంతధృతిబూనుమమ్మా. విభుడు నీకంటె ద్విగు ణీకృతముగా నీయందు ప్రేమగలిగి వర్తించుచున్నవాడనెను. విరహబాధకు లోనయి వెక్కివెక్కి విభుండు నీకంపిన సందేశ మును వినుమనుచూ గద్గదస్వరముతో కనులబాష్పముల విడ చుచూ అనిలసుతుడు యీలీల బలికెను. మనంబునరాముండు నిరతమూ నిన్నుదలంచి సైపరానిదుఃఖమున కన్నీరుపిడువ నేతల్లశిల్లెద. తల్లీ మనసునందు ఆతనిపాదధూళి అడవిలో నొక్కసిలను పడతిగాజేసెను. వాని పాదజలము పతితపావనం బైన గంగానదియయ్యెను. ఆహా! యాతని బాష్పజలమం

దెంతమహిమగలదో యెవరెరుంగుదురు. అని సందేశమును విన్న యెట్టికఠినపాషాణమైనా కరుగును. అట్టితరి నీమెత్తని హృదయ మేమగునోతల్లీ! ఒకింత ధైర్యమువహించి వినుము తల్లియనెను. ఓతల్లీ! సహింపరాని రాముని వియోగబాధ యేమనిదెల్పుదును. నేను బ్రహ్మచారినైనా వీక్షింపజాలక యడలిపోతిని వినిన నీవెంతకుందెదవో ఓజనకపుత్రియనెను. శీతలపదార్థములు విపరీతగతిని అగ్నికణంబులై రామునికి బాధించెను. అక్కటా! అమృతధాముడు వానికి చండమార్తాండుడాయెను. కిసలయంబులు (చిగుళ్ళు) నిప్పులైయొప్పె తల్లియనెను. రాత్రి కాలరాత్రి యయ్యెను. చంద్రుడు జ్యేష్ఠమాసోష్ణసాంద్రుడయ్యెను. పయోధరుడు ఉష్ణతైలమునుగురిసెను. పద్మములు ముండ్లపొద లాయెనుసుమా! శీతల సుగంధ బంధుర వాతపోతము ఉగ్రసర్పముయొక్క నిట్టూర్పాయయ్యె. ఆతడు నీలోనలీనమై యనవరతమూ వగచుచున్నాడు, నాకు వర్ణింపవశముకాదు జననీ! యనెను. హేతువులేని పోరుఘటిల్లునా? నీకొరకై అబ్ధిపై సేతువునుకట్టి కపిసేనల తోడొక్కనివచ్చి లంకలో జండాయెత్తి దైత్యుల పరిమార్చును. వారిండ్లపయిని తీతువుపిట్ట కూయుచున్నది. ఓమానినీమణీ! దలపోయుము; ధైర్యమూనుము యనెను. ఓ భూజాతా! వినుము. ఈ దనుజశేఖరుండు శిక్షార్హుడు నిక్కముగా జగద్రక్షకుడు రాముడేతుదెంచికపిసేనను ఆజిని నిల్పబెట్టి పాలాక్షుడు అడ్డువచ్చినా విడవక ఆతనితీవ్రశరాగ్ని

కీలలను పక్షులబోలి రాక్షసుల భస్మముచేయును. వినుమా! రామునిబాణములు అనురాగం [illegible] రాత్రామసతామసీ పటలదర్పము క్షణములో నశించును. నీస్వామిప్రభావము నీవెరుగవా జననీ! ధృతిని బూనుము నీకు క్షేమమగును. సకల జీవులకూ విచారము తొలగును. నిన్ను గైకొని వెడలనేర్తును కాని శ్రీరాముం డిచటికి రాకున్న [illegible] సకలదానవ కులమూ అంతరించు టెట్లు? ఇంతకూ నిన్ను తెమ్మని రాము డానతియ్యలేదు. రాముండు రాకపోడు. అసురనాధుని వధింపకపోడు, దేవత లాతనిమహిమను నుతింపకపోరు. దానవవంశో ముత్తోడ యీపురము తుక్కు తుమారము కాకపోదు. ఓ రామామణీ! మానినీ! జననీ! మదిని ధృతిజెందుమా!

—• సీతాదేవి హనుమంతుని నిజస్వరూపమునుగనుట. • —

అనిసవిని సీతయిట్లనె. ఓ హనుమా. నీవు చిన్నవాడవు. కొంచపుబిట్టకు కూతఘనమన్నట్లు పెక్కుమాట లాడితివి. విశ్వసించు టెట్లో తెలుపుము. నిన్నుబోలు వానరులసైన్యము అసురబలంబును పోరాడి జయింపగలరా? దైత్యవీరులు అల్పులనుకొంటివా? వారత్యధిక బలులు. తొలుత నాసంశయమును నీవు బాపవలయును. అనిసవిని ఓతల్లి జానకీ నీనుడులను నా యాదల దాల్చితిని. నారూపమును గనుగొనుమంచు మేరు పర్వతాకారుండై మేనుపెంచగా చూచి, పృథ్వీసుత నుతింపగా హనుమ యథాకృతినిలచి వినయంబున యీరీతినిపలికెను. ఓతల్లి, నేను వానరుండను, కానలనెల్ల సంచరించు ధీహీనుం

డను, నాకు బలంబెట్లువచ్చును? మీపదాంబుజధ్యానంబున మహాబలులనైనా జయింపగలను. నీవానతి.త్తువేని దానవ రాజునుయిప్పుడేసంహరింతును. శ్రీరామకృపాకటాక్షమహిమచే అంబుధిని దాటివచ్చితినమ్మాయనుచూ అతని దయయున్నచో పాము గరుడుని ఒక్కత్రుటిలోన వధింపలేదా? పూర్వమున పాము ఖగపుంగవుని ధాటికిఁ గోడి విష్ణుని శరణుజొచ్చిన వాని కృపచేతను బలసాహసంబులుపొంది ఖగనాధుని గెల్చెననగా వింటిని. ఓతల్లీ! అటులనే నిస్సందేహముగా నేను దానవుల గెల్తును. సందియము బొందకమ్మా!

—: జనకాత్మజ హనుమంతుని ఆశీర్వదించుట :—

యనిన జనకాత్మజ సంతసించి యీతను రామభక్తుం డని విశ్వసించి ఓహనుమా! నాయనుమానము వీడినది విశేష మనోబల దోర్బలంబులనుగని గుణసంపదనుబడసి శాశ్వత ముగా భూస్థలిని గ్రాలుమనెను. నానాధుండు నిన్ను ప్రేమించి సన్నుతించును? నీవు జరామరణంబులు లేక వసుధపై శాశ్వతం బుగా బ్రతుకుమనుచూ చేతులెత్తి మనఃస్ఫూర్తిగా దీవిం చెను. అంత యనిలసుతుడు కొండంత ఉప్పొంగి జానకీ రామా! రఘురామా యని నుతించి ప్రాణ్మాతనూజాతా! జగ న్మాతా! సీతా! నేడు నాజన్మ పావనంబయ్యెననుచూ ఓజననీ! నీయాశీర్వాద మన్నృతమగునా? సార్థకంబగుగాక, కృతార్థుం డయ్యి, శ్రీరామభక్తుండనై వసుధను శాశ్వతముగాబ్రతికెదను. ఆదనుజవిభుడు నన్నెట్లు గెలచి మనగలడు? నీకసిదీర దాన

వుల నిక్కముగా నేనేవధింతును; ముల్లోకములో మీాయ శము శాశ్వతమై వెలయుగాక! ఓతల్లీ! నాయాకలిదీర యీావనమందుగల ఫలంబుల మెసంగెద నానతిమ్ము.

వాయుతనూజునకు సీత ఫలములారగింప

— అనుజ్ఞ నిచ్చుట —

అనుచూ యీావార్తవిని దనుజవర్యులు వచ్చినచో సంహారించెదననెను. వారధిదాటి రాఘవుని బాణమువలె త్వరితముగా వచ్చితిని. యిచ్చటిశూరులకు నాపత్రాపమును జూపుటెట్లు? నీదయయున్న యీారీతిని చూపెదను. దుర్వార బలంబుజూపి ధీరుడనై రాక్షసయోధుల దునుముదును. అనిన సీతవిని ఓకేశరీపుత్రా! నీవు వాయునందనుడవు. శ్రీరామ భక్తుండవు. ఎల్లఫలంబు లారగించి యేగుము. నిక్కముగా నీకు జయంబేయగును.

కేసరీపుత్రుండు అశోకవనమును ధ్వంచి

— దానవుల చెండాడుట —

అనిన మేలనుచు యనిలసుతుడు లంకాపట్నమును జూచి హుంకారముతో ఫలములను దినుటకై వనముజొచ్చి సరస్సులో ప్రవేశించిన ఏనుగువలే చెండాడెను. మేను గోకు కొనుచూ వృక్షముపై నెక్కి ఒకరక్కసునిజూచి వెక్కిరించెను. వనపాలకులజూచి ఫలముల భక్షించి కసురుకాయలను వాళ్ళ పై రువ్వి కసరినవ్వెను. కుంజంబులను గుంజించి వృక్షశాఖల విరచి విసరెను. ఒకచెట్టునుండి మరొకచెట్టుపైకి ఒక్కుమ్మ

డిని గెంతి యూగులాడి రాళ్ళనురువ్వ వచ్చిన రాక్షసులను తోకతో గొట్టి నేలకు బరగదోసి కొందరి నెదిర్చి కొందరినంహ రించి భళిభళీయని వాయుసుతుడు వీరవిహార మొనరించెను. నిబ్బరమైన బలమున దైత్యులవాకి నేలకు దొర్లి తన తోకతో కొట్టినంత నా దెబ్బ కోర్వజాలక కసిదీర తిట్టుచూ రాళ్ళనువిసరుచూ అబ్బా! సహింపజాలమనుచూ హాతని హాతని యెల్ల దానవులు పారిపోయిరి.

హనుమంతుడు తన వాలమును గేలద్రిప్పుచూ నేలనుగొట్టి అసు రులంజూచి యడలగొట్టి మల్లచరచుచూ వనముధ్వంసముజేసి సంతోషముతో నా వానరోత్తముడు విహారించుచుండెను.

దానవులు రావణునితో హనుమంతుని పరాక్రమము

—: దెల్పుకొనుట :—

పరుగెత్తి పారిపోయిన దానవులు రావణుని సభాస్థలిని జూచి భీతిని ప్రదర్శించి కరంబులు మోడ్చి ఓ త్రిజగన్నుతా! దానవలోక నాథా వానరుండొకడెవ్వడో అశోకవనమునంగల వృక్షములను బెకల్చి, నిబ్బరముగా నిలచి వనపాలకులందరను వధించెను. ఫలంబులెల్ల దినుచూ కసురకాయలను రువ్వుచూ, మ్రాకులను బెకల్చుచూ యుద్ధమునకురండని మల్లచరిచి యెల్ల దైత్యులను గర్వముతో వధించెను. వానియాగడ మింతింత యని వచింపజాలమనిరి. వాడు మిక్కిలి సాహసబలోపేతుడు. కోతిగదాయని చులకనగా చూడరాదు. సకలాయుధధారు లను, ధీరబలోపేతులను వెంటనే బంపవలయును. వానిని వధిం

పక యుపేక్షించిన దైత్యులకు కీడుమూడును. దనుజోత్తమా! యించుక వేగరింపుమా యనినవిని-

-:అసురనాథుడు కోపించి ఒక లక్షసైన్యమును బంపుట:-

యసురవిభుడు చింతించి తలలను వంకించి కోపముతో తన యమాత్యవర్యులను సేనాధిపతులను, సభ్యులనూజూచి తనదుమీసములనువ్వి పటపట పండ్లనుగీటి, ఒక్కవానరుం డింత ఘోరమొనర్చెనా యిదియేమి వింతయని కన్నులుజేవు రింప ఉత్కటంబగు కినుకతో, ఒకలక్ష దానవయోధులను తక్షణమే వనంబునకు బంపెను. శ్రీరాము చిత్తంబున స్మరించి సౌమిత్రి నభినుతించి, జాంబవత్ప్రముఖ కేశనమూహమును దలచి, కీశాధినాథుండైన సుగ్రీవునిబొగడి తలిదండ్రుల ప్రార్థించి వాయుదేవుని బ్రస్తుతించి, హరిహరబ్రహ్మల కభినందన మొనర్చి అష్టదిక్పాలుర కభయమిచ్చి సురనరపావకుండైన శ్రీరామసేవకుండు ధూళిచెలరేగ వచ్చుచున్న దుష్టదనుజసేన వీక్షించి సింహమువలె గర్జించెను.

-: వాయుసుతుండు దానవసేనను దునుమాడుట :-

భేరి ధాంకారములతో వివిధశస్త్రంబులతో వచ్చిన దానవసైన్యమునుగని రండురండనుచూ భండనమునకుసిద్ధుడై ఆదండిమగడు దండును చెండాడజొచ్చెను. అమోఘవీరులను, శూరులను గెల్చినవారమనుచూ సంరంభముతో వచ్చిన యా రాతిమూకలనుజూచి వృక్షస్తంభమునుబూని రాఘవునిధ్యా నించి ఆరణమందు రాక్షసమారణము ప్రారంభిచెనాహనుమ.

ఒక్క రక్కసునిబట్టి డొక్కజీల్చి, ప్రేగులగిరగిరద్రిప్పి రొప్పు చునూ, ఇంకొకని పదయుగ్మమునుబట్టి బలేబలవంతుడవాదు వని నేలగొట్టుచునూ ఒకని కాలుతో దన్ని, ఒకని కేల వణంచి పిడికిట వేరొకని పొడిచి కూలద్రోసిన వృక్షముల గేలనుబట్టి బిరబిరత్రిప్పి దండుపై మోది ఎలెడలా తానేయై వరికిని జిక్క కుండ పోరిపోరి జడిసి బ్రతిమాలు వారిని విడిచిపుచ్చి ఆయనిల సుతుండు అట్టహాసంబు గావించెను. వెతచే గుందుచూ వాయు నందనుని బ్రతిమాలుచూ వందనము లర్పించుచూ మమ్ము బ్రోవుమనుచూ హతశేషులు గతియేమని అసురనాథుని కడకేగిరి.

—♦ దానవులు తమపరాభవము రావణునికి దెల్పుట. ♦—

వెడలి హృదయవేదన ముఖంబుల తాండవమాడ పాద ములు వడంకగ నమ్రులై యసురనాథునిజూచి నమస్కరించి గడచిన యుదంతమంతయూదెలిపి కన్నుల బాష్పములొలు కంగ తడబడి ఎంత వింతరాయని దానవవంశవరేణ్యు డిట్ల నెను. అక్కజంబిడి వానరుడొక్కరుడు "శివశివా" ఒకలక్ష సైన్య మెటులజంపెను? అనేకవీరులతో పోరునల్పితిని, కాని ఇట్టివిపరీత మెన్నడూ అక్కటా యెరుగనైతిననెను. ఆనరాం తక సురాంతకులు అలతురా? వీనిచేచచ్చిరే, ఒక్కవానరుని ధాటికి తాళలేకపోయిరా? వాడెంత బలాఢ్యుడో సిక్కము బల్కుడు. ఒక్కడు నాసైన్యమంతయు నంహరించెనన్న యీ యపకీర్తి నహింపగలనా? సింహమును గ్రామసింహము జెనకు

నేమొ? సాలీడు శరభమును జీల్చునేమో! నీటిపై గండశిలలు తేలియాడగ కాలమే తెంచునేమో? కసురుకాయలదినెడు శాఖామృగము మానమునుతిని బలసీన మల్లవరుల బెక్కురవధించె ననుమాట నేడు జగంబుల జయించినట్టి రాక్షసరేడు వినవలసి వచ్చెను. వాడు వనసింధ నెట్లుదాటెను. భటులకన్నులలోదుమ్ముగొట్టి పట్టణమెట్లు జొచ్చెను? మనదానవవీరుల కండ్లుమూసి యశోకవనంబు జేరుటెట్లు? వనపాలకుల నెటులజంపెను, ఆ బ్రహ్మ యీచెనటివానరుని ఏలసృజించెనో కదా? అనిచింతించి యాగ్రహించి కొల్వునగల పల్వురబలులనుజూచి మౌనుపడి యుండె రావణుండు.

అక్షయకుమారుండు అంతయూ విని పంతగించి

— * వానరయోధునితో యుద్ధమునకు వెడలుట. *—

అంత నొకవంత హృదయమునదోప నభలోగలసామంతులజూచి, అక్షయకుమారుండు పలికెనిట్లు—ఈవింత నోకించుకైనా మనుపువింటిమూ కంటిమూ లెండు. రండు. నేను పంతముబూనితిని. ఆవానరుని తప్పక వధించివచ్చెద ననెను. ఓతండ్రీ! నీకొలువున సురనరాంతకులు పలువురుకలరు. కాని వానరాంతకు డొకడైనా కానరాడు. ఆకీర్తినియానతిచ్చిన నేను గైకొందును. దనుజోత్తములెల్లరూ నన్నుతింపగా ఒక్కక్షణంబులో ఒక్కశరంబుతో వానరుని నుక్కడగింతును. మహాబలుల నేనొక్కడనే యుద్ధమందు జయించియుండలేదా? ఓ దానవవంశభూషణా నావాక్కుల విశ్వసించి ననుబంపుము

యని బల్కి భళిరా! వానరు డొక్కరుడు బాహుబలంబున అసురశ్రేణిని వధించెనన్న సైరింపవచ్చునా? తలపోయగా, వాడు రుద్రుడా? అజుడా? దేవేంద్రుడా? వైకుంఠుడా? దైత్య కీర్తింపగా ఒక్కవానరుని వధింపజాలనా యనెను. ఇట్లువచించి రావణరాజు నాజ్ఞగొని రణభేరి వాయించుమనివల్కి ఆహవ మొనర్ప నక్షయకుమారుడు భీకరముగాజనెను. మల్లవీరులతో నక్షయకుమారుడు వనమున కేగ ఆంజనేయుడు జగన్నుతరఘూ ద్వహుని నంస్మరించి నొక్కకేల నొకవృక్షముపెల్లగించి విద్యు ల్లతవలె ద్రిప్పుచూ రండని నొకకేలను ధరారుహమునెత్తి మహోగ్రగతి కొండనుబోలినిలచి బలమున్న దైత్యులు నన్ను సైకొండనుచూ మీరు షండులు, పాషండులు అనిదైత్యుల దిట్టుచూ కపిచంద్రు డెదుర్కొనెను. కొందరినిదన్ని కొంద రిని మూర్ఛితులంజేసి మరికొందరినిబాడిచి తుదకునందరినివధిం చెను. ఆరావణాత్మజుడు (అక్షయకుమారుడు) బాణప్రయో గము చేయుచున్ననూ వాయుజుండు ఆశస్త్రములు వందలు, వేలు తనపై నూటిగ పడుచుండగా పకపకనవ్వుచూ లక్ష్యము చేయక-

వాయునందనుడు అక్షయకుమారునిపై బడి

—: ఒక్కగుద్దున కూల్చుట. :—

అక్షయకుమారునిపై బడి ఒక్కగుద్దు రక్తముగ్రక్కు కొనునట్లు తలపైని వడ్డించెను. అంతనాతడు నవనిగూలెను. అసురనాయకు డావార్తవిని అమోఘబలుండగు మేఘనాథుని

బంపెను. వచ్చినవాడు దేవేంద్రుని గెల్చినజోదు, లంకలో జొచ్చిన వాడెవండన రఘురాముని భక్తుడమోఘవిక్రముండు. వీరిరువురూబోరిన ముచ్చటదీర వారి రణమును పరికింపనివార లుందురా? హనుమంతుడెల్లరదానవుల వధించెను. ఇంద్రజిత్తుతోడ నేరీతి బోరాడునో జూడవలయును. యనుచూ యక్షులు గంధర్వులు, అమరులు, ఆకసమున గుమిగూడి తిలకించుచుండిరి.

## —♦ ఇంద్రజిత్తు వాయుపుత్రునితో పోరుట. ♦—

ఇంద్రజిత్తు విల్లుబూనెనుగదాయనుచూ అమరేంద్రుడు మెంతో నడలుకొనెను. తన ధనంబు హరింప ధనస్సుబూనెనో యనుచు కుబేరుడు భీతిజెందుచుండ దనుజుండు హనుమనుజంపునేమోయని పవనుండు భయముజెంద దిక్పాలురజయింప తిరుగ వచ్చునేమోయని కార్తికేయుండు యార్తిబొంద గరుడగంధర్వ యక్షకిన్నరులు సిద్ధసాధ్యులు మునులు, నరులు, భయమున గడగడవడకి, బెదర భేరిమ్రోగించి కడునహంకారముతోనారిని లాగి మేఘనాథుండు సమరమునకు సిద్ధపడెను.

ఇంద్రుని జయించినట్టి లోకైకవీరుడు అఖిలశస్త్రఅస్త్రములతో నరదంబెక్కి వసుధకంపించునట్లు వచ్చువాని వరుస జూచి హనుమంతుడు పోరునకు సిద్ధమాయెను. బ్రహ్మతేజస్వి, శంకరభక్తుండు, ఏకపత్నీవ్రతుడు; లోకైకవీరుడు యిట్టివాని జయింప నాకుశక్యమా? చాలమంది దైత్యులనువధించి అలసి సొలసి యున్నానుగదా యనుకొనుచూ రావణునిచూడకుండ

లంకనుబాసి వెడలవచ్చునా! ఇప్పుడీపీకుచు బింకపొంకములు కని పెట్టి పోరిపోరి లావులప్రకటించి కష్టపడెదను. అనుచూ హనుమం తుడు వెంటనే వనమునగల చాలావృక్షములను పెల్లగించివేసి, ఇంద్రజిత్తునెదుర్కొని తనయేపుజూపగా యాతండు నిశ్చేష్టి తుండై నిల్వ, భళీరా యీతడు వానరుడుకాడు. హరుడో వైకుంఠుడో అయివుండును. ఈతని బలపరాక్రమములు అద్భు తము. ఎవ్వడైన నేమినాముందర నిలుపగలడాయనుచూ నామేఘ నాధుడు వేనకువేలు ములుకులు హనుమపై విడువగా వాటిని తప్పించుకొనుచు నొక వెంట్రుకను దుంచివేసి రాముని ధ్యానించుచు నిలచెను.

### మేఘనాధుండు రామబంటుపై
### —♦ బ్రహ్మాస్త్రము ప్రయోగించుట. ♦—

దైత్యునిపుత్రుండు ఓర్వజాలక అహంకారావేశుడై, కనులెర్రజేసి వడిగా బ్రహ్మాస్త్రంబు సంధించెను. అక్కటా! సురారి వాయుసుతుడు ప్రాణముల గొనునంచు ఇంద్రుడున్నూ; వాయుదేవుడున్ను తల్లడిల్లుచుండగా దానవుడస్త్రమును గూర్చుచుండగా హనుమ పకపకనవ్వి యిట్లని పలికెను. ఒక బాణమును తూణమునుండితీసి తొడిగితివి. జగముతొట్రిలు నంతటి వీరుడవౌదువు. ఒకయస్త్రమునకు రామభక్తుండు యడ లునను కొంటివా? ఆనలువ, సాక్షాద్విష్ణుతనయుండని యెరు గవా? రామభక్తుని కేమిచేయగలదు అనుచు యిదిగోనిల్చితి బ్రహ్మాస్త్రమేసి నన్నేమిచేయగలవో చేయుము. ఇంతేల?

అ(బహ్మాస్త్రమున్నంప నీతం(డిని పలుకరించుటకొరకు ఓదానవ ప్రభుపు(తా పట్టుబడితి నిదిగోయనెను.

రావణుని జూచుటకై చిక్కితినని హనుమ

—: ఇంద్రజిత్తుతో బల్కుట :—

మేఘనాథా! ఎట్టిశస్త్రాస్త్రములైనా నన్ను చంప జాలవు. నీవు బాహుబల వీర్యుడవంచు సుంతైనా జంకను వినుము. నీతండ్రి శివభక్తుండని వింటిని. యాతనితో నించుక ప్రసంగ మొనర్పగ నిశ్చయించి నీకు నేడు చిక్కితిని. యనగా రాక్షసుండు ఆగ్రహించి యింద్రజిత్తు బ్రహ్మాస్త్రమును సం ధించగా హనుమంతు డాదరుచి నిశ్చేష్టుడై నిలచెను. సమయ మిదేయనుచు నాగపాశబద్ధునిగా జేసి శీఘ్రమే తనరథంబెక్కి దానవుగలసి జయజయధ్వానములతో జనకుని చెంతకా యసుర వరుడేగెను.

—: రాక్షసేశ్వరుడు పావనింగని ఆగ్రహావేశుడగుట. :—

పావనింజూచి అసురనాయకుండు కండ్లెర్రజేసి తనువు కంపింపగాలేచి తలలనూచి తనఖడ్గంబుబెరకి; దంతములనొరకి అసురనాథుం డిట్లనియెను. ఎవడవురా మదీయపుర మేటికి జొచ్చితివీవు, నాపుష్పవనము పాడుచేసి వనపాలుర నెందుకు జంపితివి. ఓరీపాపీ, నాయనుగునంగనుసీ ఆనేకమంది దానవు లనూ, కూల్చితివి. నీశిరము నిప్పుడే నొక్క(వేటున ద్రుంచె దను నిన్నెవండు కాపాడగలడో చూచెదననెను. అశోకవన మును శోకవనమును జేసితివి; సర్వదానవులను నాపు(తునిగూల్చి

తివి నీతోకను కాల్చి నాఖడ్గముచే నీశిరంబు ఖండించెదను. నాకసి దీర నిన్ను చిత్రవధ జేసెదననెను. క్రిందుమీదు కానక పురము జొచ్చితివి ఇక చిక్కితివి నీ వెచటికేగగలవు? నీకు యిక్కడ దిక్కెవ్వరు నీకండకావరమణంచెదను కాచుకొనుమనెను. వెర వున లావున యీదనుజనాధుడు జగతిని వీరవిహారమునల్పెనం చెరుగవు కాబోలు. నాపురమును దొంగతనముగా ప్రవేశించి పొంచి దైత్యులవధించితివి. కరుణవిడచి ఓ వానరాధమా నీశి రము గ్రుక్కనద్రుంచెదను అనిన హనుమంతుడు చిరునవ్వునవ్వి నీ ప్రతాపమప్రతిమానసుప్రసిద్ధమని నేనెరుగుదును ఆశ్చెరిం గియే నిన్ను చూదామని నేనిటకువచ్చితిని.

—♦ శ్రీ రామదూత రావణునకు నీతులు జెప్పుట. ♦—

ఓ రావణా బాగా తెలసినవాడవాదువు అయినా నేనె వండనో యెరింగింతువినుము. శ్రీ మనోనాధపాదసేవకుడను దైత్యకులవనపాతకుడను ఓరీ రావణా ఎవదుసృష్టింప పాలిం పనేవగించి సంహరింపగ సమకట్టెనో ఆ జలజనేత్రుడినకులుండు నాకుదిక్కని యెరుగక నీనోరుకొలది కారులంబ్రేలుచున్నావు జాగ్రత వానరులు మాంసభుక్కులు కారుగదా! ఫలంబుల తిని జీవింపవలెనుగదా! నీవనమందు ఫలములదినినమాత్రమున జంపవచ్చునా? రామదూతనయి సీతాన్వేషణకై నీసీమనుప్రవే శించి ప్రఖ్యాతింగన్న దైత్యవీరులతో బాహాబాహి బోరాడి నీవర్గంబంతయూ తల్లడిల్లగా వారలననిలో చెండాడితిని. ఓదైత్య నాధా శత్రువులదునిమిన తప్పా? యోచించిచెప్పుమా దేవేం

దున్ని జయించినట్టి నీజ్యేష్ఠసుతునకు లొంగితివనియూహింపకు,
నిక్కము చెప్పెదను వినుము, నిన్నువీక్షించి, భాషించినీతెనిబో
ధించి వెడలుదమని వచ్చినాడను. విబుధులు మెచ్చగాఎల్ల వేద
శాస్త్రములుచదివితివి.సిరిసంపదలుబడసిప్రస్తుతి కెక్కితివి. ఐనా
దుర్మదంబున మద్యమునుత్రాగి, మాంసంబు భక్షించి, అహం
భావుండవయి, భూతదయనువిడచి ధర్మమును త్యజించితివి.
నీకాచదువేల కాల్చనా? అన్యులవధించి ఐశ్వర్య మపహ
రించి, సతుల జెరబట్టి సాధుసజ్జనులదృంచి, అధిపతివని రత్న
సింహాసనమాక్రమించినచో పరమార్థివగుదువా చెప్పుమా!
త్వరితగతి నెచ్చటికైనాబోయి విమానములు, రథగజతురం
గాదిబలంబులబన్ని, మహాస్త్ర శస్త్ర సంచయమునుగూర్చి,
యిన్నియూ చాలక అంబుధిలోచొచ్చి దాగుకొన్న పిరికి
పందవుగాక, నిర్భయముగా సంచరించగలవాడవా? ఓభీరువా!
రావణా! ఇతరులకు కీడొనర్పక, భూతదయగలిగి బ్రతికిన
లెక్కకువత్తువు. ఓమూఢా! అబ్ధిమధ్య నిర్మితపురవాస మేటికి?
నీశరీరమందంత యభిమానమెందుకు? వాడైనశస్త్రము లేటికి?
ఈఅస్త్రశస్త్రములెందుకు? ధర్మగతి సంభావించి నిష్కామియై
పరమార్థమునుగోరు భూపతికి, ఇవెందుకూపనికిరావు. దుస్తర
మోహాబ్ధిలో మునుగుచుండిన పాపక్షయంబగునా? సకల
శాస్త్రసంపాదన ఒరులను జంపుటకా? పరార్థహరణంబు
రాజమర్యాదా? ఒకనిమించి వేరొకండు మహోగ్రశస్త్రసంచ
యముమిక్కుటముగసమకూర్ప నేల?రక్తమునుగ్రావు టేల?ఓరా

డునూ, నీయమోఘవిక్రమమును పరికించి విడచినారు. ఇంక శ్రీరాముని జయించుటే బాకీ ఆపనికూడా కానిచ్చి భూలోక మందు బ్రహ్మకల్పమువరకూ బ్రతికియుందువు కాబోలు? కార్త వీర్యునిజంపి నినుబోలు యవనిపతుల నెందరిజంపెనో, పరశుండు ఆతనికంటె నీవు బల్లిదుడువా? లేక నిన్ను వార్ధినిముంచి, తేల్చిన వాలికంటె నధికబలుడవా? ఓయసురనాధా! బాగా యోచింపుము. సాధువులకు సాధువతడు భీకరుల కాతడెం తయో భీకరుండు. భక్తులకాతడు భక్తపరాధీనుడు. కాలు నకు నిక్కముగా కాలుడతడు.వినుము నామాట రాక్షసేంద్రా! దాశరథిని నిన్ను బరిమార్చదలచెనేని, బ్రహ్మవిష్ణుమహేశు లేపగిదినైనా కాపాడలేరు నిన్ను నిజముగా పిడుగుపడినగిడుగు ఆపగలదా? నీమానసమందు దురభిమానముదక్కి వివేక మూని నీయజ్ఞానము సైపుమంచు వారి చరణంబులమ్రొక్కి భక్తితో జానకి నప్పగించి, రఘురాముని భక్తుండవై మెల గుము, ఓదానవనాధా! లేనిచో నీప్రాణములు ముమ్మా టికినీ దక్కవు. కిందుమీదు దలంపలేక జనకాత్మజను తెచ్చి నావు. ఆశ్రీదయితుండు రాముడేయని చేతులుమోడ్చి భజింపజాలనిచో నీదశకంఠనాళములు తెగిపడిపోవును. నవ బ్రహ్మలూ యేకాదశ రుద్రులూ ఓదానవనాధా!నిన్నుగావం జాలరు. నమ్ముము. రాముడు ప్రణుతహారుడు, ప్రణతార్తి హారుడు, అఖిలసృష్టికి నాతడే ఆదిదేవుడు; అతని గొల్చితివేని శీఘ్రంబేశ్రేయమొనగును.గాన సీత నర్పించి తప్పుక్షమింపుమని

ప్రార్థింపుము. ఓరావణా! అకుంఠితభక్తితో పసుపుకుంకు
ములతో జని వేదనాదములు మంగళవాయుద్యములు చెల
రేగ, మానులు మేలనగా మంగళసుందరవిగ్రహుని గొలచి
ప్రార్థనసుతి సప్పించి భవత్కులాంగనా మంగళసూత్రము నిలు
పుమా; అవివేకము పారదోలుమా! ఆతండు సామాన్య
మానవుడేయని తలంతువేమో, అయినా ఒకమాటవినుము.
ఆతడు నీకంటే అధికబలుండై నప్పుడు, యీ వైర మెందుకు? నీకు
శుభంబగుగాక, బ్రతుకవలెనన్న నాపలుకు లాలకించు. ఈ
ముల్లోకము లేమహామహునిలోన జనించి దహించుచుండునో
ఆకరుణాసముద్రుని హావరుద్రుని రామభద్రుని యెమర్పబోక
పృథ్వీసుతనిచ్చి భజింపుము. సతీకమూ శ్రీరామచరణాబ్జముల
గొల్చియాతనిభక్తుల నాదరించి భాగ్యభోగ్యము లందుభావము
మరల్చి ఇపుడున్నదానితో తృప్తిజెంది మానినులందు మా
తృభావముజూపి కామాదిఅరిషడ్వర్గముల జయించి గోవులం
బోచి భూదేవుల పూజించి మద్యపానము మాని మాంస
మును త్యజించి, తలిదండ్రుల కీర్తిప్రతిష్ఠలు ధరణిని శాశ్వత
ముగ నిలపి అమరులు యభినుతింప లంకను నిశ్శంకతో పరి
పాలించుము అనెను. ఎంతధనమున్న వాల్లభ్యమెంతయున్న
శ్రీరామభక్తిలేక రక్తిగట్టదు. ఎంతచక్కదనమున్నా అఖిలభూ
షణములున్నా వలువలేకున్న చెలువకు విలువసున్న. నిక్కం
బుగా నీచాతినీచుడయ్యూ శ్రీరామునియందు భక్తికలిగిన
తాను పండితుడగును. సున్నకుముందు నొక అంకెయున్నచో

ఆసన్నకు విలువవచ్చునను సామెతవినవా? వానకాలమున లేచు వానతుప్పబోలు శాశ్వతముకాదు కలిమి; త్వరలోనన్నగిల్లును. రామభక్తిని కలిమి, జీవనదిబోలి శాశ్వతముగ వెలయును. నీయభిమానము విడచి నిష్కృష్టభావముచే నామాట వినుము. వ్యామోహముడిగి రామచంద్రుని గొల్వుము, నీకు క్షేమమగును. ఆతడు కరుణాపయోనిధి; నీకు అభయమొసగును. రాముని నీవెరుంగవు. ఆతని ప్రతిఘటించి నిలువజాలవు. ఆతడు కోపించెనేని ముజ్జగంబులవారు నీకభయమొసగి బ్రోవలేరు. ధనంజయుని మారుమ్రోగుధనుష్టంకారంబుజేసి ఆరఘురాముడు, కోదండమునుబూని నీదశకంఠములు ద్రుంచువేళ ఎవ్వరైనా నిన్ను కాపాడజాలరు. శ్రీకంఠుండు మెచ్చుటదాగునో నీకెందుకీ యహంభావము.

—: రావణుండు నిష్ఠురోక్తులు బల్కుట :—

అనిన విని దానవపతి పకపకనవ్వి, మీసములు దువ్వి యిట్లనెను. ఓమర్కటమా, మంచిఉపదేష్టవైతివి. కారు లరచెదవు. ఇక చాలు నీతలను కాచుకొనుమనెను. నరుడట, దేవుడట, వానరుడట, భక్తుడట, మేము పాషండులమట, మాకు ఉపకారము చేయనెంచి రామభక్తిని బోధించెదవు. నీవు బ్రతుకుపై నాశవదలి పేలిలవచ్చుననుచూ ధర్మమనగానేమి? సర్వస్వతంత్రుండైన దైవము మానవాకృతి దాల్పుటేమి? ఈమహాపురాణ మేడనేర్చితివి రా? అడవిలోని పామరులకు నీపురాణము పనికివచ్చుననెను. రాముడు నారసిం

హమో, గ్రామసింహమో యుద్ధభూమిలో పరీక్షింతును. వీరదానవ వరులకు భీతిజెంది ఆమాధవుడు మానవాకృతిని దాల్చెనో యెవరికి తెలియును. పామరులు, మునులు ప్రాద్రస్త మానమూ గొనియాడునట్లు మీాయుద్ధమూ యీాభూమినుద్ధరించుటకు పుట్టినట్లున్నది. దనుజేంద్రునకు గుండెలు బ్రద్దలగునట్లు బలవంతులమని చెప్పుచుంటిరి. నీవు భజించుచున్న యాగద్దరి, ఆరాచపులి వెంటనే వచ్చినచో సంతోషించెదను. ఆడుదానిని హింసించి మహాబలవంతుడనని చాటుకుంటున్న ఘనుడు. పితృవాక్యపాలన మొనరించుటకై రాజ్యమును తమ్మునకిచ్చిన ధర్మాత్ముడు; మాయలనుపన్ని ఖరదూషణుల ద్రుంచిన దుండగీడు; వేటకానివలె చెట్టుచాటునడాగి వాలిని గూల్చిన బల్లిదుండు: చిఱికిన శివుని విల్లువిరచి గొప్పలు చెప్పుకున్న విభుడు, లంకకెట్లయినవచ్చి మాబింకమణచి తనభార్యను గొనిపోయి ప్రఖ్యాతిని బడయవచ్చును. మృఢుడు రాముని నుతించును. అతడు సతతమూ నాత్మారాము నరయుచుండును. అదియే ఆధ్యాత్మికతత్వము. నీవు కోతివిగనుక యెట్లు తెలియగలవు? దశరధుండు తనయునకు రాముడని పేరు పెట్టినంతమాత్రాన దేముడగునా? దైవనామంబు గలవాడు గొప్పయగునా? కోతివిగనుక నీకుజ్ఞానముం లేగదా?

—♦పావని రావణునకు రాముడే విష్ణుండని బోధపర్చుట♦—

అనిపవిని హనుమంతుడు నవ్వి యిట్లనియెను. నీవు భోగపరుడవు కాగా మూఢుడవు. ధర్మమును నీకుబోధించుట నాదే

తప్పు. పాపమునకు పాలుపోయినట్లు పూనుకొంటివి. ఓరాక్షస రాజా! రాఘవుడు గ్రామసింహమో నృసింహమో లేక సంగ్రామసింహమో నీకిప్పుడెట్లు బోధపడును. యుద్ధమునకు సిద్ధముగానుండుము, బోధపడగలదు.

ఆదివిష్ణువు రాముండై అవతరించెననుటకు కార్తవీర్యుని వైరి, పరశురాముడు సాక్షి. అద్భుతంబైన వాని మహిమను తెలుపంగ గౌతమునిసతి అహల్యసాక్షి. రాముని బాణమమోఘమని వినుతింప బలగర్వమున జనిన వాలిసాక్షి. శ్రీరాముడు అనురేభసింహమనుటకు ఖరదూషణాది దానవులుసాక్షి. అతడు లేనితరిజూచి సతినిదొంగలించి అబ్ధిదాగినపంద. ప్రత్యక్షముగ నీవేసాక్షి. ఓరి అసురనాయకా! శ్రీరాముడాదినారాయణుండని నుతింప కైలాసగిరియెసాక్షి. ఇంకనూ సాక్షులున్నారు కాని శ్రీవారి బలసాహసచర్యలు యిట్టివనివచింప శక్యమా యెవరికైనా? నీవెరిగియూ యెరుగనివానిమాడ్కి అహంకారమునకు వశుడవై మాట్లాడుచుంటివా? రమణీమణుల దొంగలించుటలో నీకు సాహసప్రఖ్యాతులు కలిగెను. సముద్రమధ్యమున పట్నముగట్టుకొని దాగుకొనుటలో నీధైర్యము ప్రకటితమాయెను. వాలిచంకలో నీశౌర్యము నిమిడిపోయెను. గనుక ముజ్జగంబులలో నుతికెక్కిన వీరుడవైతివి. ఓరావణా! వంశనాశనా పెక్కులు నీవుపలికినా ఘనుడవెట్లగుదువు? కులము నశించుటకు సిద్ధపడుచున్నావు కాని ధర్మమును నిలుపుటకు నిచ్చగింపవు. నీవు అవినీతిపరుడవు కాని భూపాలుడవా? బల్కు

లను జయించువీరుడవో లేక షండవో లంకనుదాటి రాముని నెదుర్చుమా? జయమునుపొందుమా? బహుభాష లెందుకు రావణా! రాముండు నిన్ను మర్దించుటనగా అదియెంతపని. దుర్మనముచే గంభీరముగా పేలుచున్నావు. నాతో నేయుద్ధము చేతువేని ఆత్రిదశులు మెచ్చగా నిన్నాకుర్ద్రుచే యమపురి కంపెదను. ఇతరులను ప్రేరేపింపక నీవేనాతో యుద్ధమునకు రమ్ము. బుద్ధిలేక పిచ్చివానివలె పెక్కులుపల్కిన గెల్పువచ్చి లభించునా? దైత్యసంతతికి పెద్దవు. పేరు నిల్పుకొనుటకు పెనుగు లాడుచున్నావు. నిజముగా బలవంతుడవైతే ఇప్పుడే సమర మునకు నాతోరమ్ము. నాలావు చేవలను చూపి నిన్ను త్రుటిలో గూల్చెదను.

దైత్యనాధునికి కోపమువచ్చి హనుమంతుని సంహారింపుడనగా

—( వానరవీరుండు హుంకరించి పల్కుట. )—

అనిన దైత్యనాధుడాగ్రహించి ఓరి వానరా! నీకు మృత్యువాసన్నమయి నిట్లు ప్రేలుచుంటివనుచూ తన సేనతో యీకోతిని శీఘ్రమే అదిమిపట్టి శిరము ఖండింపుడని యాన తిచ్చెను. అంత హనుమంతుడాగ్రహించి వాలమును పెంచి రావ ణునిజూచి ఔరా! వీళ్ళా నన్ను బంధించగలవాళ్ళు? నిన్ను పరి మార్చి వెడలెదను అని, నిన్ను వధించుటకు నాకొకక్షణమైనా పట్టదు. నిన్ను చంపి ధర్మరక్షణ మొనర్చుట శ్రేయస్కరము. సాధుమునీంద్రకోటికి రాచపుండు వంటివాడవు. నేటితో నతీమ తల్లుల బాధల నివారించెదను. రఘురాముని యాజ్ఞలేకున్ననూ

రణమున నిన్ను వధింతును వేగమేరమ్మయనెను. శూలంబు బూని గిరీశుండు యుద్ధమునకు వచ్చుగాక. నావాలము కాల మృత్యు కరవాలము. దానవపంకజాతశుండాలము. వైరిమూషిక బిడాలము. ఓదనుజాధిపా రుచిచూపించెదను. రామమూర్తి నాజనకుడు; సీతనాతల్లి, నిన్ను పరిమార్చి నాతల్లిని నేనుగొనుట ధర్మంబనుచూ తనగాత్రమును మిక్కుటముగా పెంచి దైత్యుల మార్కొనదలచి నిల్చెను.

విభీషణుడు దూతను చంపరాదనిన హనుమంతునితోకను

—* కాల్చి విడువుడని రావణుండాజ్ఞాపించుట * —

అంత విభీషణుడు తనసచివులతో నచటకేగుదెంచి, దైత్యాంతకుడివలెనున్న యనిలాత్మజునిజూచి తాళుమని అంతయూ సానుకూలమగునని వచించి యీవైపున నిల్వుమని వచించి రావణునితో నీవిధముగాజెప్పెను. ఓజననుతా నృపులు దూతలను జంపుట ధర్మవిరుద్ధము. ఈతడు ఒకనృపుని దూతగా వచ్చి యాతనికార్యమును గూర్చి వచించెను. మాట్లాడినయనంతరం అతనిని పంపివేయుట ఉచితము. దూతనుజంపిన జయము చేకూరదు. యుద్ధమున గౌరవము నిల్వదు, అవిన అసురవిభుడు మంచిదేయని భటులవీక్షించి నిట్లు యానతిచ్చెను. కోతులకు తోకయందు ప్రీతి మెండుగాన వానివాలమునుగాల్చి వానరుని పంపివేయుడు. దైత్యనాయకుని యానతిని నొదలదాల్చి దనుజులు నరేయుంచూ తైలమునముంచిన వస్త్రకోటినిదెచ్చి రావణునికోపమును శాంతించునట్లు అనిలజునిబట్టి తోకకు తైలాం

బరములు గట్టిరి. వలువలు గట్టినకొలదీ తోక యభివృద్ధిజెందు చుండగా పురిలోని అంబరములు తైలములు నిండుకొనునట్లు తెచ్చి కట్టసాగిరి. ఆవిచిత్రము చూచుటకు దైత్యులనేకులచటి కేతెంచి యాశ్చర్యమొంది కొందరు హనుమంతుని చుట్టు ముట్టాడి కవ్వమనియార్చి కేలుగొట్టి రాళ్ళనురువ్వుచూ కోతీ నాముక్కుదూలయనుచూ చిన్నకోతికింత పెద్దతోకెందు కని లాగి అగ్నిముట్టించి యానందించి నగరవీథుల నలుగడల దిప్పిత్రిప్పి విడచిరి.

—♦ హనుమంతుడు లంకాదహన మొనర్చుట. ♦—

బలహీనునివలె ఓర్చి, మానమువహించి భటులుతనను విడిచినవెంటనే భళిభళీయని నల్గిక్కులూ పరికించి కుప్పించి భవనములనెక్కి ఆవాయుసుతుడు నగరసౌధములనెల్లను గాల్చి వేసెను. సకలలోకాంతక జ్వాలావళివాహామట్లు ;సకలదైత్య సంఘసిద్ధమృత్యుక రాశమట్లు కలుషపంక కళంక లంకాసుర ప్రాణపన్నగమట్లు శత్రులోకసంగ్రామ నిశితచంద్రాయుధ మట్లు బ్రహ్మాది దేవతలభినుతింప మండుచున్న తనతోకనెత్తి ఏచి కుప్పించి నిల్చి యిల్లిల్లుగాల్చి అనిలసుతుడు అట్టహాసంబు జేసెను.

—: రాక్షసులు భయకంపితులగుట :—

ప్రళయకాలాగ్ని జ్వాలలు చెలరేగినవి. గుహాళిలను విడువుడీ యని కొందరు, జ్వాలను మరి చల్లార్ప లేము గాన జాలముచేయక శిశువుల బోవిడుడీ; యని కొందరు

నాభర్త మద్యముసేవించి మతిమాలి యున్నాడు వాని రక్షింపుడీ, యని కొందరు, యీభవనమును క్రొత్తగా నిర్మించుకొన్నాను వచ్చికాపాడండి యనికొందరు, వస్తుసామగ్రి సర్వమూ భస్మమయ్యె యేమిసేయుదును అని కొందరు అనుచూ పరిపరివిధముల నసురులెల్ల కంగారుపడుచూ గగ్గోలుపెట్టసాగిరి. హాలాహలానల జ్వాలగ్రోలు శంకరునివలె వాయుసుతుండు నిశ్చలతనుండెను. దనుజులు, హనుమను, ఈశ్వరాంశసంభూతుడేమోయని మొక్కుచుండిరి. హన్మంతాయని సంబోధించి ఒకవృద్ధదనుజ, నీకున్యాయమా, వికటానికైనా నా యిల్లు కాల్చుటమా, శ్రీరాముపై నానసుమా యనెను. ఒక దైత్యుడు నూత్నముగ నిర్మించుకున్న నారత్నగృహమందు క్రొత్తపెండ్లాముతో కాపురమున్నాను నన్ను కరుణజూడుమని యొకదైత్యుడు మొక్కెను. వీరకేసరి కంజనాదేవికి ఆత్మజుడవు, వాయుదేవుని కృపచే బ్రహ్మాది దేవతలచే వరములొందిన బల్లిదుడవు, సకలశాస్త్రపురుణాదుల చదివిన పండితుండవు విష్ణంశసంభవుండని వినుతికెక్కిన రామచంద్రుని బంటువు. అట్టి నీకు యీకార్యమొనరింప నన్యాయమయ్యా నేను పేదవాడను, మాయిల్లు కాల్చకయ్యా! మమ్ముబ్రోవుమయ్యా! నీకు మ్రొక్కెదమయ్యా, యనుచూ నొకవృద్ధరాక్షసుండు, హనుమను వినుతించుచుండెను. తనమిత్రునిపుత్రుడనియో వనరుహాక్షుని భక్తుడనియో, దనుజులు చావవలెననియో హనుమంతుని అనలుండు బాధింపడయ్యెను. తననిజ

స్వరూప మగ్నిహోత్రి మందున్న కారణమున ఆజనకుడు దయదలచి పావకుని బాధ అంజేయుచుండు బ్రాంకుండ చేసెను కాబోలు అని రాక్షసులనుకొనిరి. దనుజరాజ్ఞి మండోదరి, ఓరి ప్రకంపనా, ఓరి అకంపనా, ఓరి మహోదరా, ఓరి త్రిశిరా! కనులులేవా? చెవులు పోయినవా? చూచుచూ, దినుచూ ఒళ్లు మరచే నిల్చున్నారు. అలసింపక మంటలు చల్లార్చి శిశు, బాల స్త్రీల, వృద్ధుల రక్షింపుడీ, ప్రళయంబువచ్చి వంశనాశన మయ్యెను. సంఘాతమరణములు సంభవించెను. ఎంతబోధించి ననూ దానవనాధుడు వినక కోరి కొరవితో తలను గోకుకొని యెను. మచ్చరంబుచే నాపద తెచ్చిపెట్టుకొనిరెను, అనుచూ రాణి విలపించెను. ఈహనుమ కరుణమాలి దుర్గములను సింహ ద్వారములను రాజవీధులను, సౌధములను, మందిరములను, ప్రాసాదములను, అఖిలసీమలందు ప్రత్యక్షమగుచూ కాల్చి బూడిదచేసివైచెను. కుంభకర్ణుని భార్యా హనుమంతునితో అక్కటా! నాభర్త గదిలోన నాదమరచి పండుకొనియున్నాడు. నీకు వందనములిడుతును. మాయిల్లు కాల్చవద్దని నుతించెను.

లంకాధీశుడు హనుమంతుని తోకను ఖండింపుమని

—: అనుజ్ఞనిచ్చుట. :—

పిమ్మట లంకేశుండు దానవులంజూచి అరరే, ప్రమాన్పడి నిలచితిరా. మీకు మతులుపోయినవా? ఒక్కవానరుని జంజాటమునుజూచి, జంకవచ్చునా? ఎందరోఉండియూ, శత్రువునిట్లు మీరదబెట్టుకుందురా? ఆవానరునితోకను వెంటనే ఖండింపుడు.

మెల్లరహాని వెంటనేతోలగుననెను. సరే, బాగున్నదని దైత్యు లెల్లరూ గుంపుగూడి పిరికిదనమువిడచి నిల్వుడని రావణుడు హెచ్చరించగా, కత్తులు కఠారులు ధరించి ఆహన్మంతునిముట్ట డించిరి. సరే, దొరకుననుయాశ నిశాచరనాథునకుదోప, దగ్గ రకు వచ్చినట్లుండి తారసిల్లి మంటమండుచున్న తనతోకతో రాకాసిమూకలనెల్ల గొట్టెను. ప్రాణములతో నిలచియున్న బలుసాకుయైన తిని బ్రతుకవచ్చుననుచూ దనుజులు పరుగెత్తి వెంటనే పారిపోయిరి. రావణుడు మ్రానువలె నిలచియుండెను. అనేక గృహములు, మందిరములు రాక్షసాధీశు నంతఃపురంబు యేకభస్మరాశిగా పురంబు విధ్వంసమయ్యెను. ఆక్రిందనములు మారుమ్రోగుచుండెను. భుగభుగమని ధ్వనులు భూనభంబుల మారుమ్రోగగా భగభగమండు జ్వాలలు కింశుకపుష్పరాశిగా నగరము శంకరత్రినయనము విధంబున కానపించెను. అంతట నానగచరుడు (హన్మంతుడు) దనుజవిభునిజూచి నెంతయోనవ్వ సాగెను. తన కసిదీర దనుజుల దర్పమణగ, వాయుసుతుడు బెట్టిన అగ్నిహోత్రుడు లంకంతయూ వ్యాపింప, అంజనా నంద నుని, యానంద మతిశయించెను. రామునకు ప్రీతియనుచూ, సంరంభముతో, భవనములనెల్ల వహ్నికప్పనముజేసి, ఓరా వణా! ఒట్టివెంగలివియని వెక్కిరించి తనవాలమునుజూపి, వాయుసుతుడు తటాయించెను.

—: హనుమ రావణుని దూషించుట :—

ఓరావణా! జగద్విద్రావణా! ఓకుమతీ! నాహితం బులు వినక నీకు కీడొనరించుకున్నావు. భవదీయవంశకాంతార

విచ్ఛేదమును జేసెదను. మృత్యుదేవత నిశ్శంకగా లంకను జొచ్చి ధిమిధిమితైధిమ్మనుచూ, నాట్యమాడునుసుమా! రఘురాము దివ్యచరణంబుల భజించు సేవకుని నన్ను జలధిని తరించి, పురంబు జొచ్చి వనంబును పెరకి నీతనయునిజంపి భవనములుతగలేసి, భుజదర్పమున జూపిన దూతను యీవిధంబున తోకనుకాల్చినఫలము చక్కగాబొందితివీగతి ఓరి దుర్మతీ! నాకు దిక్కెవ్వడని యంటివి ;నీకిపుడు దిక్కెవ్వడో చూచుకో అనుచూ కాలుచున్న దూల మొకటిబూని, దైత్యులను వెంటబెట్టెను. చిటపట ధ్వనితో మంటలు మండుచుండగా బటబట మని యిండ్లుకూలుచుండగా వసుధపై పడుచుండగా దైత్యకాంతుడు లంకాపుర నూతనశృంగారమును కటకటాయని కాంచుచుండెను. ఒకపడతుక చనుబాలుద్రావు నొకతనయుని చంకబెట్టుకొని, నడుము వడకుచూ అడుగులు తడబడుచూ పిల్లవానిని జారవిడుచుకొని, దైత్యవల్లభునివద్ద విలపించెను. ఇంకొకర్తె కడువేగమున వచ్చుచుండిన విండామరమువలె, కేశములసొంపు కానరాగ . నిండుజవ్వనమునగల మేనుచాయ బంగారుచాయకు మించియుండ మదపుటేనుగ కుంభస్థలమును మించిన కుచకుంభములమీద కొంగుజార నల్లగల్వలబోలు నయనయుగ్మమునుండి కన్నీరు మున్నీరైపార వీడు వానరుడుకాడు. వీడదనుజసంహారకుండు; నాదివ్యభవనంబు భస్మంబుజేసెను. నామగడు సెగలోను పొగలోను దగుల్కొని కానరాడాయె ననెను.

—: దానవనాథుడు భయముజెంది, పరితపించుట :—

ఆ దితిజాధిపుడు (రావణుడు) మతిచెడి, లేచి, వేడి నిట్టూర్పుతో, నలుదిక్కులాజూచుచూ భీతాత్ముడై దూలుచు నిట్లనియెను. ఓనిర్జరనాథా! నాకు సంభవించిన యాపదనుండి తొలగింపవా? ఓరీ మేఘా! నీవమోఘవేగమున లంకలో ధారాపాతముగా వర్షము గుమ్మరించి, యీప్రళయాగ్నిని చల్లార్పుమా యని కోరెను.

అనిన, దైత్యేశుని యాజ్ఞను శిరసావహించి అమరనాధుండపుడు రండురండని యానతీయగా మేఘసంచయము పురంబంతయూ నీరముతో గుమ్మరింప ఆసలిలధారలు ఘృతంబై అగ్నిజ్వాలలు మిక్కుటంబౌనర్చెను. కుంభవృష్టిగా వర్షము కురిసెగాక, ఆవర్షము ఘృతవర్షమేనా, అనలుండు జృంభించి దనుజవరుల గేహములు, దేహములు, ద్విగుణీకృతముగా కాల్చివేసెను.

— మాల్యవంతుడు రాక్షసులందరిని ఓదార్చుట —

దనుజుల సన్మానితుండు మంత్రులలో పెద్ద బుద్ధిమంతుడు రావణుని వృద్ధసలహాదారుడు, అయిన మాల్యవంతుడు హనుమంతుని విక్రమముజూచి రాక్షసుల దీనదశజూచి రావణుని ఆపహాయస్థితినిజూచి, పురము దుర్గతినిజూచి యెంతయో వగచి కాలరుద్రుని కోపాగ్నిలీలజెలగి జనకసుత వేడినిట్టూర్పు మీరి రామచంద్రుని బాణాగ్నివలె వాయుపుత్రుని ప్రజ్వలవహ్ని యొప్పుచుండెను, అనుచూ చింతించి పారిపోవుచున్న

దనుజు లందరిని బిలచి హెచ్చరించి వాహనంబెక్కి పురంబెల్ల శోధించి ప్రళయమనుచూ శోకించెను. మాన్యుండగు విభీష ణునియొక్క దివ్యమందిరమూ, తనువుమరచి పరున్న కుంభ కర్ణునిసౌధమూ, దక్క తక్కిన మహాభవనంబులెల్ల అగ్ని జ్వాలలో కాలి, భువినిగూలి భస్మమయ్యెను.

## హనుమంతుడు విచారించి జానకిని — దర్శించ వెడలుట —

భళిరా! పురంబంతయూ భస్మమొనరించితిని. కోప మెంతపనినైనా చేయిస్తుంది. అయ్యో! సీత యీప్రళయా గ్నికి చిక్కెనేమో? దానవనాధునిపై కోపమున తప్పొనర్చి తిని. కోపి, మంచిచెడ్డ లరయజాలక సర్వమూ పాడొనర్చును కదా?

అనుచూ పరిపరివిధముల పరితపించి పౌరులవరునజూచి కనికరించి మతిరోసి, కినుకబాసి, వాయుసుతుడు సముద్రతీర మునకేగెను. జ్వాలామాలాన్విత లాంగూలానలపుంజమును కూపారంబులో చల్లార్చి జనకజను పరికింప వనమునకు జనెను. అచట జానకినిగని బ్రతుకుజీవుడాయని స్వస్థతజెంది జనని నేచేసిన తప్పుకు గర్హించునని భయపడి సమీపమునకు మెల్ల మెల్లగానేగెను. హనుమరయొనర్చిన కార్యమునుదలంచి వానిం జూచి యుపహసించి దానవులు మూర్ఖులనియెంచి బురిని దహించి భస్మముచేసి వస్తివాయని పలుకరించి తప్పొనర్చిన వాడు నైత్యవిభుడొక్కడే అయియుండ తత్కులమునుబొంత

నాతడే తగుటగాని స్త్రీల, బాలుర, వృద్ధుల, దిక్కులేనివారి నన్యాల హింసింప నర్హమగునాయనియూ, సాటిమానవు డెంతటి శత్రువైనా చంపివేయుట సరియైనపనికాదు. మంచిచెడ్డల బోధించి మానసంబుగలచి ధర్మమార్గమునకు దిప్పవలయుగాక. తగవు వినిపించి వైరిచిత్తమును దిప్పి, వెరవున జయింపవలెను. కాని వీరడవని చంపినచో అదిహత్యయగును కాని జయముకాదు. ఆటోపమున కోపముజూపజనదు. అనినహనుమంతుడు యాలకించి ఓజననీ! నీవన్నట్లు కోపము జూపజనదు. నిక్కమయిన కూళయెడల కోపమును జూపవలయును. నన్ను నిరోధించి బాధించిరని గినిసి పట్టణము గాల్పలేదు, కాని రావణుండు శ్రీరామమూర్తిని ద్వేషించి. దూషించి, సంభ్రమించి నావాలమును గాల్చిరి. గనుక సైరింపవశమా చెపుమా తల్లీ! యనెను. జరిగినదానికి వగచిన ప్రయోజనము లేదు. జలధిలంఘించి తడయక వెడలవలయును. ఓజననీ! నిన్ను లంకలో కన్నారజూచినట్లు ఆనవాలిమ్ము. తలనుదాల్చి వెళ్లెదను.

### సీత తనశిరోమణిని ఆనవాలొసంగుచూ

### —• శ్రీరామునకు వర్తమానమంపుట. •—

అనినవిని మానినీమణి సంతోషముతో తనశిరోమణిని హనుమకొసగగా తన యిరుచేతులతో నందుకొని అత్యంత భక్తితో నొదలందాల్చుచుండ దేవి యిట్లనియెను, ఓ లీలామానుషవేషా, శూలాయుధవినుత వేదచూడామణీ, నీబాలామణి, చూడామణి, నీకొసంగెద గొమ్మనుచూ, నృపశిరోమణీ

సీమానినీమణి యిదిగో తనశిరోమణి నీకిచ్చెను. దయయుంచి మరువవలదని సద్ధర్మమార్గముచే అసురనాధునిగెల్చి యతివను గొమ్మనుము, హనుమా యనుచూ తృణమునుమంత్రించి తృటిలోన కాకాసురుని తృణసమానునిజేసి వానింజయించి సీత బ్రోచినాడవా నాటిశౌర్యము యీనాటి కెట్లంతరించెనో అడుగుమా ఆంజనేయా, ఒక్కనెలలోనే రాకున్న నీధర్మపత్ని ప్రాణములతో నీకుదక్కదని నిక్కమని నొక్కినొక్కి వక్కాణించి, ఓరిపుజైత్రా! వాయుపుత్రా! నానాధునితో జెప్పుము. మరువకుమా, రఘూద్వహా, నే నమాయకురాలిని;నన్ను దను జుండు చెరగొని తెచ్చినాడు. నన్నుబోలు సతులనేకమందిని హరించి బాధలపెట్టుచున్నాడు. అందరినీ విడిపించి దయతప్పక నన్ను పరిగ్రహింపుమా కంటిని అంగుళీయకము, కన్నుల పండువాయెననుము. నీపవిత్రగాధ హనుమంతునివల్ల వింటి ననుము. అబ్ధిదాటి రమ్మంటిననుము. మగటిమిజూచి నీవాల్గంటిని బ్రోవుమంటిననుము. ఆద్యంతమూ కరుణామయునితో చెప్పుమా యనెను.

ఆర్తత్రాణ పరాయణుడంచు, లోకారాధ్యుడంచు, యశఃస్ఫూర్తిని గ్రాలిన రాఘవుండంచు మేటులైనారక్షించి సత్కీర్తిని నిల్పుట రాజధర్మమనుమా! కీశోత్తమా, దానవులు ధూర్తాగ్రేసరు లనుచూబలికి, నాదుఃఖమును త్వరలో వారింపుమా. అగ్నిసాక్షిగా బెండ్లాడిన యిల్లాలిని బ్రోచుట ధర్మమనుము. ఆపదలనుబాపి, యబలలరక్షించి, ఖ్యాతిజెందుట

రాజనీతియనుము. జీవులహింసించి జీవించుదనుజుల దండించుటే వీరధర్మమనుము. ఆర్యధర్మము నిలుప నవతరించిన శూరుడు, అహితుల నణచుటే విహితమనుము. అక్కటా! సౌమిత్రిసి దూషించి అనుభవించిన యీశిక్ష యధికమనుము. అఖిల వానరవీరులు పుణ్యాత్ములని అభినుతించి యీజానకి మొక్కెననుము. ఏనాడు ఇందీవర శ్యాముని అమరసన్నుతనాముని సమర భీముని దర్శింతును; ఏనాడు భూనాయకుని వీరశిక్షాదక్షుని క్షీనవక్షుని దర్శింతును. ఏనాడు జ్ఞానాంబునిధిని యశస్సాంద్రుని భాస్కరకులేంద్రుని దర్శింతును. ఏనాడు నానాగుణాక్రాంతుని, ఆనతహనుమంతుని అరిక్రుతాంతుని దర్శింతును. ఏనాడుపవిత్ర సుత్రాముని, నిర్జితపరశురాముని, కమలభానుని దానవ వన కుశానుని దర్శింతును. ఏనాడు చిద్విలాసుని, ఘరోల్లాసుని, శ్రీనివాసుని దర్శింతును. ఎపుడు నా కాంతుని కనులారకాంతునో యని మొరవిడుచున్న దాననని హనుమా చెప్పుమా. దానిమ్మబీజములుబోలు దంతపంక్తి, చంద్రికలఁబోలు చిరునవ్వు, వన్నెతించి దృష్టిదోషములేకుండా ఎపుడు ఆగోవిందుని నృప కులేందుని కనుగొందునో? పూర్ణచంద్రుని నిరసించుమోము చక్కదనము వినుతింప శక్యమా! ఆహా! ఆగోవిందుని నేత్రాజితారవిందుని శ్రితబంధుని, నృపవరేందుని మెప్పుడుజూతును. అనిన యనిలసుతుడు మొక్కి, తల్లీ నీయవస్థనుగంటిని. లంకను గంటిని, రక్కసులఁగంటిని; అరిగివచ్చెదను. తడయక ఆన తిమ్మని కోరెను.

పవనసుతుండు, సీతయనుజ్ఞబడసి వారధిదాటి

—: వానరయోధుల గలియుట. :—

జలధి లంఘించి శ్రీరామచంద్రునిజూచి పలుకవలసిన విధాన పలుకకుండ, నీబాధలు కనులారా చూచియూ, ఓతల్లీ యాశ్రితకల్పవల్లి మిన్నకుందునా! అని హనుమంతుడు ఆజనని యనుజ్ఞనుబడసి నమస్కరించి ఆదనుజులజూచి నవ్వి తనతర్జనీ వేలునుజూపి, పక్షివలెనేయెగిరి వనధిదాటి వానరయోధుల అద్దరిని గని కంటి సజ్జనకజ లంకలోనయని చాగిలిమ్రొక్కి యారీతిగా వచించెను. జనని లంకలోన అశోకవనమునందు యిడుముల బొందుచున్నది. మరితడయుటకు వీలులేదు, రండు రండని లేపి మార్గంబునుబట్టి జరిగిన యుదంతమంతయూ సంగ్రహాముగా దెల్పెను.

—: వానరులు హనుమను కొనియాడుట. :—

బ్రతుకుజీవుడా యనుచూ బాష్పములు లోచనద్వయి స్రవింపగా, కార్యమును సాధించి ఖ్యాతిగాంచితివంచు వాయు నందనుని స్తుతించి, జలనిధినిదాటి శౌర్యముచూపించి జనని గాంచితివనుచూ, సంతసించి అచ్చట వృత్తాంతమాలించి యాశ్చర్య మభినయించి మమ్ముబ్రతికించితివి. పంపాపురమును తిరిగి జూడగల్గితిమి. అంగద జాంబవంతాది శూరులు సనుసరింప పంపకు పక్రిక పవనసుతుండు బయలువెడలెను. మార్గమున సుగ్రీవుని మధువనంబుగాంచి స్వేచ్ఛగా సంచరించి ఫలంబు లెల్లమెసంగి వనభటులనుదన్ని కపులెల్లరూ నిదురించిరి. కొంద

రంతట మేల్కాంచి అయ్యో! యిది సుగ్రీవునివనమే ఆలోచన లేకుండా సంచరించినామని పలుకగా జాంబవంతుడు భయపడ వద్దని అభయమొసగి ఇట్లనెను. జానకినిచూచి తిరిగి యేతెంచు నపుడు మధువనమున స్వేచ్ఛగా మసలవచ్చని సుగ్రీవు డాన తిచ్చెనుగాన ఓ వానరులారా! భీతిచెందవద్దని శలవిచ్చెను.

మధువనము ధ్వంసముచేసినవార్తవిని
— సుగ్రీవుడు సంతసించుట —

వనపాలకులు, ఆవనచరవిభునిజేరి ఓదేవా! వనచరులు వచ్చి వనమును ధ్వంసముచేసినసంగతి మనవిచేయగా యాతడు సంతసించి వసుధ శోధించి వానరులెల్ల ప్రభుకార్యము సాధించి వచ్చియుందురని సుగ్రీవుండు యోచించుచుండగా వానరుల ననుసరించి హనుమ యేతెంచెను. వచ్చినవారిని పరికించి, కార్యము నిర్విఘ్నముచేసుకొని వచ్చిరని వారిమోముతే చెప్పక చెప్పుచున్నవని సంతసించుచూ కపీంద్రుడు కార్యసిద్ధికి మెచ్చగా,

— సుగ్రీవునకు హనుమంతుని చర్యను అంగదుడు దెల్పుట —

అంగదుడు దరిజేరి యీరీతిని వచించెను. డాబుగా నున్న గాజురాళ్లెన్నియుండిననేమి, సమయమునకు ఒకనల్ల రాయి చాలదా? మేము నామమాత్రపేరులము కాని అనామధే యులము. ఈజగత్ప్రాణసుతుడు మాప్రాణముల నిలపినాడు. అనిలపుత్రుని అమోఘసాహసముచే ముప్పును తప్పించుకొం టిమి. తాను భూమిపుత్రి యునికిని కనుగొని, దనుజుల

యునికిపట్లు ధ్వంస మొనర్చి, వారిధిని దాటివచ్చెను, అనిన వానరనాథుడు అనిలతనూజుని కౌగిటజేర్చి ఓపావనీ! లోకపావనుడవనుచూ శత్రువులపట్టణముజొచ్చి, జానకిని పరికించి, పురమునుగాల్చి విరోధులగూల్చి, వననిధినిదాటి, యశఃకాముండవై వచ్చితివి, రామచంద్రుని మైత్రి సార్థకముచేయ గలుగుదునో లేదో యని, సంశయించితిని కార్యమేమౌనో యనుకుంటిని. ఓయనఘా! తుదకు మాటామాణిక్యమూ మనకుదక్కినవనెను.

— రాఘవునితో సుగ్రీవుడు, సీతాన్వేషణము దెల్పుట —

ఇట్లనుతించి, అర్కజుండు, హర్షసాగరమునదోగి వెంటనే రఘుపుంగవునొద్దకు, కపిసేనతోకలసి యేగి సర్వమునూ వినిపింపగా రఘువీరుడు, రాముడు సంతసించి, ఆయనిలజుని కౌగలించి అనేకవిధముల మెచ్చుకొనెను. అఖిలవానరుల నభినుతించి, రండని గూర్చుండ నియమించి పవనసుతునిగాంచి; శ్రీరామచంద్రుండు ఓపావనీ! నీవు నిజముగా లోకపావనుడవేయని పొగడెను.

అంతట జాంబవంతుడు, ఓయనఘాయని సమస్కరించి శ్రీకాంతుడవు నీకృపగన్నవాడు, జగన్నుతుండు వాడు భాస్వంతునిభంగి, అంతటనూ భాసిల్లును, దిగంతవిశ్రాంతయశము గాంచును, అనిశమూ ఓరాఘవా! సుఖించ గలడు. నీదయగలిగిన యాలోకమందు కనిష్ఠుడు, అనిష్టుడు

ఎవ్వఁడుండును. నీయాదరణచేత, విబుధసన్నుతుఁడై, విజయుం డగును. నీకరుణచే కృతార్థుండగును.

—( జాంబవంతుఁడు హనుమంతుని పరాక్రమము దెల్పుట )—

ఓదామోదరా! పురుషోత్తమా! రామా! నీకు నమస్కరించెదను. కార్యసిద్ధికి నీసంకల్పవిశేషమే మూలము. మా జన్మములు సార్థకముగా కార్యమీడేరెను. హనుమంతుఁడు నీ భక్తుఁడు. ఆర్ణవమును సర్వమూ తానేయని గ్రహించెను. జలనిధిదాటుటెట్లు? ఓజలరుహనాభా! రిపులు సంచలింప జానకినిగని, నెట్లు తిరిగివచ్చెనో, నేనెరుగజాలను. నీభక్తుండైన హనుమంతుఁడూ నీవుతక్క, అన్యులకెరుంగ శక్యమా? రఘునాయకా! శాశ్వతసుఖదాయకా! ఆతనితత్వమెట్టిదో, మహత్వమెట్టిదో, శౌర్యమెట్టిదో స్థయిర్యము ధైర్యము యెట్టిదో ఆతని భక్తి అద్భుతశక్తి యెట్టిదో యెరుంగుట నాతరము కాదు.

—( రాముండు హనుమను లంకావృత్తాంత మడుగుట )—

అనిన రాముండు ఆనందించి, పవనసుతుని కౌగిటంజేర్చి వార్ధినిదాటి లంక జొచ్చితివా? జంకులేక చొచ్చట సంచరించితివా? జనకజను గాంచితివా? దనుజవీరు లెట్టివారు? లంకాపురం బెట్టులుండును? జనకసుత క్షేమమేనా? హనుమంతా! ధీనిశాంతా, అఖిలవృత్తాంతము నాకు తెలియజేయుము. అనిన హనుమంతుఁడు కేలుగవమోడ్చి, ఓరామా! సంగ్రహ

శ్రీరాముని మనస్సునందుని నమస్కరించి, భక్తితో నిట్లనియెను.

—: జానకిని కంటినని శ్రీరామునితో పవనజుడు దెల్పుట. :-

కంటిని తల్లి నశోకవనంబులో రక్షకింపుగొలుపగంటిని. దానవవీరుల దర్పమణంగ గంటిని. ముక్కంటినిగొల్చెడు మనోగర్వాతీతుడు రావణుని గంటిని. సమస్తమును గంటిని. తుదకు లంకను పెన్మంటలకుగంటిని. అబ్ధిమధ్యమున త్రికూటంబను నగరము, అంబుజమువలె యెంతయో సొగసుమీరు కర్ణికారంబురీతి లంకాపురము అమరులకు నిక్కులో బల్లెమయి ఒప్పుచుండెను. సీతనే జూచి వచ్చితిని, కాని కాల్చి వచ్చితిని; లంకను సురలుపొగడ; రాక్షసులుబెగడ ఆలంకాపురము కాపురమునకు సుయోగ్యముగా నున్నది. మద్యమును త్రావి మత్స్యమాంసముల మెసగి, వావివరసలుచూడక పాపమనక స్త్రీపురుషులు స్వేచ్ఛగా సంచరింతురు. బహుపతివ్రతలచ్చోట పద్మముఖులు. భాగ్యవంతులు పాలకై, పేదవాడు గంజికై, పరితపించుచుందురచట. రావణుని రాజ్యవైభవము, ఆదిశేషునికైనా చెప్ప శక్యముకాదనెను. చూచి వర్ణించుట కాలంక యమపురంబు; కలిమి లేములకు కాపురంబని తోచుచుండును. అవనింగల సర్వవస్తుచయమును అపహరించి, భోగలాలసులై అనుభవింతురు. వారి భోగేచ్ఛకు అంతులేదు. సిరులెంత ప్రాప్తించినా తృప్తియనునది లేనేలేదు. రత్నములను, కాంతారత్నములను అక్కటా బలిమిని యపహరింతురు. ఆ

పురంబున పాపపుణ్యవిచార మెంత వెదకినా కన్పడదు. ఓయిన కులేంద్రా! అచ్చట గృహములు మేడలు, ఆలయములు ఎన్నెన్ని గలవో లెక్కింపవశము కాదు. అనిశమూ హర్మ్యము లను కట్టుచునేయుందురు రాజులసొమ్ము రాళ్ళపాలుకదా! దొరకు దొరకని ఉద్యోగులచట నుందురు. ధర్మమెటులుండునో దయ్యమెరుగు. దైత్యులకు ధర్మచింత ఆవగింజంతయైనా లేదు దేవ!

వ్యర్థజీవులు, కుటిలులు, స్వార్థపరులు, వేషధారులు, పరమత ద్వేషులు, నవనవవిలాస నాగరికులు, దైవదూరులు, క్రూరులు, ఆదను జవరులు. ఒరులను విశ్వసింపరు. పరోప కారము దలపోయరు. పరులకు మేలొనర్తుమనిపిల్చి, ఆత్మ దలంతురొండు స్వార్థతత్పరులు, ముష్కరులు; అవినీతిపరులు, సత్యమూ, శౌచమూ దానవులవద్ద వెతకినా కానరావు. అన్యు లకు ధర్మోపదేశములు చేయుటలో అంతటి మహానుభావులు జగతిలో లేరు. తమకు నష్టముకేకుంటే ధర్మపథమున జరింతురు. వీర్యమున; గాంభీర్యమున; శౌర్యమున; ధైర్యమున; ఔదార్య మున దానధర్మములను, దానవులబోలువారీ పుడమినిలేరు. ఐకమత్యముకలదుగాని, సత్యమించుకంతైన లేదు. జపతపం బులు కలవు; శౌచంబులేదు, దైవభక్తికలదు; భూతదయలేదు బుద్ధిగలదుగాని ఆత్మశుద్ధి లేనేలేదు. ఓ రామచంద్రప్రభో! మద్యపానమందు అత్యాసక్తి; మత్స్యమాంసభుక్తి న్యాయ మందు విరక్తి భోగానురక్తి పరకాంతాప్రవసక్తి దౌర్జన్యశక్తి

స్వభావోక్తి రాక్షసులకనెను. ఇలలో లంకాపురభాగ్యోన్నతి నలువకైనా వర్ణింపవశముకాదు. శతయోజన విస్తీర్ణము ఆసాధవాసిత నిర్మితములు, ఓరఘువంశపుంగవా యనెను. దశ శిరంబులు వింశతిభుజంబులు గల్గిన వీరవరుడు ఆపురంబేలు రావణుండు; ఏమనుజుండైనా చూచి భరింపజాలడు.

అసురవిభుచూడ శక్యంబా, అతని వేయికన్నులవాడు సేవింపవలయును. వీరసింహులనెల్ల గసిమసంగి వాడు మూడు లోకాలు జయించినాడు. వానియాగడ మేమనవచ్చును! పుడమిలో సంతటికలుషుండు పుట్టబోడు. వాని వధియించి ధర్మంబు నెలకొల్పవలయు ఆలశించుటకు వీలులేదు.

జానకి మనవిచేయమన్న పల్కులు రామునితో
—* పవనజుండు దెల్పుట *—

కనుదోయి కెందామరలుబోలి, వింతచెలువుమీర; వనపాలురకు కొంతవిశ్రాంతి కలిగింప, వృక్షపంక్తికినీరు వృద్ధి జెంద సంతాపసంపర్కమున, ముక్తాహారముడికి క్షోదంబుగాగ రణంబున చావనున్న రాక్షసకోటికి తర్పణజలముగా కాన్పింప చిక్కితిని రక్కసులకు అనుచూ పొక్కిపొక్కి చెక్కిటను చేయిజేర్చి జానకీదేవి వెక్కివెక్కి శ్రీరామచంద్రా, లక్ష్మణా యనుచు బాష్పధారలు విడుచుచుండెను. ఓ దేవా! నీవియోగ తాపమున, శరీరము శుష్కింపగా రావా, రాఘవా! నన్నాదవా! యనుచూ జానకి దివారాత్రములగుంది చింతావార్ధిని బడి మునుగుచున్నది. నిన్ను ధ్యానించుచూ కాలముగడఫు

చున్నది. ఆజగద్విదారివణుని, రావణుని, వేగముగా వారాశి దరించి గూల్పుము, యనియెను. ప్రాణవాయువు వెడలకుండ పాదయుగళి నేత్రములనుండి శోకభాష్పధారలు అనిశముగా ప్రవహించుచుండ, అవనిపుత్రి, నిన్ను ధ్యానించుచుండును. రామ, శ్రీరామ, రఘురామయనుచూ, యేడ్చియేడ్చి కనులు మోడ్చి నంస్మరించి పిమ్మట సౌమిత్రిం దలంచి ధరణిపుత్రి సర్వదా పరితపించుచుండును.

—* హనుమ శిరోమణిని రామునికిచ్చుట *—

భక్తితో నీకొసంగుమని ఆనవాలుగా తనశిరోమణి నాకిచ్చెను. సీత యెంతయేడ్చెనో ఆసమయమందు చెప్పజాలను. యినకులేంద్రాయనుచూ ఆమె నన్ను జూచి ధృతివహించి నిన్ను సంస్మరించి తలమానికము నాకొసంగుచూ కన్నీరు విడుచుచూ నల్దిక్కులంజూచి ఇట్లనెను. ఇక మీదికార్యమును బేర్కొనుమనెను.

అగ్నిసాక్షిగ పెండ్లాడిన యిల్లాలిని భర్త బ్రోచుట ధర్మమనుము. అబలలను, ఆపదనుండి తొలగించుట రాజనీతి యనుము. జీవహింస జేసి బ్రతికెడు దనుజుల దండించుటే వీర ధర్మమనుము. ఆర్యధర్మము నిలుప నవతరించిన దేవు డహితులద్రుంచుటే విహితమనుము. సౌమిత్రిని దూషించినందుకు యీ శిక్ష చాలుననుము. వానర ప్రముఖులందరిని అభినుతించెనవనుము. జనని దుఃఖమును తగ్గింపశక్యము కాదు. ఓ శ్రీనివాసా, చెప్పనంతుటయేలెన్న. ఉద్దవిడి నామెను తక్షణమే కాపాడవైతివేని యీజన్మలో పతిని

తిరిగి వీక్షింపజాలము రామాయనెను. ఓధరాతలేశ్వరా! రామచంద్రా! వార్ధిని శక్షణమేదాటి మనవానరసైన్య ముతో లంకకుజని సతిని బోధ్రిచకుంటే ఆఖలుండేచంపునో లేక ఆసతీమతల్లితనతనువును త్యజించునో! ఇదితధ్యము ర్వామచంద్రా. వెనుక తపించిన లాభమేమి; అవివేకమే యగునా రాఘవా! సామమున సామరస్యమున కార్యమును చక్కజేయంగ గడగెదేమొ దుర్జయులు, మదాంధులు, దుష్టులు సామమున నెంతమాత్రిమైనా చక్కబడదుసుమా. రాజీవాక్షుడు, మర్త్య లోకమున ధర్మము నిలుపగానెంచి అనేకరాక్షసుల దును మాడి వధింప యవతరించెను. ఓ దక్షకులాధీశ్వరా శ్రీరఘు రామచందు్రిడనగా నెంతటిమహానుభావుండో తెలుసుకో, నీకు గల బలజాడ్యంబున కన్నుగానకున్నావని తెల్లముగా బల్కితిని.

రావణుని శీఘ్రిముగా పరిమార్చుడని, రామునితో

—( వాయుసుతుండు బల్కుట )—

పదితలలవాడను, లోకైకబలుడను, చపరాక్ష్యండు పెక్కువరము లిచ్చెను, మృడునకు భక్తుండను, అని మిక్కిలి గర్వించిన దుర్జయుండు; వాడు సామమున, సాధ్యముకాడు. మేము సర్వమాంసభక్షకులము, దానవులను, మానవులుచంప గలరా, యనియూ ఇరువదిచేతులుగల బిరుదునుగని ఎవ్వ డోడించగలడు అని వాడు గర్వించుచుండును. సీతారమణీ రత్నము, యేడ్చుచూ, తనచిహ్నముగా శిరోరత్నంబిచ్చెను. ఓరఘూధ్వహా! గైకొనుము. నాపల్కులు కృపతో నాలించి

శీఘ్రముగా, రావణకుంభకర్ణరక్షస్సంఘములంగూల్చి లోక మందు ధర్మమును బాదుకొలుప రణసంరంభము ప్రారంభింపుము. అని అనిలాత్మజుండు పావనచూడామణిని, భక్తితో రామచంద్రున కొసంగిన రాముండు గైకొని అశ్రువులజార్చి దానిని తనహృదయము నందానుకొని అప్పుడు జనకజను జూచినట్లు కడుంగడు సంతసించి హనుమంతుని నుతించెను. జానకీదేవి యీమణిని అందిచ్చుతరి పల్కినమాటలను మాతో చెప్పినచో మాహృదయము చలించును, రాఘవా, వినిన సహింపనేరవు. దానవుల డెందములు తపింపగా వనధినిదాటి వానరులను యుద్ధమునకై పురిగొల్పుము. ఓకరుణానిధీ! నిన్ను నమ్మినవారికెన్నడైనా, ఆపద వచ్చునా? నీధైర్యమునకదా. సీతాదేవి, అసురవిభుపురిని జీవించియున్నది. వారధిదాటి, ధైర్యమున సతినిగాంచి, దనుజులగూల్చి, రావణునిగర్వ మడంచి, లంకాపురముగాల్చి, యీపావని పావనుండని ప్రస్తుతికెక్కితిని, ఇదంతయూ యెవని కృపాకటాక్షమున చేయగల్గితినో, వానిని భక్తితో మ్రొక్కెదను.

## —* శ్రీరాముడు హనుమంతుని శ్లాఘించుట ♦—

ఓ దేవవినుతా! త్రిగుణధామా! బలుండెవ్వరో బల హీనుండెవ్వడో నీమదినెల్లపుడూ అరయుచుందువు. జననమరణములకు నీ వేస్థానభూతుండవు అనిన ఓ వానరవీరసింహాయని బిలచి వానిపల్కులకు ఎనలేని ఆనంద మొంది ఓనిర్మలాత్మా నీఋణము దీర్పజాలననెను. ఇంకనూ నిట్లనెను. నీవు శోకాప

హారుండవు, లోకోప[illegible]ండవు, [illegible]వి, బ్రహ్మచారివి, యశోహారివి నిన్నెట్లు [illegible]నూ? ఓ[illegible]రితా, దేవమానవులందు, నీవంటి మహా[illegible]ము డెందునూ లేడు, ఓపరమపావనా, నీకు ప్రత్యు[illegible] వాంఛించెదనుగాక, ధర్మమార్గానురక్తినై ఆ[illegible] ధూర్తులయలవణించి వెలయు నినుబోలు సుజనుల పాదధూళి, నాయాదలను దాల్తును.

—॥ పవమానసుతుడు శ్రీరాముని ధ్యానించుట ॥—

అనిన రాముని పలుకులవిని, వినయముతో ఓవేదాధారా, యని వానిచరణంములంబడి, హనుమంతుడు భక్తితో నమస్కరించెను. భక్తిపరవశుండై తనపాదములపై వ్రాలిన హనుమంతుని యున్నతశిరమున, తనహస్తముంచి, యారఘూద్వహుండు నాశీర్వదించెను. ఓయిందువదనా, పార్వతీ; ఆ శ్రీవరుండు, భక్తుని లేవనెత్తి కౌగిటంజేర్చి, అతనితలను, తనబాష్పములచేత దడపెను. ఆహనుమంతు డెంతటి అదృష్ట వంతుడోనుమా, దివిజగంగ యెవ్వానిపాదములందు బుట్టి, నాశిరంబెక్కి ముజ్జగంబుల పావనంబొనర్చెనో, ఆ శ్రీనాధుని బాష్పధారలచే వీరాంజనేయుండు సుస్నాతుడాయెను.

ఓ లలినీ! ఆవాయుపుత్రుడెంతటి ఘనుడో, యెంతటి యదృష్టవంతుడో వినుతింప శక్యముకాదునుమా. ఓ పావనీ! వానిచరిత్రము, సాధుసన్మునిసన్నుత పావనము యనెను. రామచంద్రుడు యీహనుమంతుని ప్రస్తుతించి వాని బలసాహసము

లద్భుతములనుచూ, వానరవీరు లందరియెదుటను పల్కగా; వాయునందను డిట్లనియెను. తామిచ్చిన ముద్రికాప్రభావమున గంభీరమైన జలధిని గోష్పాదమనుచూ దాటగల్గితిని. నీముద్రికను గాంచి, జానకి నిన్ను గాంచినటుల శాంతించి సంతసించెను. జానకియొక్క శోకాగ్నియే సంవర్తపుఃజమై దనుజుల లంకాపురిని గాల్చెను. మానినీమణియొక్క శిరోమణి మహిమచేతనే అంబుధిని మరల దాటివచ్చితిని. ఓ రామప్రభో! నిన్నుగాంచి నీచే మన్ననల గాంచితిని. నేననగ నెంతవాడను. నీకృపలేకున్న వానరున కెంతబలము చేకూరునా మహాత్మా యనియెను. ఆకులలములతిని జీవించుచూ అడవినిబుట్టి అడవియందే సంచరించునట్టి వానరజాతికి నీకృపచే సద్యశము లోకమందు అలనుకొనుగాక యనగా—

సుగ్రీవుండు వానరులను యుద్ధమునకు
—♦ బయలు దేరుడని ఆజ్ఞాపించుట. ♦—

సుగ్రీవుండువిని, ఇనువుకిని అభినుతించి జయజయధ్వాన మొనర్చి ఓజానకీశా, కీశసంఘము బ్రతుకుపై నాశవిడిచియుద్ధమునకు సిద్ధముగా నున్నారు యనుచూ నీయాజ్ఞకై వేచియున్నాము రామా! పయనమునకై యానతిమ్మని ప్రార్థింపగా, శ్రీరాముండు యనుమతించిన దేవతలు సంతసించిరి. భూమి కంపింప, పర్వతములు చలింప, భూతములు సంభ్రమింప వనధిఘోషింప, మానులు ఆనందింప, బృందారకులు సంతసింప, మానవాలోక మాశ్చర్యమొందు, సూర్యచంద్రాదులు

ప్రకాశమతిశయింప, గరుడగంధర్వులామోదింప యక్షులు, కిన్నరులు అభినుతింప దిక్పాలురు యనుచుతింప హానుమనాహా వోత్సాహము మిన్నుముట్ట, సింహములభంగి గర్జించి సమర భేరి వాయించి, ఆ వానరవీరవరులు లంకకువెడల నమకట్టిన చోద్యముగా దిగ్గజంబులు సొమ్మసిల్లెను. దనుజవీరుల యుల్ల ములు తల్లడిల్లెను. ఢణఢణారావములతో శ్రీరామచంద్రుడు వానరదళము వెంటబెట్టుకొని కడలివైపు వెడలెను. రాముండు దండుతో పారావారాతీరంబున నిలచి, అంభోధివీక్షించి యీ జలరాశిని దాటవశమా యనుకొని లంకాద్వీపరాజ్యమునందు సంగ్రామ మెటులచేయునగునో, యని పరికించి శంకించి హాను మనుజూచి చిరునగవున వానరకోటినెదుట నిలచియుండగా, అనిలసుతుండు రామాజ్ఞకై నిరీక్షించుచుండెను. అచ్చట లం కలో నసురులంతా బెక్కువిధముల ముచ్చటించుచూ ఆంజ నేయుని బలపరాక్రమధైర్యములకు భీతినొంది సేవకుడే యిం తటిఘోరముచేయగా వానినాయకుండగు రాముడేతెంచి పురి నెట్లు గావించునో యనుకొనిరి. ఒకసేవకుండే యింతరాద్ధాంత మొనర్పగలిగిన వారియజమానిఁ యే మొనర్చునో! నరవానరు లంచు ఉపేక్షించిన కీడు చేకూరును. ఎట్టిశాత్రవున్నైనా, యెది రింపనగు బలము సంపాదింపవలయును. శత్రువు రాముడో, భీముడో, రాకాసో, దైవమో, దయ్యమో, దేవుడెరుగును. మనమంతాపోయి దానవ విభునకు నత్వరమే, అంతయూ నెరి గింపవలయునుకదా! యనుచూ, చెవిటివానిముందర శంఖ

మూ[illegible], రావణునితో [illegible] సంగ్రామమును చేయుచుండిరి.
పిమ్మట [illegible] [illegible], ఆమహారాణి
వారలతోడ [illegible] [illegible] [illegible] చేసెను.

—: మండోదరి, రావణునకు హితమును బోధించుట :—

ఓనాథా! దానవనాథా! నాపలుకు లాలింతువేని విజ్ఞానులు ప్రశంసింతురు ఆ శ్రీనాథుండు రఘురామచంద్రుడు సాక్షాత్ శ్రీమన్నారాయణుడుసుమా; అసురాధిపులు పెట్టినబాధలు ప్రజలు భరింపజాలమని దుఃఖింప నేను వైధవ్యంబును బొందుదును. ఆటిస్థితిని రానివ్వక, రాజ్యమును పాలింపుమా యని వేడెదు. జగంబులను సృష్టించి, పాలించి, ప్రళయమును నొందించునట్టి శ్రీరాముని ఆభగవంతుని ధిక్కరింపవచ్చునా, నాథా, యనుమువానరుం డొక్కడే వార్ధి దాటి, రామదూతన ని పల్కి రాక్షసులను వధించి, పురమును వల్లకాడుచేసి, నిర్భీతిగా మరలెనని అయినా, ఓనాథా, తలంపజనదా? బుద్ధిమంతుడవై మోహమును విడచి మూర్ఖతను త్యజించి రామునకు మ్రొక్కి నామాటను విశ్వసించి మానిని వానికొసంగి వేగరమ్ము లేకున్న ఆశకజిక్కి కులనాశన మొనర్చుకొందువు. కమల వనము హేమంతకాలమం దెట్లునశించునో జానకి నీవంశము నష్టనశింపజేయును. వేగమే జానకిని రామున కొసంగవేని ఓ దైత్యనాథా, మనకుహాని, తప్పదు. రామచంద్రుడు సంగ్రామభీముడు, ఆతండు కోదండమును బూనినేని, త్రిమూర్తులూవచ్చి నిన్ను కాపాడజాలరు. తగనిపోరువిడచి ధర్మ

మునుకోరుకొను, వేదవతి సీతయై భువినివెలసెను. ఆమాట నీవు మరచితివా నాథా! రాక్షసప్రాణమండూకములను ఆజిని రామ చంద్రుని బాణసర్పములు మ్రింగును. అనినవిని రావణుండు నవ్వి కాంతనుముద్దాడి, కౌగలించి, ఆడుదానికి, అబలయను మాట సార్థకంబయ్యెననుచూ వెలదికి పిరికితనము నైజముగా నుండుననెను.

— రావణుడు మండోదరికి ధైర్యము జెప్పుట —

వానరుడు నన్ను చంపగలడా, రాక్షసుల మ్రింగ రాళ్ళు నీటను తేలునా, నీవు బేలవుగనుక అట్లనుచుంటివి. తల్ల డిల్లకుమా. సప్తకులపర్వతములు, దిగ్గజములు కూలవా, చుక్కలు రాలవా, ధర్మి కంపింపదా? వానరులు మానవులు, దానవులను, మింగగలరా! దైవమట మానవుండై ధరణి కాపాడునట, విన్నవారున్న పలుకవచ్చునుగాని నాముందు యీరీతి పలుకనగునా, పొలతీ అంతఃపురమునకు పొమ్ము.

—: దైత్యేంద్రుడు మంత్రులతో ఆలోచించుట :—

ఇట్లని సతినిజూచి, నవ్వి వెంటనే సభనుజేరి దనుజ నాథుడు మంత్రులతో నిట్లనియెను. మనపురి ముట్టడింప మానవుండొచ్చునేని వానితో పోరునలుపక, మైత్రినికోరుదురా? ఒక్కకోతి వచ్చి చేసిన ఘోరము మీరంతా చూచినారుకదా, వాడొక మానవుని దోడ్కొనివచ్చి మనపురిని గెలువనెంచిన మనము శాంతింపవలెనా? వీరులు, ధర్మాత్ములు, అని సురా ధులు పృథ్విలో కీర్తిబొంది, లంకారాజ్య మభివృద్ధి బొందినది,

జయకాంక్షచే కన్నుగానకుండి రాముండను మానవుండొకడు అనుకుల చెండాడుటకు యేతెంచినవానితో వైరంబేటికి రాజ్యమప్పగించి మనము వెడలుట భావ్యంబా? హీనకులమున బుట్టిన కిరాతుండను వానరుం డొక్కడు అసురవర్యుల బింకమణంచి యేగెనుకదా, మానవుడే వచ్చినచో యెంతపని చేసునోయని ఓదానవవీరులారా, యోచింపుడు. యుద్ధమే చేయుదురో నమస్కరించెదరో స్థిరపర్చుకొనుడు.

దైత్యనాయకులు, వారి పరాక్రమములు దెల్పుచూ,
—* యుద్ధమే శరణ్యమని దెల్పుట *—

అనిన దైత్యనాయకులునవ్వి నరవానరులకు జడసి మనపురము ముట్టడించినచో మీానములుగల మనము నమస్కరించి ఊరకుందుమా?

అనివిని కుంభకర్ణుడు భయపడవద్దని యూవులించుచూ పక్కనవవ్వి, ధృతింజెందుడని యేమానవుండు నన్ను గెల్వగలసమర్థుడు లోకములన్ని జయించిన నన్ను యుద్ధంబున గెల్చువాడు లేడని, తనగృహంబునకేగి హాయిగా పరుండెను. నేను బల్లిదుడనని అందరిముందు పల్కనేల? మీారలు అనతిచ్చిన నరులందరినిచీల్చి, వానరుల వధించి బలవంతుడనగ యశంబుగాంతునని అతికాయుడు, అహంకరించుచూ పల్కెను. త్రిమూర్తులనణచు బల్లిదుడను, నేను లోకవిఖ్యాతిజెందిన వాడను. యీానరులను వానరులను, జయించుటనగా నాకొక వింతకార్యమా? అని యింద్రజిత్తు పలికెను. అంత కుంభ

కర్ణనిపుత్రులు కుంభి, నికుంభులు లేచి సురవర్యులు భీతిల్లగా; త్రిలోకములందు యశంబుగాంచితిమి. ఓ దానవనాయకా! మర్త్యమాతులను ఘోరముగా వధింతుమని పల్కిరి. అకంపనుడు లేచి, రెండుకన్నులుగల గండుమగ డెవ్వడు. భండనమున నన్ను ప్రతిఘటింపగలడని నవ్వుచూ పల్కెను. మహోదరుడు లేచి భువనములనెల్ల బొజ్జలో పెట్టుకొను నన్నుకొట్టగల దిట్టరి యెవండు మీరు ఓడకుండా నుండుడని తనకడుపు తడవుకొని పలికెను. దుర్ముఖుండులేచి పుడమింగల దుర్జయశాత్రవులకు నేను దుర్ముఖుండను. వైరుల దుర్మదం బణచెదను. భయము వలదనెను. ప్రహస్తుండులేచి నేను శస్త్రాస్త్రములబూని నిల్చిన అనలుపవైనా నన్ను వీక్షింపనగునా? చూచెదరుగాక యనెను. మకరాక్షుండు లేచి, నేను మదిరాక్షుండనై రణమున నిల్చెద నేని ఆరాముడు భీతిల్లుచూ హనుమతో కలసి పారిపోడా? సురలా, కింపురుషులా, కిన్నరులా, గంధర్వులా, యక్షులా, యీనరవానరుల జయించుటనగా నెంత దానవనాధా? యనెను.

ఓ దానవనాధా! విను డొందుపాయంబుగలదు. నేను విప్రవేషధారినై దాశరధుల గౌరవపురస్సరముగా విందుజేసి, బావావుల విరచిగట్టి సంహరించెదను. ఈపని మీాక్షేమా అనుచూ మకరాక్షుడు అసురవిభుని మన్ననలబొంది గర్వించి, వారినదుపాయముల ననుమతించి అందరూ సంతసించిరి. అమాత్యుడు, వైద్యుడు, దేశికుడు, భూతభేషుడు, రోగి, యిచ్ఛకము

లాడి, ప్రియములుపలికి మెప్పులిచ్చి తమశిష్యుని శీఘ్రముగా నశింపజేతురు.

—♦ విభీషణుడు రక్షోవిభుని సభకేతెంచి నీతులు దెల్పుట ♦—

అంతట విభీషణుడు సభాస్థలమున కేగుదెంచి రావణునికలసి దనయాసనమున గూర్చుండగా, నసురనాధుండు, యతనిని కాబోవు కార్యముగూర్చి ప్రశ్నింపగా యిట్లనెను. ఓయన్నా! నీవెరుగని ధర్మము లేమున్నవి. చైత్యకోటి కన్ని విధములా నీవు పెద్దవు. నీకు తెలియని వివేకము నేను వచింప గలవాడనా? మహాత్ములా, ధర్మమార్గమునను సరించెడి వాడు శుభంబులబొందును. నీబుద్ధి తదన్యమార్గమున బోవ కుండిన భీతియెందుకు? సర్వకాలములబల్కు సత్యంబే తల్లి, సుజ్ఞానమే తండ్రి, ధర్మమే తోబుట్టువు, దయయే సఖుండు; శాంతమే భార్య, క్షమయే సుతుడు, త్యాగమే వేల్పు పుణ్యమే పోషకుండు, ఇంక అహంకారమే వైరి, ఓశంకరభక్తా! విజితరాజన్యా!నీవెరుంగనితత్వము నేను వచించునంతటివాడనా? నీవు సర్వమెరింగిన పండితుడవు. సత్యము మూర్తీభవించు నట్లు అన్యులూహింప సత్యమును నటింతురు. యద్దృశ్యం, తన్నశ్యం యనుచూ, సతతమూ అనృతములాడువారు, ఒక వంకదయ, వేరొకవంక హింస చూపుచూ, ప్రియ, పరుష ములజూపువారు ధనము నాకర్షించి, దానముచేసి, వ్యయం బొనరించువారు, ధనమే దైవమని మోహామున మునుగు వారు, ధర్మమును నాశనమొనర్చి ధనమునార్జించువారు,

ఓదానవచక్రవర్తీ! వేశ్యకున్నూ రాజనీతికిన్నీ భేదములేదు అనెదవా? ఆస్తులరక్షించి కీర్తిగొన్నవాడే, పరమేశ్వరుం డంతటివాడు, ఆపద కష్టపడినవాడే పాణమిత్రుఁడు వారి దర్శిమప్పుడు కనిపెట్టగల్గినవాడు బంధూత్తముండు అన్నమో రామచంద్రా యనువాని కన్నమిచ్చినవాడు, దాతయనం బడును. తన దేశంబున ధర్మము నాలుగుపాళ్ళను నడిపించు యనఘుడే నాయకుండు, ధర్మవిరుద్ధమున నడచువాడొకధరణి విభుడా? యని పుణ్యాత్ములైన సాధువులులేరా? లేకేమి? అతిదుఃఖభాజనులైరి. ఘనవిద్వాంసులులేరా? లేకేమి? అతిమత్సరగ్రస్తులైరి. దానధర్మములు సేయు దాతలులేరా? లేకేమి? సేవానుకూలులైరె చెడిరిగాక, ఇల ఖ్యాతిగాంచిన రాజులులేరా? లేకేమి? అన్యాయవర్తనులైరిగాక చక్క దనమున బెంపెక్కుసతులులేరా! లేకేమి? పతులవంచించిమెలం గువారుగాక, ఓదితిజనాథా! నీరాజ్యముయొక్క సొంపు వర్ణనాతీతము. మదిని దలంపుము యనెను. ఓయగ్రజా! కామక్రోధాదులు మదిని వికారమునుజెందించి అప్పటప్పట వివే కము కల్గించుచుండును. ఉద్దామబలుండనంచూ, పరదార ధనంబుల తస్కరించిన క్షేమముచేకూరదనుమా! సకల జీవులసృష్టించి చక్కజేయు ప్రభువరేణ్యుని నిరసించి ప్రతిఘ టించువాని కెన్నడైనా జయముచేకూరదు. ఓదనుజనాథా! యహంకార మేరికినీ తగదు. సద్గతి, యశము, శుభములు, సౌఖ్యములు బడయగోరిన భాద్రపద శుద్ధచవితిచంద్రునివలెనే

పరసతిని చూడవలయును. కామక్రోధములు క్షేమంబు కోరవు గాన చిత్తంబున శ్రీరాముని సేవింపుము. ఆతడు సామాన్యుండని అనిలో చావకు. ప్రార్థనలు ఆలింపను భక్తులను పాలింపను, పాపులను దూలింపను పాడిని నిలుడను, దుష్టులను శిక్షింపను, శిష్టులను రక్షింపను గో, బ్రాహ్మణ, అమర కోటుల పోషింపను, వృద్ధులను కాపాడను, సిద్ధులను ఉద్ధరింపను, మనుజులను దనియింపను, దనుజులను వధింపను, పాషండులను సంహారింపను, ఆయనంతుడు, అజుడు అచ్యుతుడు శ్రీరామావతారుండై ఉద్భవించెను. ఓరాక్షసేంద్రా! విశ్వసింపక యీవిశ్వంబే శాశ్వతమని దలంచిన తప్పక చెడుదువనెను. ఆవినతార్తిహరుండైన రాముని వినయమున భక్తితో భజించి, వేగమే జనకజను అర్పింపుము. ఓయసురవరేణ్యా! భువిలో సుఖింపవచ్చును. నేను పాపాత్ముండను పశ్చాత్తాపమొందితిని. నిన్ను దర్శించితిని. ఓ శ్రీపాలకా! గోపాలకా! నన్ను కరుణతో కాపాడుమనిన, నిన్ను తప్పకుండా బ్రోచును. సగుణుడై వెలసిన శౌరినిగొలచి తాపత్రయాగ్ని చల్లార్చుకోక, బుద్ధినిగోల్పోతివి. వ్యామోహమును విడువుము. ఇట్టితరుణము మరల నీకు చిక్కదనెను. ఈరహస్యమును నీ కెరిగింపుమని పులస్త్యఋషి నాకు కబురంపెను. దురభిమానమును విడచి మాధవుని గొలువుము. నామాటవినుము.

మాల్యవంతుడు రావణునకు ఆహవము కూడదని

—॥ సలహానిచ్చుట ॥—

అనవిని మాల్యవంతుడు మతిమంతుడు వృద్ధమంత్రి యిట్లనియెను. ఓప్రభో! విభీషణుండు అనృతంబాడడు,

యథార్థవాది; రఘూద్వహుండు దైవసముడు అటుల కాదని అహంకారమూనకుము. నీవద్ద భయంబున నీమంత్రులు నిక్కము బల్కలేక యిచ్చకములాడుచున్నారు. అయ్యది గ్రహించి ఓయసురనాథా! ఆహవోద్యోగము, త్యజింపుమనెను. అనిన ఉగ్రుడై లేచి బొదలలనూచి యాగబిగించి ఇరువుర వైపుజూచి యిట్టిమూర్ఖపుపలుకుల నాడుదురా యనుచూ అసురనాథుడు దూషించెను. ఓమంత్రివరులారా! వీరల మనస్సులు విషమయంబాయెను. గనుక వెంటనే వీరల వెడల గొట్టుమనిన మాల్యవంతుడులేచి అచ్చట నిల్వదగదని, నిర్గమించెను.

విభీషణుడు సీతను రామునికర్పింపుమనిన సురారి
—♦ తమ్ముని తన్నుచూ గెంటివేయుట ♦—

పిదప విభీషణుడు లేచి ఓదైత్యనాయకా! అసురవీరుల మాటలను విశ్వసించి, యాపద తెచ్చిపెట్టుకుంటూయున్నావు. నిజమును పల్కుచున్నాను వినుము. నీవు సీతనుకాదు మృత్యు దేవతనే తెచ్చితివి. ఆరఘురాముండు మాధవుండని యెరుంగకయున్నావు. ప్రతిమానసంబున కుమతి సుమతులు, యుండును. కుమతి విధిప్రేరణంబున సుమతిని పారద్రోలి నీమానసము పూర్తిగా నాక్రమించెను. ధర్మమునకు, నీమానసమున తావేలేదు. సీతయను మహామార్యని నీసీమయందు తెచ్చిపెట్టుకుంటివి వలదని యెంతిజెప్పినా, వినకున్నావు, తప్పక

చెడదేవ్రుగునరా! వేగముగా రామునకు సీతనప్పించి రమ్ము సోదరా! పండిత వాక్యములబలిక్న విభీషణునిజూచి, భళిరా "యుపదేష్టా" యని, గట్టిగా తన్ని పరిహసింపగా యతడు అసురవిభుని బ్రతిమాలుకొని శాంతించి వలదువలదంచు, పాడిదలపుమనుచూ, బ్రతిమాలినకొలదీ ఆగ్రహించి తన యురంబువదన్ని త్వరగా వెడలుమనుచూ తమ్ముని సభనుండి గెంటించివేసెను. పిమ్మట ఓవక్రితరక్షీ యని సంబో ధించి నియత్ మార్గమున కేగి, నీకు పోగాల మాసన్నము య్యె ననుచూ, వెడలెను. కోతులు చెలంగి, నిన్ను శిక్షించి నీరక్త మును గండూషించెడు సమయంబాసన్నమాయెను. ఇక నిన్నె వ్వండు కాపాడగలడో చూతువుగాక. అనిలో శ్రీరాముని హరియో, లేక నరుండో, చూతువుగదా? ఆతడు సామాన్య రాజన్యుడో లేక, దుష్టసంహారుడో తెల్లంబగును. రాముం డెవ్వడో, నీయుంతరంగమెరుగును. రక్తమెట్టిదో సంగ్రామ రంగమెరుగును. సమరమున ఒక్క త్రుటిలోన జచ్చిపడి సుతుల చుట్టాల జూచెదవు. అని నచించి, విభీషణుండు, అంతరించగా, రాజ్యలక్ష్మీసహితమూ అంతరించిపోయెను. అంత రావణుండు నగముచచ్చినవిధాన శోకవ్యసునుడిగి మాౖని వడిచూచుచుండెను. పిమ్మట విభీషణుండు భళీ యనుచూ ధన్యుండనైతిని యీ ఖలుల సంపర్కమును దప్పించి, నన్ను విధాత బ్రోచెననిపల్కి, యాతనిఋణంబు యెట్లుతీర్చగల నంచు ఆజలజాతాక్షుండు రామచంద్రుని పాదంబులంగొల్చి

మోహంబుద్రుంచి శారీరమునుమరచి బ్రహ్మానందమునుబొం దెను. రాత్రినినాతిగానొనర్చి ఖ్యాతినిజెందినపాదకంజంబుల నేరీతిని గొలిచెదనో! నాతనువు, యిలలో పావనంబెట్లగునో యనెను.

బలవంతులని బ్రిఖ్యాతిగాంచి, జనకమహారాజుచే పూజ లను బడసి దండకారణ్యంబు చక్కబెట్టి కాంచనకురంగ కప టము బయటబెట్టు పాదుకలనొసగి భరతుని ధన్యునొనర్చి మునుల సాధుల సజ్జనుల వినుతిగొన్న శ్రీరామచంద్రుని పాదదర్శనము జేసెడి మహాభాగ్యమబ్బెను. గామక్రోధలోభా దుల బాధలణగును. హృదయపరితాపము చల్లారెను. అభ్యు దయ మొదవెను. అని తలంచుచూ తృటిలోన సముద్రమును దాటి రామచంద్రుని దర్శింప శీఘ్రముగ వెడలెను. అసుర నాథుడు పంపిన దూతయనుకొని ఆభక్తాగ్రేసరుని వానరులు నిరోధించిరి.

## సుగ్రీవుడు విభీషణుని నమ్మవద్దని శ్రీ రామునితో

## —॥ వి న్న విం చు ట ॥—

ఆతని వృత్తాంతమంతయూవిని వానరేంద్రుడు సుగ్రీ వుడు శ్రీరాముని పజ్జనువేచి ఓయనఘా! భవదీయదర్శనార్థమై అసురనాథుని సోదరుండొకడు వచ్చి కాచియున్నాడు. అనిన విని యాతనిగాంచి నీతలంపేమనియడిగి యతని బంధింపవల దనియూ మిత్రునిగా చేరదీయవలెననియూ చెప్పి నీయభిప్రాయ మేమనిన నాతడిట్లనియెను. దానవులమాయ లెరుంగ యా ధాతకునైన తరంబుగాదు. భూజానులు, శత్రుపక్షజనసంగతి

గలిగినవాని మనంబున అనుమానించి నమ్మరు. ఇతడు సాధు రూపమున వచ్చెనని తలంచెదననెను. ఇంతకూ యీ కామ రూపులు హంతకులని ఆక్ష్యేపించరు. ఆదానవుడు అంగదున కున్నూ నాకున్నూ వైరముకల్పించి భేదింప నేతెంచినట్లు నే నూహింతునని సుగ్రీవుడు బలికెను. ఓ రామచంద్రా! యీతని బాధింప నవసరమని తలంచెదననిన, సుగ్రీవా! శాస్త్రమట్లు చెప్పుచున్నది, కాని నాచెప్పు వినుమనెను.

## శ్రీరాముడు శరణాగతుని రక్షింతునని సుగ్రీవునితో దెల్పుట

శరణాగతుని కరుణాంతఃకరణంబున బ్రోవవలయును కదా; నేనావిధాన ప్రతిజ్ఞను చేసియుంటిని గనుక కరణీయం బెట్టిదైనా యీతనిగాచెదను యనెను. రావణుండు నాకు శత్రువే, ఆతడే తెంచినా, ప్రాణబంధువువలెనే అభయంబిత్తును. శరణుశరణంచు శత్రువువచ్చినా ఆప్తబంధువుగానెంచి, వాని నాదరింతును. బ్రహ్మహత్యాది ఘోరపాపముల జేయువాడు వచ్చి శరణన్న వానిని కాపాడుదును. నన్ను రక్షింపుడని వచ్చినవాని కభయమియ్యక బంధింపతగదు మనకు. శత్రువు డైనా శరణనివచ్చినచో వానిని విడనాడుట పాపము. బహు జన్మార్జిత పాపములనైనా హరింపగల భక్తపోషకుండను. కప టాత్ములు నన్ను కనుగొనలేరు. మలినవాసన లేనివారే నన్ను గాంచగలరు. రావణునిపంపున భేదింపవచ్చునేని దైత్యులంద రిని త్రుటిలోన సంహారించి జయముచేకూర్ప నొక్క లక్ష్మణుడే

చాలును. "సంశయాత్మా వినశ్యతి" గాన ఆదనుజవరుని వేగమే తోడ్కొనిరమ్ము యనెను.

వానరేశ్వరుడు విభీషణునితోడ్తేగా, శ్రీరాముని ప్రార్థించుట.

ఆవెంటనే అర్కసుతుడు రామునకు మ్రొక్కి శీఘ్రముగాచని అసురవంశ విభీషణుడనగనొప్పు నవ్విభీషణుని దోడ్కొని యరుగుదెంచెను. ఓ రవివంశమండనా, శివచాపఖండనా, సురనుతభండనా, శరణు, ఆశ్రితావనలోల, యవనతగోపాల, సద్గుణమణిజాల శరణు, వేదసంభావణా శాంతివిభూషణా, శరణు, నరలోకపావనా, వరధర్మజీవనా, శరణాగతావనా, శరణు, పరిణతభార్గవరామా, భూవరలలామా, సగుణనిర్గుణధామా, దుర్జనవిరామా! జానకీరామా! నిష్కామా! సమరభీమా! సచ్చిదానందా! శరణు. ధరణిభారము సణంచి ధర్మముస్థాపించునట్టి, యవతారమెత్తిన యంబుజాక్షా! నిర్గుణబ్రహ్మంబై నెగడు మానవాకృతింజెందిన ఆదిదేవా! గోబ్రాహ్మణామరకోటిని కాపాడ బుట్టిన సచ్చరిత్రా! జీవుల హింసించి జీవించుఖలులను శిక్షింపబుట్టిన శ్రీనివాసా! శత్రుపక్షమును బాసి నీచరణములాశ్రయింప వచ్చినాడను. అచ్యుతా! గోవిందా! హరీ! ముకుందా! రామా! వైకుంఠధామా! సంగ్రామభీమా! నన్నాదరింపుము. నేను రాక్షసవంశసంభవుడను రావణుని తమ్ముడను, నీప్రేమయనెడుభిక్షను గోరివచ్చిన విభీషణుడనుకరుణింపుమయ్యా, పద్మాక్షుని పాదపద్మములమనంబుననిల్పి; ఓజగద్రక్షకా! నీపావనపదంబులగొల్వగావచ్చితినని వెను. పాపాత్ముండను, పాపసంభవుడను, లోభక్రోధమోహాది సం

తాపాగ్నిని, శలభంబుమాడ్కి, తప్పుండైతిని. నన్ను కాపాడగల యాదిదేవుడవు, నిష్కామకుండవు. ఓరాఘవరామా! నీభక్తుండను, నీపాదంబుల నాశ్రయించితిని; కృపతో నీభక్తుని రక్షింపుమాయని ప్రార్థించెను. ఇట్లు వినుతించి అసురవరుడు దండము విధాన పాదములపై నిబడిన, రాముండు భక్తుని యాదరించి, కౌగిటను జేర్చి, అఖిలలోకములవారు సంతసింప కనుదమ్ములనువిచ్చి కరుణారసమున రాజిల్లు కమలనేత్రము లనుజూచి, పరిపూర్ణ చంద్రుని పరిహాసింపగజాలు సుప్రసన్న ముఖంబు సొంపుజూచి, అనిశంబు భక్తుల గాపాడనోపు నా జానుబాహువులజూచి విజయలక్ష్మికి సింహపీఠికచందమున కన్పడే వక్షమునుజూచి సుందరంబైన కనకాంబరంబుతోడ గ్రాలు కోమలశ్యామలాంగంబుజూచి, ఆవిభీషణుండు మెచ్చుకొని అత్యంతభక్తితో, నెంతయో ప్రస్తుతించెను.

—* శ్రీరాముడు విభీషణునకు అభయంబిచ్చుట *—

ఓవిభీషణా! అసురాన్వయభూషణా! నీకు నీప్రజలకు క్షేమమా! కపటాత్ముల సంఘమందహర్నిశమునూ వశించి, యేవిధాన నిల్చితివో; నీమనంబు నీవశమున నుండునా? లోకమున నద్యశంబు గాంచినాడవు. దుర్జనులుండుచోట నివశించుటకంటే యమపురిని నివాసముండుటే శ్రేయము. దుష్టుల మధ్య నొక్కక్షణమైనా నుండరాదు. నీవింతదనుక లంకలో నెట్లుంటివోసుమా?

—* విభీషణుడు రామచంద్రుని వేడుకొనుట *—

యనిన విభీషణుండు రామునకు మ్రొక్కి ఓయనఘా! నీదర్శనప్రాప్తివలన అఖిలసౌఖ్యపదవులగొంటిని, సకలపాప

ముల గాంచితిని, ధన్యుండనైతిని. నిన్ను మనసారగొల్వని తుచ్ఛజీవికి సుఖమెట్లు చేకూరును? కామక్రోధాదులు ఆవ రించి అభిమానము, మత్సరము, నెగ్గనగా సంసరణకూప మునందు అజానలను, పడద్రోలును. ఆత్మలో నీవు నివశిం చునంతవరకూ, కామలోభాదిబాధలు కలుగబోవు. చిత్తంబు అజ్ఞానవశంబైనచో, పాపకౌశికవాహితము, బయలువెడలును. పతితపావనంబై పరిఢవిల్లిన దివ్యపదములగొల్వు భాగ్యము నాకబ్బెను. చిత్కళలగాహిలు వదనంబుదర్శించి ధన్యుండ నైతిని. తాపత్రియానల తాపంబుచల్లారి భయశోకములు పోయి, భావమలరెను. నీకటాక్షంబున, అనేక జన్మార్జిత పాపసంచయము అణగెను. నేను నీచకర్ముండనై రాక్షస జన్మనెత్తినను, నన్ను కాపాడదలంచి కౌగలించితివి. ఓరఘు వీరా! కలుషదూరా! ప్రణతపాన్మంతా! జానకీప్రాణకాంతా! యని వేడుకొనెను.

### శ్రీరాముడు విభీషణునకు లంకారాజ్య మొసంగ

—(నభయమొసంగుట *—

అనిన శ్రీరాముండు, విని దనుజోత్తమునిజూచి, నీ ధర్మపరివర్తమునకు మనంబున నెంతయో నలరితిని యని ప్రీతితోనిట్లనియెను. వినుమా ఓవిభీషణా!నానైజము కాకభుశుం డికీ హరునకూ వేద్యము. నన్ను ప్రార్థించి గొల్చినవాని కెట్టి హానియూ నుండజాలదు. ఎట్టిద్రోహిఅయినావరే తనచిత్తమున భక్తితో నన్ను భజించినచో సన్మార్గవర్తుడై సుఖియై జీవించ గలడు. జీవహింసచేయు పాపాత్ముండు నన్నుదలంచి పశ్చాత్తా

పతి పుడైనచో కామాదిశత్రువర్గమును జయించిన వానిని నేను సాధువుగా నొనర్తును. సర్వమును త్యజించి నన్నే శరణుజొచ్చిన వాడు సాధువై సమునక్తిలియగును. నిష్కామియై ధర్మనిరతిని వర్తించిన సద్యశంబుగాంచి బ్రహ్మమునేనమి సగుణరూప మును ధ్యానించి, నిర్గుణంబును మనమున నెగడ బ్రాహ్మణో త్తముల నాదరించిన భక్తుండు నాకు ప్రాణప్రియుండని నమ్ముము, యని అఖిలసుగుణ సంపన్నుడ వగుదువు, నాదు బ్రాణసముడవు నాదుదర్శనము నీకుఅమోఘము. నీకు లంకా రాజ్యం బొసంగుచున్నాను, లంకాధినాధుండవై యలరుము. అనుచూ వానరులజూచి హనుమనుజూచి అబ్ధిజలమును తెండని యానతిచ్చెను. వెంటనే వానరులు ఆజలమును తెచ్చినంతనే రామచంద్రుడు తక్షణమే లేచి ఘొల్లుగా దేవదుందుభులు మోగుచుండగా, కమ్మనితావిగల పూలవాన యెనలేనితావు లను గుప్పున కుమ్మరింప, సముద్రజలంబుబూని రావణునిజంపె దను, రాజ్యమును నీకొసంగెదనుయనుచూ విభీషణునియభి షేక మొనర్చెను. తన దశశిరంబులు తెగి రాలిపోవునట్లు ప్రార్థింపగా యాదిగంబరుడు శంభుడు రావణునకు సంపద లొసంగెను. రామునకు విభీషణుడు అభయమిమ్మన్న మాత్రాన వానికి లంకారాజ్యమిచ్చెను. లోతును, వెడల్పును తెలియజాలని భవవార్ధివిధాన దోచు చున్న దీనముద్రము. దీనిని దాటుటకు అపాయములేని ఉపా యము కలదేని చెప్పుడనుచూ ఓ వానరవీరులారా! పరవీర భయంకరులారా! యాతీరమందు కాలముగడుపుటయే కష్ట

సాధ్యముగా నుండునుగదా? అనిన విభీషణుం డిట్లనియెను. ఓ రాఘవరామా! నీబాణ మమోఘము. నిమిషమాత్రాన సముద్ర మింకింపజేయుండని సలహానిచ్చి అయినా ముందుగా సముద్రుని ప్రార్థించుట అత్యుత్తమముకదా? అనిన విని అర్కకులుండు మేలు మేలని సముద్రుండు మనకు దారియొసంగు నేని వైరంబు మనకేలయనుచూ నుండిన లక్ష్మణుడు కోపించి యిట్లనియెను. దైవము నేనమ్మి యత్నమును విరమించుట అలసుల స్వభావము.

లక్ష్మణుడు సముద్రమును యింకింపజేతునని బాణమెత్తగా

—॥ శ్రీరాముండు వలదనుట. ॥—

ఈ యంబోధియనంగ నెంత, ఒక్కబాణముననే నుక్కడక్కవచ్చును. ప్రయత్నింపగా కానేరవి కార్యము యీభూలోకమున గలదా యనెను. ఓ సౌమిత్రీ! నీవన్నట్లే యగునుగాని భావమున కొంత శాంతింపవలెను యనుచూ రాముండు లేచి, దర్భాసనముపరచి కూర్చుండి, వారినిధిని ప్రార్థించెను. అట్లు ప్రార్థించుచుండగా విభీషణుండు వానరాకృతిదాల్చిన దైత్యుం డొకనిని రావణునియాజ్ఞచే నచటికివచ్చినట్టివానిని రాముని చెంతకు తోడ్కొనివచ్చెను. అంత సుగ్రీవుడచటి కరుగుదెంచి, రావణుని దూతవాయుని వానినిబట్టి నాశికాశ్రవణములను ద్రుంపుడని వానరులను బిలచి యానతిచ్చెను.

లంకనుండి వచ్చినదూతకు లక్ష్మణుండు

—॥ ఉత్తరంబిచ్చి పంపివేయుట. ॥—

దూత నీరీతి బాధింప దోసమగును. రాఘవునితోడు నాశికాశ్రవణములను ఛేదింపకుడు. నమస్కారము లొన

ర్తును. అని యాపైత్ర్యంచు ప్రతిపూలుకొనిన లక్ష్మణుడువచ్చి విడిపించి లంక కేగి రాక్షస రేని కీయు త్తరంబిమ్మనియని యతని కిచ్చి వెడలుమని మూతను విడిచిపుచ్చెను. ప్రతికితి దైవమా యని రాముని లోదలంచి నేను మతిపోడి వచ్చితినని మాటి మాటికీ నొచ్చుకొనుచూ ఆదితిజవరేణ్యునిజేరి వెనుదీయక యచ్చటివార్తలెల్ల నద్భుతముగా జెప్పెను. తనతోడి సురారు లెల్ల తల్లడిల్లగా వినిపించెను.

రావణుండు శుకసారణుని శ్రీరాముని
—♦ యుద్ధప్రయత్నములు చెప్పుమనుట. ♦—

ఓరీ! శుకసారణా! రాముని యుద్ధప్రియత్నము లెట్లు న్నవో దెలుపుము. వైరులు వారిధి నెట్లుదాటుటకు సంభా వించుచుండిరో చెప్పుము. ఆరాముని నీవుచూచితివా? పలు కుము. వానితమ్మునికి క్షేమమా? ఆనాడు మన లంకాపట్టణ మును గాల్చిన పాపాత్ముండచ్చట కనబడెనా? వైరుల నెట్లు చూచినావు? వానరు లెంత సైన్యమున్నది? ఆరామచంద్రు డేపాటి బలాఢ్యుడు? వానితమ్ముడుకూడ వీరుండేనా? చెప్ప వేమిరా? నోరు కదల్పలేవా? అచ్చటనిన్ను న్యూనతగాజూచిన అంతయూ చెప్పుమనెను. నా తేజోబలసంపదలు వారికి చెప్పి తివా? నాతో పోరాడగల వీరుండగలడా? ఆమానవులేవో కొన్నినీతులు నీకుజెప్పి పంపివేశిరా? నీహృదయము తల్లడిల్లి నదా? రిపులు నిన్నుగాని శిక్షించి పంపివేసిరా? నిజము చెప్పుము యనెను. అనఁ గని, నేను ఓ లంకానాయకా! నుము. అచ్చటి వృత్తాంతమంతా కనిపెట్టితిని. వానరుల

మాటయుండనివ్వండి. నాపలుకువినుము. రాముండు మానవుడు కాడు. మాధవుండనెను.

శుకసారణుండు రావణునకు రాముని మహిమనుదెల్పి

— ♦ యుద్ధమువలదనుట ♦—

గరుడ గంధర్వ యక్షుల సురల జయించితివి. ఓరాజ వర్యా! అయినా సత్యముపలుకుచున్నాను వినుము. నీహితము కొరకు యిచ్చకములు బలుకజాలననెను. ఓ లంకేశా, శంకా తంకమునేల? యుద్ధమున నిన్నుగెలచి నీబింకపొంకములు నిర్మూలమొనరించి ఆపంకజాక్షుడు నీసోదరుండైన విభీషణు నకు పట్టముంగట్టునుసుమీ. ఇంక లంకారాజ్యము మాటయే మరచిపొమ్ము. అబ్ధిజలంబుతో విభీషణుని అభిషేకంబుచేసి, అప్పుడే పట్టాభిషేక మొనర్చెను. ఇంతవరకూ అచ్చటచేరి యున్న సైన్య మింతింతయని చెప్పనలవికాదు. ఆ శ్రీవిభుండు ఆవానరులకెల్ల యుద్ధపద్ధతుల నేర్పి, యోధవరులజేసెను. లం కను కాల్చిన హనుమంతుడు అచ్చటనున్న వానరులకంటె బల మందు స్వల్పుడుసుమా. శ్రీనివాసుని కృపచేత స్వల్పవానరు డైనా మహావీరుండై వరిఢవిల్లెను. శతసహస్ర గజాది పంచాన నములను ఒక్కవానరుండు వధింపగలడు. ద్వివిద, దధిముఖ, నల, నీల, వికట, మైంద, కుముద, కేసరి, గజ, గవాక్షులు, అమితబలాఢ్యులు. అర్కసుతుని యానతిని వీరు జనదాటరు. ఆహవమున వారలకు సమానులులేరు. అంగదుడు, జాంబవం తుడు, అనిలసుతుడు యావానరసైన్యమును నడుపుచుండురు. వారలు చెలగిన తృటిలోన ముజ్జగంబులూ గెలచెదరు.

మనకుయింక కీడేమూడును. ఓ దానవకులనాథా, నిన్నువధిం చుటకు, నీపురంబు ధ్వంసమొనర్చుటకు భయపడిన వానరుం డొక్కడయినా ఆనేనయందు లేడు. రాఘవునితమ్ముడు యీ యుత్తరము నీకొసంగెను. గైకొమ్మనియని శుకసారణుండు తన చేతికివ్వగా నాదైత్యశేఖరుండు తనసచివునకు నిచ్చెను. ఆతండు దానిని చదివెనిట్లు. ఓరీ రావణా! గర్వమును విడువుము. యుద్ధ మునచచ్చి లంకారాజ్యమును పాడుచేయుటకు సంకల్పించ కుము. శ్రీరామామణి, సీతను రామునకిచ్చి క్షేమముగా నుం డుము. భక్తితో శ్రీరామచంద్రుని; సుగుణాభిరాముని ఇప్పు డయినా సేవించిన నిన్నాతడు బ్రోచును. ఇరువదిచేతు లున్న వనియూ శిరములపంక్తికలదనియూ గర్వించి యెల్లరుల భయ పెట్టి, నీవంశమును ధరణిని నశింపజేయకుము. దానవు లెంద రైనా నిన్ను బ్రోవజాలరుసుమా, ఓదశకంధరా! లక్ష్మణుం డను రఘురాముతమ్ముడను నీకు చెప్పుచున్నాను వినుము. అసురవిభుండు, లేఖచదివిన అగ్గివలే భగ్గుమని మండి, ఓరి శుకసారణా! నీకీలేఖ యెవ్వడిచ్చెనురా? వానిని వధించివచ్చి తివా, లేదా, యనిన ఆదైత్యుండు పక్కుమనినవ్వి పలికెనిట్లు. వానివధింపనాతరంబా? పదితలలుగలవారు పదివేలుమంది వానినితాకజాలరు. వానితో పోరుతగదు. దాశరధిపొందు గో రుము. ధన్యుడవయ్యెదవనెను. వికటముగానవ్వి ఓదాన వాగ్రీ! నామాటవిని జనకతనయను రామునకర్పింపవేని నీ కులము నాశనమగుటయేగాక నీప్రాణమునకు హానిరాకుండ యుద్ధము జరుగనేరదు. ధర్మమునువిడువక దయాసముద్రుం

డైన దాశరథిని, దైవంబని విశ్వసించినచో తప్పులేదు. ఓదనుజనాథా! అహంకారమెవ్వరికైనా తగదు. నామాటను మన్నించి, నామనవిని వినుడు. అనిన దైత్యనాయకుండు ఆగ్రహించి శత్రువులవలన లంచమును దింటివా? ఇంకు లేకుండ కారులరచెదవా, యని వక్షముపైని తన్నెను. అంత నాదైత్యుండు వెంటనే సభనుబాసెను. సముద్రమునుదాటి మాధవుని స్మరించుకొనుచూ, అద్దరిజేరి లక్ష్మణుని మతి కరిగించి, యిచ్చటజరిగినదంతియూజెప్పి, శ్రీరాముని భక్తి భజించి తనదైత్యరూపమును త్యజించి, భూస్థలినివిడచి శాశ్వితమోక్షమును గైకొనెను. ఆశుకసారణుండు జ్ఞానియైన మునిగానుండి, శాపవశంబున, దైత్యుండై బుట్టెను. ఇపుడు వనజనేత్రుని దర్శించి, దైత్యరూపమును త్యజించి, ధన్యుం డాయెను. పూర్వమొకప్పుడు కుంభసంభవుండు తనయాశ్రమమునకురాగా కానని యట్లునటించి, అగౌరవంబొనర్పగా “నీవు భూమియందు సురారివై బ్రతుకు” మని శపించెను. ఓపార్వతీ! శుకసారణుండు నేడు శ్రీరామునికృపచేత ధన్యు డాయెను. ఓలతాంగీ, అనంతరవృత్తాంతమును వినుము. అర్కకులుని ప్రకృతిపురుషునిగా భ్రమించి పలువురూ మాయకుంజిక్కి, సంసారమున పడియుందురు. ఎంతప్రార్థించినా సముద్రుండు యించుకంతైనా వినని హేతువున, ఇనకులుండు ఒక్కములికినికూర్చి విల్లెక్కుపెట్టెను. జడులు వెరపించినగాని చక్కబడరు యనెను. కుటిలాత్మునకు ప్రీతి; మూర్ఖులకు వినతి; కృపణులకు నీతి; క్రోధికి శాంతి; ఖలులకు భక్తి; కామాతురులకుభీతి; చవిటినేలను పండినబీజముల బోలునెనెను.

సముద్రము సంచలించి, నలనీలులచే సేతువును

—• కట్టుడని వేడుకొనుట •—

కోపమునటించి, రాముండు చాపమునుబూని, నిలచి నంతన జలధి సంచలనమొంది, బ్రాహ్మణాకృతిదాల్చి పళ్ళెరమున రత్నములుబూని రాముకడకేతెంచెను. ఓయనఘా! అర్కాన్వయోద్ధారకా, నేను జడుడను, మూర్ఖుడను, మూఢుడను, ఖలుడను, పశ్చాత్తాపతప్తుండను. రాముడవో, భీముడవో, లయాంతకుండవో, భూదేవిని కాపాడబుట్టిన ఆదిదేవుడవో, అంభోజాక్షా! రక్షింపుమా, ఓయర్కాన్వయోద్ధారకా! నీ పాదములగొల్వగ వచ్చితినని ప్రార్థించెను. మూర్ఖులు, శూద్రులు, స్త్రీలు, పశువులు దండనార్హములని బుధులందురు. నేనున్నూ దండనార్హుండనైనన్నూ, మీకు తగిన వెరవు నెరిగింప వచ్చితిని. ఓలోకనాథా యనుచూ, నీసైన్యమునందు నలుడు, నీలుడు యనెడి గొప్పబలపరాక్రమము గలవారున్నారు. వారు పాషాణములదెచ్చి, నాజలంబున పడ వైచిన, ఓవనరుహనయనా! అవి పడవలనలెనే తేలియాడ గలవనెను. బాల్యదశయందు వీరు ఋషులుండు వనమున మెలంగి, వారివారి సాలగ్రామములహరించి, ప్రతిదినమునా, నదిలో బడవేయుచుండిరి. అప్పుడాఋషులు, నలనీలుల శపించిరిట్లు. ఓనలనీలులారా! మీపెంకితనము ఇక సాగదు. మీరు గొని, జలమందు వైచునదియెల్ల శైలమైననూ, పడవరీతి, బెండువలె, తేలి, నీటిపై స్థిరముగానుండుగాక, యనిరి. వనరుహేక్షణా! నీబాణమునకు నేను శోషించి,

క్షమింతును. ఆ దేవిమిఫలము, సేతువునుగట్టి, మదియశః కేతు వనగా, నీజగతిని శాశ్వతకీర్తిని వహించి యుండుమనెను.

ఓయనఘా! రామచంద్రా! రామబాణ మమోఘ మనెదరు. నాదునుత్తరంబునగల కిరాతోత్కరంబుచెడి నశించక యున్నట్లు కరుణించి విడువుమనిన, శ్రీరాముండట్లు, ఆక్షణంబుననే యొనరించెను. తత్ప్రదేశంబు వెంటనే ధ్వంసమాయెను. పిదప, ఫలప్రదమై, ప్రకృతిసంపదలతో శ్రీరాము కటాక్షమున సశ్యశ్యామలంబై ఫలకుజంబులతో రాజిల్లుచుండెను. అంత సముద్రుం డెంతయో సంతసించి ఓమాధవాయని, రాముని నమస్కరించి రావణుని చరిత్ర యంతయూ రాఘవునకు దెలిపి వెడలివచ్చెదననుచూ సముద్రుండు సెలవుగొనియెను.

తులసీదాసుడు భక్తశేఖరుడు, నిర్దుష్టంబుగా రామాయణము వ్రాసెను. ప్రజలు భక్తిచే వినినా పఠించినా ధ్యానించినా, పాడినా తాపత్రయము లెల్లనణగి కామ్యంబులు చేకూరును. ఖలులతో జేసిన సాంగత్యమున చేకూరిన పాపములు వెంటనే తొలగును. సముద్రుండు వెడలి స్వస్థానమున సంతసించినట్లు దీనిం జదివినవారు విన్నవారు సంతోషింపగలరు. ఏవిధాన కిరాతులు నశించిరో ఆవిధంబున అఖిలసంసారదుఃఖము లంతరించును. భక్తులీగాధ నిష్కామ భావమున చదివినచో సంసారజలధిం దాటి దాపత్రయంబుల నణచి మోక్షసామ్రాజ్యంబు బొందగలరు. ఈకథాసుధారసధారగోరి వ్రాసినా పఠించినా విన్నా అట్టిభక్తవరులు ఆయురారోగ్యభాగ్యంబులు బొందిసంసారసంతుష్టి జెందగలరు.

క. మునినుత రవికులదీపా
వనజారి కళాకలాప, భావితరూపా
దనుజాంతక రోగరోపా,
వినుమత్ హనుమత్ప్రతాప, విదళితపాపా.

చ. సనకసనందనాది ముని । చంద్రనిషేవితసత్కథాసుధా
వనధిజ సద్యశఃకుముద । బంధుక రామృతధాత సర్వది
గ్జనపతిసంస్తుజన, సన్నుతజీవన, సర్వలోకపా
వన, సుజనావనా, యఖిలపాపవిమోచన, పద్మలోచనా.

మ. వినమితదనుజేంద్రా! విస్ఫురత్కీర్తిసాంద్రా!
త్రినయన నుతరామా! దేవతాసార్వభౌమా!
కునృపతిమదభంగా! కోమలశ్యామలాంగా!
జనహితమతిమంతా! జానకీప్రాణకాంతా!

ఇది, శ్రీ తులసీదాసు రచించిన హిందీరామాయణము
శ్రీ భాగవతుల నారశింహశర్మ విరచిత శ్రీతులసీ
రామాయణ పద్యకావ్యమును ఆంధ్రవచనరూప
మున రచించిన టంకాల సాంబమూర్తిగారి
అనువాదము సుందరాకాండము

సంపూర్ణం

శ్రీ రామార్పణమస్తు.

---